# బొల్లోజు బాబా – సాహిత్య అనుశీలన



బొల్లోజు బాబా రచనలపై వచ్చిన విశ్లేషణల వ్యాససంపుటి
2021

# బొల్లోజు బాబా – సాహిత్య అనుశీలన

2021













## బొల్లోజు బాబా రచనలపై వచ్చిన విశ్లేషణల వ్యాససంపుటి

# మనవి మాటలు

నేను ఇంతవరకూ

- ఆకుపచ్చని తడిగీతం (2008), వెలుతురు తెర (2016), మూడో కన్నీటిచుక్క (2019) పేరిట మూడు కవిత్వ సంపుటులు
- కవిత్వ భాష పేరుతో కవిత్వ లాక్షణిక వ్యాససంపుటి (2018)
- యానాం విమోచనోద్యమం (2006), ఫ్రెంచి పాలనలో యానాం (2012), మెకంజీ కైఫియ్యతులు-తూర్పుగోదావరి జిల్లా (2020) పేరిట మూడు చరిత్ర పుస్తకాలు
- స్వేచ్ఛావిహంగాలు పేరుతో (2016) విశ్వకవి టాగూర్ స్ట్రే బర్డ్స్ తెలుగు అనువాదం.

ఇదీ దాదాపు పాతికేళ్ల నా సాహితీయానం.

ఈ పుస్తకంలో ఉన్నవి నా పుస్తకాలపై వచ్చిన వివిధ వ్యాసాలు. చాలా మట్టుకు పత్రికలలో ప్రచురితమైనవి. మిగిలినవి ఆయాపుస్తకాలకు ముందుమాటలు.

ఈ వ్యాసాలన్నీ మరలా తరచిచూసుకొన్నాక నా రచనలన్నింటిలో కవిత్వ సంపుటులను ఎక్కువగా ఆదరించారని అర్థమైంది. ఈ వ్యాసాలు వ్రాసినవారికి, ఆయా రచనలను చదివి తమ తక్షణ అభిప్రాయాలను అక్కడకక్కడే తెలిపిన వందలాది మిత్రులకు సదా కృతజ్ఞతలతో

నా అన్ని రచనలను ఇక్కడనుండి దిగుమతి చేసుకొనవచ్చును

https://archive.org/details/@bolloju_baba

**భవదీయుడు**

**బొల్లోజు బాబా**

5/10/2021

విషయ సూచిక

# కాలుష్యం అంటని కవి

శిఖామణి



1991 ప్రాంతంలో ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఈ వారం కవిత శీర్షికలో బొల్లోజు బాబా పేరుతో కవిత చదివి ఆశ్చర్యపోయాను. మన బొల్లోజు బసవలింగం మాస్టారి గారి అబ్బాయి బాబా నా అనే సందేహం కలిగింది. సందేహం లేదు ఆ బాబానే. మా బాబానే. అప్పటికి ఒకటి రెండు సంవత్సరాలకు ముందే ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఈ వారం కవిత అనే కొత్త శీర్షిక లో నా కవిత రావాలి అని ఎంతో మంది కవులు అనడం విన్నాను. బాబాతో అదే అన్నాను. ఎవరి ప్రాపకం లేకుండా నీ కవిత ఈ వారం కవితలో వచ్చిందంటే ఇక నీకు తిరుగులేదు, రాసుకో పో అన్నాను. నాకు యానాం మట్టిలో పుట్టిన మరో కవిత్వ వారసుడు దొరికాడు అని ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయ్యాను. అయితే నా ఆనందాన్ని ఆవిరిచేస్తూ సుమారు దశాబ్ద కాలం పైగా అదృశ్యం అయిపోయాడు. ఇదిగో ఇపుడు ఈ 2009 లో ఒక **ఆకుపచ్చని తడిగీతం** గా విస్తరించి మనముందు ప్రత్యక్ష్యం అయ్యాడు.

ఈ బాబా ఒఠి బాబా కాదు. ఇతని వెనక సాహిత్య వారసత్వం ఉంది. అది వాళ్ళ నాన్నగారిచ్చిన సంపద. బొల్లోజు బసవలింగం మాస్టారు ఉత్త మాస్టారు కాదు. ఆయనకు తెలుగుతో పాటు, సంస్కృతం, ఆంగ్లం, ఫ్రెంచి భాషా సాహిత్యాలలో మంచి అభినివేశం ఉంది. "సువర్ణశ్రీ" పేరుతో ఆయన రచనలు చేసారు. ఆయన రాసిన సాంఘిక ప్రభోదాత్మక నాటకం "నేటి విద్యార్థి" మా కాలేజీ రోజుల్లో విద్యార్థులు విజయవంతంగా ప్రదర్శించేవారు. "ఆనందరంగరాట్ఛందం" గురించి కొంత పరిశ్రమ చేసారు. విద్యార్థినాయకునిగా ఫ్రెంచి పాలననుండి యానాం విమోచనోద్యమంలో చురుకైన పాత్రపోషించారు. అలాంటి సాహిత్య, సాంస్కృతిక వారసత్వం నుండి కవిగా ఎదిగొచ్చిన వాడు బొల్లోజు బాబా.

నీ కవిత ఈ వారం కవితలో వచ్చిందంటే ఇక నీకు తిరుగులేదు, రాసుకో పో అన్నాను -- శిఖామణి

ఈ తడిగీతంలోకి విస్తరించుకొంటూ లోపలికెల్తుంటే ఎందుకో నాకు 70 ల నాటి ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారి అనుభూతిగీతాలు, దానికి అజంతా రాసిన ముందుమాటా గుర్తుకొచ్చాయి. ఇప్పుడు ఈ పద్యాలు చదువుతుంటే బాబా కల్మషం అంటని కవిలా గోచరిస్తున్నాడు.

*హేమంతోత్తరీయాన్ని కప్పుకొన్న వనం*
*ఆకుల కొనల వేలాడే*
*మంచుబిందువుల భారాన్ని*
*మోయలేక అలసిపోతోంది.*

అంటూ మొదలయ్యే 'వెన్నెల నావ' ప్రయాణం అంతరంగపు లోతుల గుండా ప్రయాణించి మనల్ని అనుభూతి శిఖరం మీద కూచోపెడుతుంది. వాన కురవడానికి కవి ఊహించిన కారణం ప్రకృతి తన్మయీభావాన్ని ప్రకటిస్తుంది.

*మేఘాలూ నేలా*
*రాత్రి చుంబించుకొన్నట్లున్నాయి*
*తెల్లవార్లూ వాన కురుస్తూనే ఉంది //*
*సూర్యకిరణాల కిలకిలారావానికి*
*లిట్మస్ పేపర్ లా ఆకాశం రంగుమారింది.*

ఈ పంక్తులు కవిలోని రసాయినిక చర్యను మనకు పట్టి ఇస్తాయి. మొత్తం పర్యవసానం కవి ఆలపించే ప్రాచీన గీతానికి కాన్వాసును సిద్ధం చేయటమే!

*తడిసిన సీతాకోక చిలుక*
*కవిత్వంపై వాలి రెక్కల్లల్లార్చింది.*

అనడం ద్వారా ఒక రసార్థ్ర చిత్త హృదయాన్ని కవి పాఠకుని ముందు పరిచాడు. ముగింపు వాక్యాలు చదివాక పఠితల్లో ఒక కొత్త మనో ద్వారం తెరుచుకుంటుంది. అక్కడ్నుంచి అంతర్గత సంభాషణ మొదలౌతుంది.

ఒంటరి దీవిలో ఉన్న కవి ఒక సమూహం అంత శక్తిమంతుడు. సమూహంలో సంచరిస్తున్నా కవి అపరిచితుడు, ఒంటరికూడా! దీనికి కృష్ణశాస్త్రి సహపంక్తిలోని వాడు బాబా, లేకపోతే-

*అపరిచిత ప్రపంచంలో బతకటం అంటే*
*మబ్బుల మధ్య గుంపును కోల్పోయిన*
*కొంగపిల్ల తుమ్మచెట్టుకు గాయమై*

*వేలాడడమే!*

అని వ్రాయగలిగే వాడు కాదు. జ్ఞాపకం మానవజీవితాన్ని సౌందర్య విషాదాలలో ముంచితేల్చే అమృత గుళిక. జ్ఞాపకాలు లేనివాడు ముందు మనిషెట్లా అవుతాడు? అసలు కవెట్లా అవుతాడు. బాబా జ్ఞాపకం గురించి మూడు మధురమైన కవితలు రాసాడు. ఈ కవితలు చదివితే నల్లగేటు నందివర్ధనం చెట్టులో నేను రాసుకొన్న "ఎందుకొస్తావే జ్ఞాపకానికి మీరా" కవిత గుర్తుకొచ్చి హృదయం చెమ్మగిల్లింది.

*1. రాత్రయితే చాలు*
*ఋతువుతప్పని/వలస పక్షుల్లా*
*నీ జ్ఞాపకాలు/హృదయంపై వాలతాయి.*

*2. ఏకాంత సాయింకాలపు పలుచని వెలుతురులో*
*హృదయంలో విరిసిన సన్నజాజుల గానంలా*
*ఓ జ్ఞాపకం హాయిగా సలుపుతుంది.*

*3. ఆల్చిప్ప కన్నుతో/మామిడి చెక్కు ఒలిచినట్లుగా*
*జ్ఞాపకాల ఒక్కోపొరనీ/ఒలుచుకుంటూ పోతే*
*చివరకు ఒక స్ఫటిక సదృశ/కన్నీటి బిందువు మిగిలింది.*

ఈ పంక్తుల్లోని 'రుతువు తప్పని' మాట జ్ఞాపకం అనివార్యతనీ, 'హాయిగా సలపటం' జ్ఞాపకం యొక్క స్వభావాన్ని, చర్యనీ, స్ఫటిక సదృశ పదంతో దాని నిర్మలత్వాన్ని కవి ధ్వనిస్తున్నాడు.

భారతీయ సంస్కృతిలో 'గురు' సంస్కృతికి ఎంతో ఉన్నత స్థానం ఉంది. తల్లిదండ్రుల తర్వాతి స్థానం గురువులకిచ్చి గౌరవించిన సంస్కార సంపద మనది. శిష్యుల్ని అభిమానించి ప్రేమించే తత్వంలోని మాధుర్యగుణం అనుభవపూర్వకంగా తెలుసుకోవలసిందే! అలాంటి అనుభవం నుండి రాసిన 'సార్ గారండీ! సార్ గారండీ!'

వాని ఆలోచనల చురకత్తులు
పదును పెట్టుకోవటానికి

నా మెదడును సానరాయిని చేస్తాను.

నిజమైన గురువు చేయవలసింది అదే! అలాంటి శిష్యులనుండి 'బాగున్నారా మాస్టారూ' అన్న పలకరింపు కన్నా ఇంకేం కావాలీ జీవితానికి అంటాడు.

గురువు తరువాత అంతటి ప్రభావాన్ని చూపగలది పుస్తకమే! పుస్తకం చీకటిగదిలో దీపంలాంటిది అన్నాడు డా. బి.ఆర్. అంబేద్కర్. పుస్తకాన్ని చదవడంలోని అనిర్వచనీయమైన ఆనందాన్ని 'పుస్తకంలోకి నడవటమంటే' అనే కవితలో బాబా ఒడిసిపట్టుకొన్నాడు

*ఎప్పుడో, ఎక్కడో ఎవరో ఒకరు*
*ఆ పుస్తకాన్ని తెరుస్తాడు*
*ఒక జీవనది వాని గుండెల్లోకి*
*ప్రవహించటం మొదలౌతుంది.*

జీవనది ఆర్ధతకు, కదలికకు, చైతన్యానికి ప్రతీక. చలం అన్నట్టు ఈ పుస్తకాలు పటమల్లె గోడకి వేళాడేవి కావు. మంచికో చెడ్డకో జీవితాల్ని ప్రభావితం చేసేవి. ఉత్తమ పాఠకుడు కాగలిగిన వాడే 'ఉత్తమ కవీ కాగలడు' బాబా ఉత్తమ పాఠకుడని ఇలాంటి కవితలు సాక్ష్యమిస్తాయి.

ఈ సంపుటికి మకుటాయమానమైన కవిత 'యూజర్ నేమ్:మనిషి – పాస్ వర్డ్:మానవత్వం' కవిత. ఆధునిక టెక్నాలజీలో వచ్చిన సాంకేతిక పరిభాషను మనుషులు మర్చిపోతున్న మానవత్వానికి అన్వయించి రాసిన గొప్ప కవిత ఇది – అభివ్యక్తిలోనూ కొత్తదారులు తొక్కిన కవిత. కవిత అంతా చదివాక గొప్ప అనుకంపం మనసునిండా శరీరం నిండా ఆవరిస్తుంది. శక్తివంతమైన లక్షల మెగావాట్ల హైపర్ టర్బైన్లతో శరీరంలోని రక్తాన్నంతా బయటకు తోడిపోసిన ఒక డొల్లతనం భయపెడుతుంది. ఇంతాచేసి మనిషి ఇంతేనా అనిపిస్తుంది. ఈ వాక్యాలు చదవండి ఎంత భయపెడుతున్నాయో!

*జీవితం ఫోల్డర్ లోని శాంతి అనే ఫైలు*
*ఎంత ప్రయత్నించినా తెరుచుకోవటంలేదు.*
*దేవుడా! దయచేసి నా పాస్ వర్డ్*

*రిట్రీవ్ చేసి పెట్టవూ?*

ఈ నూతిలో గొంతుకను మనందరం వినితీరవలసిన అగత్యం ఎంతైనా ఉంది.

ఇంతటీ స్వచ్ఛకవినీ ఇస్మాయిల్ గారు అన్నట్లు 'బాధించే లోకపు ముల్లు' బాధిస్తూనే ఉంది. ప్రాచీన గ్రామీణ భారతం నుండి, ఆధునిక గ్లోబల్ విలేజ్ వరకూ ఈ దేశ మూల వాసుల్ని 'మీరేవుట్లూ' అని శూలంతో ప్రశ్నిస్తూనే ఉంది. అనివార్య సామాజిక సంఘర్షణలో కవి దానికి సమాధానం చెప్పుకోవడం 'బి.సి. అంటే ఎవరు నాన్నా' కవితలో చూడవచ్చు. సంపదను ఉత్పత్తి చేసే కులవృత్తుల పతనం తరువాత స్మశానంలా తీసుకోవటమే కానీ ఇవ్వటం తెలీని ఈ సమాజానికి తరతరాలుగా సంపదను అందిస్తున్న ఈ జీవిని ఎలా నిర్వచించాలి? అని మధన పడతాడు. పుట్టి పెరిగిన ఇంటిని చాలా ఏళ్ళ తర్వాత చూసినపుడు కలిగిన బాధ, లేని నాన్న టేబుల్ మీద వదిలి వెళ్ళిపోయిన చేతిగడియారాన్ని చూసినప్పుడు పడ్డ సంవేదన కవితాకృతులు దాల్చాయి.

ఆధునిక జీవనం – సిక్స్ పాక్ హృదయం, యూజర్ నేమ్, క్లోన్డ్ సంతతి, వినైల్ ప్రింట్లు, డిజిటల్ దినాలు వంటి అత్యాధునిక పరిభాషను అందించినా ఈ కవి మూలాలు పల్లె పట్టుల్లోనే ఉన్నాయని కొన్ని కవితల్లోని పద సంపద తెలియచెప్తుంది. విత్తనాలకై ఎండబెట్టిన బీరకాయ, ఆల్చిప్పకన్ను, గాలిమొమ్ము, కట్రాట, మట్టుపైని అణుగుకోడి, వరికంకుల కుంచె, పూడికతీయని బావి, ఎద్దుకు కొట్టే నాడాలు, చూరు అంచులు ఇవన్నీ నేటి నవనాగరీకుని అనుభవంలోకి రాని వస్తు సామాగ్రి.

ఇస్మాయిల్ గారి కవిత్వాన్ని ఇష్టంగ, కంఠదగ్నంగా చదూకొన్న ఈ కవి ఇస్మాయిల్ గారు పనిచేసిన పిఠాపురం మహరాజు వారి కాలేజీలో ఉద్యోగించటం యాదృచ్ఛికమే అయినా ఇక్కడ కూడా ముఖ్యంగా లఘు కవితల్లో ఇస్మాయిల్ గారు తొంగిచూడటం – మొదటి సంపుటి కనుక ఆహ్వానించదగ్గదే! దశాబ్దం విరామం తర్వాత కవిగా ముందుకొస్తున్న బాబాకు నా కవిత్వాలింగన.

శిఖామణి, కవి, విమర్శకుడు
ప్రొఫెసర్, తెలుగు యూనివర్సిటీ, హైదరాబాద్.
28 September, 2009

# ఆర్ధ్రకవిత్వపు వెన్నెల వాన

దాట్ల దేవదానం రాజు

కవిత్వ రచనా మమకారం దాచేస్తే దాగేది కాదు. రాయకుండా ఉండలేనితనం కుదిపి మరీ బయటకు తీసుకొస్తుంది. ఒక మెరుపు మెరిసినట్లు తళుక్కున కవిత్వపాదమేదో స్ఫురిస్తుంది. మననం చేసుకుంటూ అనవసరమైన దాన్ని పరిహరిస్తూ దొరికిన కాగితం మీదకు ఒంపుకోవాల్సిందే ప్రాకృతిక పారవశ్యాన్ని ఆత్మ సంవేదనలో ముంచి కవిత్వీకరించే పనైతే మరీను. హృదయ భారం తొలగి తేలికవ్వడం అంటే ఆరోగ్యహేతువైన ఔషదం దొరికినట్లే కదా! జీవన గమనంలో ప్రాధాన్యతా క్రమాల్ని ఎంచుకోవడంలోని తడబాటు భావనా ప్రపంచం కుచించుకు పోయేటట్లు చేస్తుంది. అయినా ఏ మూల నుండో ఒక ఉత్ప్రేరకం తట్టిలేపుతుంది. ఒకానొక అనివార్యత పరిమళం గుప్పుమనేటట్లు చేస్తుంది. కాలమో వృత్తో అనుబంధాలో బాధ్యతలో ఒత్తిళ్ళో మానసిక సంఘర్షణలో స్పర్శాతీత కల్లోలాలో ప్రవృత్తుల్ని ఎంతమాత్రం దహించలేవని బొల్లోజు బాబా ను పలికిస్తే అర్ధమౌతుంది. లోలోపలి చెమ్మను అనుభవించి పలవరించి కొత్తమొలకై చిగురించి తాజాగా తనను తాను మొలిపించుకునే ప్రయత్నమే బొల్లోజు బాబా చేసారు. పద్దెనిమిదేళ్లక్రితం ఆంధ్రజ్యోతి ఈవారం కవితగా ప్రత్యక్షమైనపుడు కవితాలోకం బాబా గురించి ఆరాతీసారు. మరలా ఇపుడు దోసిలనిండా కవిత్వ గుభాలింపుల్ని మోసుకుంటూ అక్షరకాంతుల్ని వెదజల్లుతూ ఆకుపచ్చని తడిగీతాలుగా పలకరిస్తున్నాడు. విరామం మాయమవడం కాదు. అందమైన కొనసాగింపుకు నిశ్శబ్దప్రయాణం అన్నమాట ఈయన విషయంలో అది నిజమైంది. తాను పరవశిస్తూ కవిత్వాభిమానుల గుండెల్ని మీటే పనిమీద బొల్లోజు బాబా ఉన్నాడని ఈ కావ్యం నిరూపిస్తున్నది.

ఎటువంటి సంధియుగంలోనైనా కవి నిస్తేజంగా ఉండలేడు. ప్రాపంచిక విషయాల పట్ల దూరాన్ని పాటించలేడు.
కవిత్వమే సాంత్వన చేకూరుస్తుందనే ఎరుక వల్ల బొల్లోజు బాబా కవిత్వాన్ని ఇంటిపెద్దగా సంభావించాడు. అలాగే మనిషిని చేసే శక్తి కవిత్వానికే ఉందని ఊరట చెందుతున్నాడు. -- దాదేరా

వీలున్న ప్రతిసందర్భంలోనూ శిఖామణి పలు సభావేదికలపై బొల్లోజు బాబా పేరు ప్రస్తావించకుండా ఉండలేదు. స్థానిక కవులు వెలువరించిన కవితాసంపుటుల్లో సైతం బొల్లోజు బాబా గురించి రాసి కవిని బయటకు తెచ్చే ప్రయత్నం చేసారు. అయినా కదలిక లేదు. అలాంటి బాబా ఆ మధ్య చక్కగా కవితల్ని డి.టి.పి. చేసుకుని వచ్చి ఆనందాశ్చర్యాలకు గురిచేసారు. గత కొంతకాలంగా ఇంటర్నెట్ లో సాహితీయానం.బ్లాగ్ స్పాట్.కాం అనే బ్లాగుద్వారా కవిత్వప్రేమికుల్ని అలరిస్తూ తన

అస్తిత్వాన్ని బలంగా గాఢంగా నిండారా సాంద్రకవిత్వంగా నింపుకుంటూ ఇపుడిలా కావ్యమౌతున్నందుకు ఆనందం కలుగుతున్నది.

కవిత్వం హృదయసంబంధి అన్న ఇస్మాయిల్ మాటలు నిజమే కదా అనిపిస్తుంది బొల్లోజు బాబా కవితలు చదువుతుంటే. వైయక్తిక అనుభూతిని సార్వజనీనంగా చిత్రించే కవితానిర్మాణం కరువై ఒక స్తబ్దత వాతావరణం ప్రస్తుతం నెలకొంది. తక్షణ స్పందనలతో కాసింత తాత్వికతను మేళవించడం లేదా గుప్పెడు నినాదాలై చిట్లిపోవడం లేదా ఆగ్రహావేశాల్ని హఠాత్తుగా కొని తెచ్చుకోవడమే కవిత్వంగా వదులుతున్నారనిపిస్తున్నది.

ఎటువంటి సంధియుగంలోనైనా కవి నిస్తేజంగా ఉండలేడు. ప్రాపంచిక విషయాల పట్ల దూరాన్ని పాటించలేడు. సమూహంలో ఏకాకితనపు జాడల్ని భరించలేడు. అంతర్లోకంలో వీచే గాలులకు మౌన ప్రేక్షకునిగా మిగిలిపోలేడు. అనుభవాలు ప్రశ్నల ఇసుకను కళ్లల్లో చల్లిపోతూనే ఉంటాయి. భావనా సంద్రంలో ఈదులాడినప్పుడు ఊహల్నీ ఆలోచనల్నీ నిర్బంధించే అడ్డుగోడలేవీ? భావుకుడైన వాడు మానసికంగా చేసే ప్రయణం కవిత్వమే అవుతుంది. ఒక సంఘటన ఒక మెరుపు ఒక ఆవేశం ఒక ఉద్వేగం ప్రేరణగా కవిత రూపు దిద్దుకుంటుంది. పదచిత్రం ద్వారా దృశ్యం సాకారమవుతుంది. అందుకే కవిత్వమే సాంత్వన చేకూరుస్తుందనే ఎరుక వల్ల బొల్లోజు బాబా కవిత్వాన్ని ఇంటిపెద్దగా సంభావించాడు. అలాగే మనిషిని చేసే శక్తి కవిత్వానికే ఉందని ఊరట చెందుతున్నాడు.

రాలిన పూలను తురుముకున్న కాలిబాట సుగంధాలను గానం చేస్తుంది. ఇక తన్మయత్వంతో తలలూపే పని బాటకిరువైపులా ఉన్న చెట్లదే. చందమామ నిద్రలో శిశువు పెదాలపై పరుచుకునే నవ్వులా ఉంటాడు. గులకరాళ్ళతో మాట్లాడే సెలయేరు వడివడిగా ప్రవహిస్తుంది. వెన్నెల్లోని మల్లెఛాయ వెలుగులో తిరుగాడే మిణుగురులు పగలు వెలిగే వీధి దీపాల్లా వెలవెల బోతాయి. వెన్నెల నావనెక్కి రాత్రి ఒంటరిగా వేకువ తీరానికి సాగిపోతుంది. ఇలా మనం 'వెన్నెల నావనెక్కి' కవితలో శుభ్ర స్వచ్ఛ కవిత్వ రసాల్లో తేలిఆడేటట్లు చేస్తారు బొల్లోజు బాబా.

వేళ్లను మట్టికింద కప్పెట్టిన స్వార్థం, పక్షిపిల్ల సౌందర్యాన్ని తనలో దాచుకున్న గుడ్డు జాణతనం, అద్భుత శిల్పాన్ని ధరించిన రాళ్ళ మొండితనం, వీటిని చూస్తూ మదినిండా నింపుకున్నప్పటికీ చిరునవ్వు చాక్లెట్ ఇవ్వనందుకు అందంగా నెపాన్ని ప్రేయసిమీద పెడుతున్నాడు. ఇవ్వకపోయినా గుండె కన్నీళ్ళను కలల కర్చీఫ్ తో తుడుచుకుని హాయి అనుభవిస్తున్నాడు కవి గడుసుతనంగా.

ఎవరో మహానుభావుడు కాసిన్ని అక్షరాల్ని కాలానికి అర్ఘ్యమిస్తాడు. ఊహల ఛాయలతో పిడికెడు ఆలోచనల్ని పుటలపై చల్లుతాడు. ఎవరో (ఆయనకూడా

మహానుభావుడే) ఆ పుస్తకాన్ని తన హృదయ కవాటాల్ని తెరుచుకొని అవలోకిస్తాడు. అంతే ఒక సంగీత మేఘం తేనె పాటల్ని వర్షిస్తుంది. అక్కడితో అయిపోలేదు. ఆ రాగ స్పర్శకు మనోయవనికపై ఓ అపరిచిత అరణ్యం మొలకెత్తుతుంది. బొల్లోజు బాబా ఒక రసావిష్కరణ జరిగిపోవడంతో సరిపెట్టుకోడు. పుస్తకంలోకి నడవటాన్ని పరిచిత పాత్రలోకి మనల్ని మనం ఒంపుకునేట్టుగా మలుస్తాడు.

నోస్టాల్జియా తాలుకు జ్ఞాపకాలు కవులకెప్పుడూ ముడిసరుకే. ఇంకోపక్కనుంచి మనవి అనుకున్న అనుభవాల్ని ఏదోరకంగా వెల్లాడించి జ్ఞాపకాల్ని శాశ్వత పరచుకోవడానికి కవులు తాపత్రయపడతారు. అందుకు బాబా మినహాయింపు కాదు. అంతర్మూఖీనంగా నిక్షిప్తమైన భావనా శకలాలు 'ఓనా ప్రియ గృహమా' అంటూ ఎలుగెత్తి చెప్పేలా దృశ్యమానం అయ్యాయి. కాంక్షాతీరాల వెతుకులాటలో పోగొట్టుకున్న గుప్పెడుమట్టిలో నిన్నునేను కోల్పోయాను అంటూ తనదంటూ అస్తిత్వం ఇంకా అక్కడే చిక్కుకున్నదని మధనపడతాడు.

వికృతమీడియా సంస్కృతిలో సర్వవ్యాపిత దుఃఖానికి మరోకోణం ఉండకూడదనే నిరసననీ, నగరం విసర్జించిన నాగరికతను ఏరిపారేసే పారిశుద్ధ్య కార్మికులనీ, చిల్లుల ఒజోను పొర కప్పుకొని వుండవుతున్న పర్యావరణాన్ని, తనకే స్వంతమైన అచ్చమైన ప్రేమనీ, మానవసంబంధాల వైరుధ్యంతో చిట్లిపోయిన అస్పత్రిలో ఓ చావునీ, రత్యానంతర దేహాల్లో మిగిలిన రోదనా ప్రవాహాన్నీ, రెక్కల టపటపల గమకాన్ని పలికించే పిచ్చుకల అదృశ్యాన్నీ..... ఒకటేమిటి బొల్లోజు బాబా అనుభవసాంద్రతలోని అణువణువు కవిత్వమై పరిపూర్ణంగా వికసించే మెట్టు ఎక్కడానికి సిద్ధంగా ఉంది. మానవత్వపు సారాంశంలో స్పందించే గుణం పుష్కలంగా ఉన్న బాబా మరింత గాఢత సాధించే దాఖలాలు ఇందులో చాలా ఉన్నాయి.

కవి చరిత్రకారుడైన తండ్రి బొలోజు బసవలింగం (సువర్ణశ్రీ) వారసత్వాన్ని అందిపుచ్చుకున్న బాబా గొప్ప నమ్మకాన్ని వాగ్దానాన్ని ఈ తొలి కవితాసంపుటి ద్వారా ఇస్తున్నందుకు మనసారా అభినందిస్తున్నాను. ఒక గమ్యం దిశగా బాబా పయనం పురోగమించగలదని ఆశిస్తున్నాను.

యానాం 4-9-09

దాట్ల దేవదానం రాజు

# ఆకుపచ్చని తడిగీతం - కొన్ని ఆలోచనలు

జి. వెంకట కృష్ణ

మేఘాలూ నేలా
రాత్రి చుంబించుకొన్నట్లున్నాయి
తెల్లవార్లూ వాన కురుస్తూనే ఉంది
తడిసిన సీతాకోక చిలుక
కవిత్వంపై వాలి రెక్కలల్లార్చింది (మొదటి కవిత)

ఎవరు చూస్తారని
ఈ భావాలకు రెక్కలు తొడిగి
నీలాకాశంలోకి ఎగరేస్తున్నాను
ఏమో తెలీదు బహుసా
గాలికీ పిట్టకీ చెట్టుకీ కూడా తెలీదేమో! (ఆఖరు కవిత)

బొల్లోజు బాబా రచించిన “ఆకుపచ్చని తడిగీతం” లోని ప్రతిగీతంలోనూ ఇలాంటి ప్రకృతిలో తడిసిన వాక్యాలే. ప్రకృతిలో ఉన్న “గాలీ, పిట్టా, చెట్టూ” లకు సంబంధించిన ప్రతీకలే ప్రతి కవితలోనూ కనిపిస్తాయి. వాటన్నిటి మధ్యా అక్కడక్కడా మనిషి-మనిషి చర్యలూ, ఆలోచనలూ అల్లుకొని వున్నాయి. మనిషి జీవితం అంతా ప్రకృతి తడిగీతలో భాగమనీ, అది కాకుంటే అతడి ఉనికి అపరిచిత ప్రపంచంలో బతకడమే నంటాడు కవి (మట్టికనుల నా పల్లె). ఆ అపరిచిత ప్రపంచం — పల్లెకు, ప్రకృతికీ కానిది. అది ఒక్కోసారి నగరం, ఒక్కోసారి ఆసుపత్రిలోని చావు లేదూ ఒకానొక రెడ్ లైట్ ఏరియా లాంటిది.

ఆశ్చర్యంగా ఒక మృత్యుస్పర్శ, ఆద్యంతమూ ఈ కవిత్వంలో వుంది. రకరకాల పదచిత్రాల్లో నైరూప్య/రూప్య మరణ భావన ప్రత్యక్షంగా, పరోక్షంగా చిత్రించివుంది. మృత్యువు కూడా ప్రకృతిలో భాగమే ఈ కవికి.

> సౌందర్య విధ్వంసాల్ని రెండింటినీ కలగలిపి చెప్పటం, ఒక తాత్విక స్థాయిలోకి తీసుకెళ్ళటం ఆశ్చర్యం కలిగిస్తుంది.

తూనీగై మబ్బుల్ని ముద్దాడిన ఉదయంలా
రాలిపోనూ వచ్చు లేక

పండులా ఫలించిన సాయింత్రమై పగిలిపోనూ వచ్చు ---- ఇట్లా. సౌందర్య విధ్వంసాల్ని రెండింటినీ కలగలిపి చెప్పటం/ఒక తాత్విక స్థాయిలోకి తీసుకెళ్ళటం ఆశ్చర్యం కలిగిస్తుంది.

ప్రకృతి తడి నుండీ గ్లోబల్ వార్మింగ్ దాకా సాగింది కవితా నిడివి. ప్రకృతి విధ్వంసానికి సంబంధించి పోలవరం కవిత గొప్పగా ఉంది. గ్లోబలైజేషన్ చుట్టూ కొన్ని కవితల్లో పెయింటర్ మీదా, పిచ్చుకలు లేని లోకం గురించి, నలిగిపోతున్న స్ట్రీట్ చీమల గురించి (చీమలనటం కూడా బడుగుజీవుల్ని-ప్రకృతిలో భాగంగా చూడ్డమే). దేవునికి వేలాడే ప్లాస్టిక్ దండ/ ఎప్పటికీ వాడని కోపం గా వర్ణించడం దాకా యీ వ్యక్తీకరణ కన్పిస్తుంది.

ఈ కవికి నగరం అంటే ఏమిటి- మట్టికనుల తడిలో గుండెను వదిలి వచ్చినప్పటి అపరిచిత ప్రపంచం, రెండుదేశాలు కవితలోని మెట్రోనగర జీవితం ఏం చేస్తుంది? తను వదిలిన వ్యర్థాలను (భౌతికమైన/తాత్వికమైన) కొందరి శ్రమను దోపిడి చేసి శుభ్రం చేయించు కుంటుంది. ఆసుపత్రుల్లో మానవత్వపు పాస్ వర్డ్ మరచిపోయిన మనుషులూ, పక్కింటి అబ్బాయిని ఆత్మహత్యకు పురిగొల్పే హేతువులూ, రెడ్ లైట్ ఏరియా దైన్యాలూ, టివి గొట్టాల వాడి అసందర్భపు మాటలూ ఇలాంటి వాటిని ప్రేరేపిస్తుంది.

సూర్యనమస్కారాలు చేసుకోవడానికీ నగరం అనుమతించనంత యిరుకుగా, దట్టంగా వుందంటాడు కవి. బిసీలగురించి వాపోయే కవికి సూర్యనమస్కారాలు కూడా అవసరమేనా!

“బిసి అంటే ఎవరు నాన్నా” కవితలో గ్రామాలమీద నోస్టాల్జియా వల్ల గ్రామంలో కులం ఎవరి ఆధిపత్యం కింద నలిగిందో కవి గుర్తించాడా? అగ్రవర్ణ బ్రాహ్మణీయ ఆధిపత్యాన్ని సంకేతించకుండా యీ కవిత కొన్ని ఖాళీలు మిగుల్చుకొందేమో! కవి ఆలోచించాలి.

“స్మశానంలా తీసుకోవటమే కానీ ఇవ్వటం తెలీని
ఈ సమాజానికి తరతరాలుగా అందిస్తూనే ఉన్న
ఈ జీవిని ఎలా నిర్వచించాలి?” -- అన్నప్పుడు అది గ్రామీణ సమాజమే కదా- ఆ గ్రామీణ సమాజపు గతితార్కికతను కవిత పట్టుంటే బాగుండు.

ఇదే కవితలో

"ద్రోణాచార్యుడు ఒక వేలే అడిగాడు కానీ

పారిశ్రామిక విప్లవాచార్యుడు కోరిన

వేన వేళ్ళ దేహాల సంతతి అని చెప్పనా?" – అనటం వృత్తుల విధ్వంసాన్ని చెప్తుంది కానీ, కులం పేరుతో భారతీయ వ్యవస్థ చేసిన సకల దుర్మార్గాల్ని మరుగున పరుస్తుంది. కవి మన వ్యవస్థలో తప్పుల్ని పెట్టుకొని ఆధునిక యుగపు రహదారుల్ని వేలెత్తి చూపితే ఎలా? పారిశ్రామిక విప్లవాన్ని నెగేట్ చేస్తే- కవి ఎట్లా ఆధునికుడవుతాడు. అయితే పారిశ్రామిక విప్లవం వలసవాదం రూపంలో (సామ్రాజ్యవాదం) చేసిన విధ్వంసాన్ని పట్టించుకోవాల్సిందే- అప్పుడు ఇప్పటి గ్లోబలైజేషన్ కు మొదటి రూపమైన వలసవాదాన్ని కవి గురిచూడాల్సి వుంటుంది.

ప్రకృతిని అతిగా ప్రేమించీ/ప్రకృతిని తన మౌలిక వ్యక్తీకరణగా చేసుకొనే కవులు తమకు తెలీకుండానే "పాతలో" అంతా మంచే చూస్తారా? లేక సమస్యను లొకేట్ చేయడంలో దృష్టి లోపానికి గురి అవుతారా? అనిపిస్తుంది.

ఒక ఆటో రిక్షావానిలోని మానవత్వం గురించి

"పుడమి లోతుల్లోంచి

మరో ఉదయం బయటపడతాది

దాన్ని తవ్వితీసిన తల్లి పాడికనులు

ఇతనిని తడిగా చూసిన చూపుల భాషలోనే కదా

ఈ లోకపు కీర్తనలన్నీ వ్రాయబడ్డాయి" అనటం చాలా గొప్పగా ఉంది.

పోలవరం మీదా, పాపికొండల మీదా కవితలు చాలా హృద్యంగా ఉన్నాయి. "రైలును" "ఇనుప అనకొండ" అనటం కొత్త పద ప్రయోగం. "పిటపిటలాడే" అనే పదాన్ని చాలా చిత్రంగా విశేషణంగా/ క్రియగా వాడటం కొత్తగా ఉంది. " చీకటితో పిటపిటలాడే తుఫాను రాత్రి" (పే.నం. 63) "పిటపిటలాడుతూ ప్రకాశించిన పగలు" (పే.నం. 60).

"ప్రొడిగల్ సన్స్" కవిత కాలేజీ చదువులకని/ ఇల్లు విడిచిన పిల్లలు/ ఇంకా తిరిగి రాలేదు తో ప్రారంభమై ఆ యింటి వొంటరి తనాన్ని గాఢంగా చిత్రిస్తుంది...... పాదముద్రలను/ కెరటం నోట కరచుకుపోయింది/ మౌనం పంజరంలా దేహంపై దిగింది అంటూ సాగుతుంది.

ఈ కవిత్వమంతా ఒక పురా ప్రపంచపు లోతుల్లో మునకలేసి తడిసి బరువుగా తాత్వికంగా అనిపిస్తుంది. అటునుంచీ ఆధునికతనూ అంతో యింతో వ్యక్తీకరిస్తుంది. ఆ యింత కూడా మార్మికంగా వ్యక్తీకరిస్తుంది. "ఆఖరుకు కాలం దిబ్బపై మొలిచిన పిచ్చిమొక్కలు కూడా క్లోన్డ్ సంతతిలా అనిపిస్తాయి" (పే.నం. 22). ఈ వ్యాక్యానికి "జెక్స్టా పోజ్" లో యితని కవిత్వముంటుంది. ఆఖరుకు ఆధునికతకు మొలిచిన వెర్రివేషాలు కూడా/ మంత్రముగ్ధ ప్రకృతిని అద్దుకున్నాయి" లాగ.

ఈ కవిత్వంలో మాటవరసకు "శ్రీశ్రీ' అయితే కనిపించాడు కానీ, పోరాటయోధులైతే కన్పించరు. తెలుగునేలను ఎంతో ప్రభావితం చేసిన విప్లవోద్యమం-దాని ప్రతీకలు కన్పించవు. కన్పించినవి లో ప్రొఫైల్ లో కన్పిస్తాయి. "సెంటు స్థలంకోసం పోరాడే ప్రాణాన్ని తూటా తన్నుకు పోయింది" (రెండు దేశాలు), "కోరికకు సాఫల్యానికి/ మధ్య అగాథం/ చితిలో ఇంకా నిప్పుంది/ పోరాడాల్సిందే" (పే.నం. 83). ఇంకొంచెం పోరాటం ఈ కవినుంచి ఆశించటం అత్యాశకాదు కదా!

ఇన్నిలో ఎన్నున్నా లేకున్నా "ఆకుపచ్చని తడిగీతం" పాఠకుల్ని ముంచెత్తుతుంది, స్నానం చేయిస్తుంది, శుభ్రం చేస్తుంది.

జి. వెంకట కృష్ణ, కర్నూలు

సూర్య దినపత్రిక , 4-5-2015

# ఆకుపచ్చని తడిగీతం –పరిచయం

శ్రీనిక

పుట్టిన ఊరిపై ప్రేమని తన బ్లాగు పేరులో (సాహితీయానం) మమైకం చేసుకుని ఏప్రిల్ 27, 2008 న బ్లాగు లోకం లో తనని తాను ఆవిష్కరించుకున్నారు. అప్పటినుండి ఒక ప్రవాహమై సాహితీ సేద్యం లో మడమ తిప్పలేదు. కవితలు, సమీక్షలు, వ్యాసాలు, అనువాదాలు ఇలా అనేక ప్రక్రియల కూడలిలో ఒక చిరునామా స్వంతం చేసుకున్నారు.

వృత్తిరీత్యా జంతుశాస్త్ర అధ్యాపకుడైనా. అధ్యయనం చేసింది మాత్రం ప్రకృతిని, మానవ సమాజాన్ని అనిపిస్తుంది.

సంవత్సరకాలంగా బ్లాగుల్లో వెబ్ పత్రికలలోను, ఆంధ్రభూమి, కవిత వంటి పత్రికలలోను అచ్చయిన కవితలను ఒకేచోట చదవాలనుకునేవారికి రచయిత ఆకుపచ్చని తడిగీతం అను పుస్తకంగా తీసుకురావడం జరిగింది.

ఒంటరి దీవిలో ఉన్న కవి ఒక సమూహం అంత శక్తి మంతుడు, సమూహం లో సంచరిస్తున్నా కవి అపరిచితుడు, ఒంటరికూడా ! దీనికి కృష్ణశాస్త్రి , శ్రీశ్రీ ల సహపంక్తిలోని వాడు బాబా…లేకపోతే

అపరిచిత ప్రపంచం లో బతకటం అంటే
మబ్బుల మధ్య గుంపును కోల్పోయిన
కొంగపిల్ల తుమ్మ చెట్టుకు గాయమై
వేలాడడమే !

అని వ్రాయ గలిగే వాడు కాదు అంటారు ముందుమాటలో శిఖామణి.

★★★

> ప్రకృతిలోకి ప్రవహించడమంటే దాని తత్వాన్ని తెలుసుకోవాలి. ప్రేమ, విరహం, సృష్టి, విధ్వసం ఇవన్నీ అర్థం చేసుకోవాలి. సహజంగా బాబా సౌందర్యపిపాసి. అందుకే ప్రకృతిలో తడిసి ముద్దయి ఆకుపచ్చని తడిగీతం పాడుతూ మనల్ని సీతాకోక చిలుకల్ని చేస్తాడు.

"Poetry, which can not be shelled like a city
or white washed like Murals,
crushed like sculpture,
closed like theaters,
or even banned and censored
as easily as Novels and Journals

can spread and be influential

even without print or manuscript"

-MIKLOS VAJDA

మనం అపుడపుడూ తడిసి పోతూంటాం. తడిసినపుడల్లా తుడిచేసుకుంటాం. పొడిగా ఉండాలి కాబట్టి. ఎంత పొడిగా ఉండాలనుకున్నా మళ్ళీ మళ్ళీ తడిసి పోతూనే ఉంటాం. అయితే ఈ తడిని వేరెవరికైనా ప్రసరింప చేస్తే జలపాతమై, హోరుని, జోరుని సంతరించుకొని ఒక గీతంలా ధ్వనిస్తుంది, లాలిస్తుంది, ధైర్యానిస్తుంది, ఓదార్చుతుంది,గర్జిస్తుంది. ఏదైనా చేస్తుంది. దాన్ని ఆపడం ఎవరితరం కాదు. బాబా లోని ఈ తడిని ప్రతి గీతం లోనూ చూస్తాం.

ప్రకృతిలోకి ప్రవహించడమంటే దాని తత్వాన్ని తెలుసుకోవాలి. ప్రేమ, విరహం, సృష్టి, విధ్వసం ఇవన్నీ అర్థం చేసుకోవాలి. సహజంగా బాబా సౌందర్యపిపాసి. అందుకే ప్రకృతిలో తడిసి ముద్దయి ఆకుపచ్చని తడిగీతం పాడుతూ మనల్ని సీతాకోక చిలుకల్ని చేస్తాడు.

హేమంతోత్తరీయాన్ని కప్పుకున్న వనం
ఆకుల కొనల వేలాడే
మంచు బిందువుల భారాన్ని
మోయలేక అలసిపోతూన్న
వైనాన్ని వెన్నెల నావనెక్కి చూడాల్సిందే..

కాదేది కవిత కనర్హం అనుకుంటే… సెలవుల్లో కాలేజి…మినహాయింపేమీ కాదు. ఇందులో పదచిత్రాలు మచ్చుకి రెండు..

ఉపన్యాసాల పావురాలను
ఎగరేసే తరగతి గదులు//.
తమపై వ్రాసిన ప్రేమరాతలను
చదువుకుంటూన్న చెక్కబల్లలు//.

ఈ కవితలో వేడాంతగళ్ అన్న పదానికి అర్థం ఇచ్చి ఉండాల్సింది.
నేలకి నెరళ్ళు చేసి పైకొచ్చిన అంకురాన్నే అందరూ చూస్తారు. కానీ తల్లి నుండి వేరయి విత్తనం మొలకెత్తడం లో పడ్డ ఘర్షణని చూస్తాడు బాబా మట్టి కనుల నా పల్లె కవితలో

బ్రతుకు మీద ప్రేమ, నమ్మకం , ఇన్ని అసందర్భాల మధ్య , వైరుధ్యాల మధ్య వికృతులమధ్య, విషాదాల మధ్య, ఓటమిలమధ్య, విజయాల మధ్య, నీకు నేనని, నాకు నువ్వని వివాహ బంధం కట్టి పడేస్తుంది. అయినా ఎవరి ఆశలు, ఆశయాలు, పరిధులు,

శరీరాలు ఒకదానికొకటి
ఎంత వెలిగించుకుని కరిగించుకున్నా
అన్యోన్య దాంపత్యం లో కూడా
నువ్వు నువ్వే-నేను నేనే అంటాడు.

వంచనా భీభత్స సర్వస్వం లో మానవునికి తనకంటూ మిగిలిన ఒకే ఒక్క ఆయుధం శరీరం అందుకే, అది ఆత్మహత్య కాదు అది ఒక అణు విచ్ఛేదనం…అంటారు ఖాదర్ మొహియుద్దీన్ ఆత్మ హత్యాగ్రహం అన్న తన కవితలో..

పక్కింటబ్బాయి ఆత్మ హత్యాయత్నం లో చచ్చినవాడు బ్రతుకుతూ, బ్రతికున్న వారిని జీవితాంతం చంపటం లో ఉన్న తడి మన కళ్ళని నీళ్ళ మడుగు చేస్తుంది అంటారు బొల్లోజు బాబా

కొంచెం ఇటు తిరిగి ఏడవండి అన్నప్పుడు బ్లాగులో వచ్చిన స్పందన చూస్తే బాబా పోగొట్టుకున్న యూజర్ నేమ్-పాస్ వర్డ్ దేవుడు రిట్రీవ్ చేసాడనిపిస్తుంది.

అందరూ పొడిగా ఉంటే కవి తడిసి పోతాడు. తడి మాత్రం బయటకి కంపించదు. కళాధార జీవితాల్లో ఆధునికత అన్నివైపులనుంచీ కమ్ముకునే శీతవేళలా వాడి (పెయింటర్) ని మింగేసింది వాడి ఉపాధి స్వప్నం లా జారి పోయింది. అంటూ మనందరినీ తడిపేస్తాడు. పెయింటర్ కవితలో

మనలోకి మనమెప్పుడయినా నడుచుకుంటూ పోతే మనకేం కనిపిస్తాయి. విజయాలు, వైఫల్యాలు, ఆశలు, నిరాశలు, నిట్టూర్పులు. ఆత్మలోకంలో సంచరించుకుంటూ పోతే మనలో మనం ఖాళీ అయి పోయి మన లోపాల ముందు నగ్నంగా నిలబడతాం.

కాంక్షాతీరాల వెతుకులాటలో తను పోగొట్టుకున్న గుప్పెడు మట్టిలో తన అస్థిత్వ శకలాలు ఇంకా చిక్కుకునే ఉన్నాయంటాడు. ఓ నా ప్రియ గృహమా ! అన్న కవితలో

ఆస్పత్రిలో ఒక చావు తో ఖాళీ అయింది ఒక దేహమే కాదు. మనమూ అభావమై తిరిగి భవిష్యత్తులోకి వెళ్ళాల్సిందే.. ఆసుపత్రిలో ఒక చావు లో కవితా

లక్షణాలు కొరవడి వచన లక్షణాలు మెండుగా చొరబడి నప్పటికీ మనం తడిసి ముద్దవుతాం.

రెండు కళ్ళతో మనం దేన్నైనా ఒకటిగా చూస్తే ఇక్కడ బాబా తన రెండు
కళ్ళతో రెండు దేశాలు చూస్తాడు.

సాగరతీర సాయంత్రం విరామం తీసుకోకుండా అంతరించి పోతున్న పిచ్చుకలపై వాపోతాడు. మనం కేవలం మనకోసమే జీవిస్తున్నామా? మన ఉద్యోగం మనకోసమే చేస్తూన్నామా? ఖచ్చితంగా కాదు. ఒక గుమస్తాచేసే పని తనది కాదు. ఒక ఇంజనీరు తన కోసం డాం కట్టుకోడు. మనం ఎంతో మందికి పని చేస్తాం. మనకెంతో మంది పని చేస్తారు.

మెలకువ గాజు పెంకులపై(అతను)
నైట్ షిఫ్టు కేబిన్ మాస్టర్
చేసిన తపస్సు ఫలితంగా
నిదురించే ప్రయాణీకులు
తమ తమ గమ్యాలలోకి మేల్కొంటారు.... అనటంలోని అంతరార్థం ఇదే.

మినికవితలు తిరగేస్తూంటే హఠాత్తుగా అవని ఏమంది? అని అడుగుతాడు. అంతరించి పోతున్న పాపి కొండలు మిగిల్చే ముళ్ళగాయాలు మానక ముందే పోలవరం నిర్వాసితుల కోసం మరో తడి గీతాన్ని నిలబెడతాడు.

ప్చ్… ఇప్పటికీ
ఈ ప్రపంచం లోయలోనే ఉంది అంటాడు నిర్వేదంగా.

అక్కడ అక్కడ ఇస్మాయిల్ ప్రభావం కనిపిస్తుంది. అంతేకాదు కొన్ని చోట్ల సార్వజనీనత లోపించింది. కొన్ని కవితల్లో వచనం కవిత లక్షణాల్ని హరించినప్పటికీ అస్థిత్వ వేదన మనకర్థమవుతుంది.

ఏదైనా పుస్తకం లోకి నడవటమంటే
పరిచిత పాత్రలలోకి
మనల్ని మనం ఒంపుకోవటమే కదా! అంటాడు. గొప్ప వ్యక్తీకరణ ఇది.

ఎవరు వింటారని ఈ అక్షరాలను
వెదురు రంధ్రాల గుండా
ప్రవహింప చేస్తున్నాను ! అని అంటాడు.. ఎందుకు ? కవితలో
సమాజంతో మన బంధాన్ని electrify చేసుకోవడమే కవిత్వమని ఈ కవిత్వ సంపుటి నిరూపిస్తుంది.

DECEMBER 27, 2009, పుస్తకం.నెట్ లో ప్రచురణ

# ఆకుపచ్చని తడి గీతం – బొల్లోజు బాబా

కుమార్ వర్మ కె.కె.

బొల్లోజు బాబా గారు బ్లాగు సాహితీయానం అందరికీ సుపరిచితం. కవిత్వం మనసులోని మలినాలను శుభ్రం చేస్తుందని నాకు ఒక నమ్మకం కలిగించిన కవి బాబా గారు. ఈయన కవిత్వం నిండా పరచుకున్న ప్రతీకలు చాలా సరళంగా సూటిగా మన అనుభవంలోంచి తీసుకొని రాసినట్టుండడం ఈ కవి గొప్పతనం. జీవితం నిండా పరచుకున్న అన్ని అనుభూతులను సుఖ దు:ఖాలను జరుగుతున్న ఆపలేని కొన్ని సంఘటనల పట్ల ఆగ్రహాన్ని ఆవేదనను కలగలిపి పాఠకుని చెంతకు చేర్చి ఆలోచింప చేసే కవిత్వం నిండుగా వుంటుంది. రోజు వారీ వార్తలను యాధృచ్ఛికంగా చదివి మరిచిపోయే ఘటనలను కూడా తాను కవితగా మలిచి దానికో చారిత్రక సందర్భాన్నిస్తారు కవి. తను అనువదించిన నెరూడా, ఠాగూర్ మరియు తనకిష్టమైన ఇస్మాయిల్ గారి కవితాధార తనదైన సున్నితత్వంతో ప్రతిఫలిస్తారు కవి. తన చుట్టూ అల్లుకుపోయిన కుటుంబ బంధాన్ని అందులోని మాధుర్యాన్ని ఎత్తుపల్లాలను కూడా అంతే స్థాయిలో చెప్పడం తన నిక్కచ్చితనానికి నిదర్శనం. అలాగే జ్ఞాపకాలను అంతే సాంద్రతతో మన కనులముందు తన కవితా కుంచెతో ఇంద్రధనస్సులా పరచి చూపడం బాబా గారికి వెన్నతో పెట్టిన విద్యలా మనకు ఈ సంపుటిని చదివితే అవగతమవుతుంది. కవి హృదయంలోని సున్నితత్వం ప్రతి కవితలోనూ మనకనుభవైకవేద్యమతుంది. అలాగే తాను స్పందించిన విధానం తనతో పాటు మనల్ని అదే అంతర్లోకానికి చేరువ చేస్తుంది.

> ఈ సంపుటినిండా చిక్కని కవిత్వం అల్లుకు పోయివుంది. వేశ్యల బతుకుల గురించి, బాలకార్మికుల గురించి ఎంతో వేదనతో రాసిన కవితలు కవి సామాజిక కోణాన్ని మనకు చూపిస్తాయి.
>
> అంతే స్థాయిలో కవిత్వం నిండా ఒక తడి ఆరని సౌందర్యం పరచుకొని ఉంది.

తనెంచుకున్న వస్తువును ఒక కొత్త వ్యక్తీకరణతో ఉపమానాలతో సరికొత్త రంగుల కాన్వాసుపై చిత్రించిన ఈ 'ఆకుపచ్చని తడిగీతం' కవిత మకుటాయమానం. కవి సునిశిత పరిశీలనాసక్తి అబ్బురపరిచినట్లైతేనే ఆ కవిత పాఠకుని హృదయాంతరాలలోకి ప్రవహిస్తుంది కదా. ప్రకృతితో పారవశ్యం చెందని కవి అరుదు. ఈ కవితలనిండా ఆ తడి పరచుకొని వుంటుంది. అందుకు ఈ కవితా పాదాలు కొన్ని సూచికలు మాత్రమే.

మేఘాలూ నేలా
రాత్రి చుంబించుకొన్నట్లున్నాయి.
తెల్లవార్లూ వాన కురుస్తూనే ఉంది.

సూర్య కిరణాల కిలకిలారావానికి
లిట్మస్ పేపర్ లా ఆకాశం రంగు మారింది

తలంటుకొన్న యవ్వనిలా శోభిస్తున్న
పొగడచెట్టు గాలికిరణాలలో
పత్రాలను ఆరబెట్టుకొంటూంది.
★★★

తడిసిన సీతాకోకచిలుక
కవిత్వంపై వాలి రెక్కలల్లార్చింది.

మరో కవిత 'వెన్నెల నావనెక్కి' లో

హేమంతోత్తరీయాన్ని కప్పుకున్న వనం
ఆకుల కొనల వేలాడే
మంచు బిందువుల భారాన్ని
మోయలేక అలసిపోతోంది.

రాలిన పూలను తురుముకొన్న కాలిబాట
సుగంధాలను గానం చేస్తుంటే
ఇరువైపులా ఉన్న తరువులు
తన్మయత్వంతో తలలూపుతున్నాయ్.

రాత్రి వలలో చిక్కుకున్న పక్షులు
వేకువ జ్ఞాపకాలను స్వప్నిస్తున్నాయి.
నిద్రలో శిశువు పెదాలపై
పరచుకునే నవ్వులా చందమామ
నిర్మలంగా, స్వచ్ఛంగా, ప్రకాశంగా వెలిగిపోతోంది.
వెన్నెల నావనెక్కి
రాత్రి ఒంటరిగా సాగిపోతోంది
వేకువ తీరానికై. --- అంటారు బాబా.

ఎంత నాగరిక ప్రపంచం మనల్ని కప్పేసినా మన మూలాలైన పల్లెల పరిమళాలనుండి ఎవ్వరమూ తప్పించుకోలేం. ఉద్యోగ వ్యాపార బాధ్యతల వలన భౌతికంగా దూరమైనా ఆనాటి జ్ఞాపకాలు మనిషిని వెంటాడుతూనే వుంటాయి. అది కవిత్వమైతే ఆ స్వచ్ఛత ప్రాముఖ్యతను మరింతగా మనల్ని ఆ నోస్టాల్జియాకు దగ్గర చేసి హృదయాన్ని భారం చేయక మానదు. అదే 'మట్టి కనుల నా పల్లె' కవితలో బాబా ఇలా చెప్తారు.

అపరిచిత ప్రపంచంలో బతకడం అంటే
వసంతాన్ని పారేసుకున్న తుమ్మెద
ఎడారి కన్నులపై వాలటమే!

అపరిచిత ప్రపంచంలో బతకటం అంటే
జీవితాన్ని అవమానం స్థాయిలో లాగించేయటమే.

అపరిచిత ప్రపంచంలో బతకటం అంటే
మబ్బుల మధ్య గుంపును కోల్పోయిన
కొంగపిల్ల తుమ్మ చెట్టుకు గాయమై
వేలాడడమే!//

ఒకవేళ
వెరళ్ళు తీసిన నా పల్లె మట్టి నయనాల్లో
ఉండి పోయిందా? అని మనల్ని ద్రవింప చేస్తారు బాబా

.

భార్యా భర్తల మధ్య అనుబంధాన్ని ఎవరి స్వేచ్చను వాళ్ళు గౌరవిస్తూ సాగించడమే అన్యోన్య దాంపత్య రహస్యంగా చెప్తూ ఇరువురిలోనూ కరగని తరగని భావ వైరుధ్యాన్ని ఈ నువ్వు నువ్వే - నేను నేనే కవిత ద్వారా చాలా నిక్కచ్చిగా కుండబద్ధలుకొట్టినట్టు చెప్తారు కవి. ఎంతగా అల్లుకుపోయినా ఎవరి గొంతు వాళ్ళదే అని మనం కంగారుపడేంత సత్యాన్ని చెప్పడం ఈ కవితలోని ప్రత్యేకత.

శరీరాలు ఒకదానికొకటి
ఎంత వెలిగించుకొని కరిగించుకొన్నా
ఎవరి పరిమళాలు వారివే!

ఇరువురి ఆశల్ని, ఆశయాల్ని
ఎంత ఒకే తెరపై చిత్రించినా
ఎవరి వర్ణాలు వారివే!
తమ బరువుని తామే
మోసుకు తిరిగే మేఘాల్లా
ఎవరి శ్వాస భారాన్ని వాళ్ళే మోసుకోవాలి!

నేనే నువ్వు అనుకోవటం
నువ్వే నేను అనుకోవటమంతా మాయ.

అయినా సరే
లోకం దృష్టిలో మనిద్దరిదీ
ఎప్పటికీ అన్యోన్య దాంపత్యమే. అని ముసుగు తొలగిస్తారు.

తన ఉపాధ్యాయ వృత్తిలో ఎదురైన విద్యార్థుల గురించి సార్ గారండీ సార్ గారండీ అని పిలిచే వాళ్ళ పిలుపులోని మాధుర్యం జీవితం చరమాంకంలో కూడా వారు గుర్తుపెట్టుకొని పలుకరిస్తే ఆ మాస్టారికి అంతకంటే మించిన తృప్తి ఏముంటుంది.

వాడు నిర్మించుకొనే వ్యక్తిత్వ హర్మ్యానికి
మేలిమి ఇటుకలను ఎంచి వాడికందిస్తాను
వాని ఆలోచనల చురకత్తులు
పదును పెట్టుకోవటానికై
నా మెదడును సానరాయిని చేస్తాను. అని ఒక టీచర్ యొక్క గొప్పతనాన్ని ఆవిష్కరిస్తారీ కవితలో.

కవి సమాజంలోని కుల మతాల వర్ణ వర్గ వైరుధ్యాల పట్ల తన అసహనాన్ని తనకూతురు వేసిన 'బి.సి. అంటే ఎవరు నాన్నా?' కవితలో ప్రకటిస్తారు.

బి.సి. అంటే ఎవరు నాన్నా
అని నా కూతురడిగినపుడు ఏమని చెప్పను?
అద్దకం పనిలో రంగుల్లోని సీసం

బొట్లు బొట్లుగా ఎముకల్లో చేరి
నిర్వీర్యమయినవాడని చెప్పనా లేక
బంగారాన్ని కొట్టి కొట్టి భుజం బంతిగిన్ని కీలు
అరిగిపోగా చేయి ఎత్తలేని స్థితిలో
పస్తులుంటున్న వాడని చెప్పనా? ఇలా అన్ని కులాల అణగారిన జీవితాల ప్రశ్నలను సంధిస్తూ చివరిగా

స్మశానంలా తీసుకోవటమే కానీ ఇవ్వటం తెలీని
ఈ సమాజానికి తరతరాలుగా అందిస్తూనే ఉన్న
ఈ జీవిని ఎలా నిర్వచించాలి? అని బాధగా ప్రశ్నిస్తారు కవి.

మనిషి పూర్తిగా యాంత్రికమవుతున్న తీరు మనకనుభవంలోకి వస్తూనే వుంది. దానియొక్క తీవ్రతను పట్టుకున్న కవిత "యూజర్ నేమ్: మనిషి - పాస్ వర్డ్: మానవత్వం".

ఓ యూజర్ నేమూ, పాస్ వర్డ్ ఇచ్చి
దేముడు నన్నీ లోకంలోకి దించాడు
పాస్ వర్డెక్కడ మరిచి పోతానోనని
హృదయంపై పచ్చబొట్టుగా వేయించుకొన్నాను కూడా.
బాల్యం వరకూ హృదయం నాతోనే వుంది
ఆ తరువాతే కనిపించకుండా పోయింది.

'తాతయ్య పోయినప్పుడు నువ్వూ, పెదనాన్నా
ఎందుకు దెబ్బలాడుకున్నారు' అని
ఆర్థిక మర్మాలు తెలియని నా కూతురడిగినపుడు
పాస్ వర్డ్ మర్చిపోవటం వల్లేనని
చెప్పలేకపోయాను.

జీవితం పోల్డర్ లోని శాంతి అనే ఫైలు
ఎంత ప్రయత్నించినా తెరుచుకోవటం లేదు.

దేవుడా!

దయచేసి నా పాస్ వర్డ్
రిట్రీవ్ చేసి పెట్టవూ? అని అర్థిస్తారు కవి నిస్సహాయంగా.

ఇలా ఈ సంపుటినిండా చిక్కని కవిత్వం అల్లుకు పోయివుంది. వేశ్యల బతుకుల గురించి, బాలకార్మికుల గురించి ఎంతో వేదనతో రాసిన కవితలు కవి సామాజిక కోణాన్ని మనకు చూపిస్తాయి. అంతే స్థాయిలో కవిత్వం నిండా ఒక తడి ఆరని సౌందర్యం పరచుకొని వుంటుందన్న హామీతో చివరిగా

సెలయేటి ఎగువన ఎవరో
నీటిలో వెన్నెల బిందువుల్ని
కలిపారు.
సెలయేరు పొడవునా వెన్నెలే!
నీరు తాగాలని వంగితే
దోసిట్లో చందమామ ఈ సంకలనం నిండా మనకు గోచరమవుతుంది.

28 జూన్, 2016, కవిసంగమం లో దృష్టికోణం శీర్షికలో ప్రచురితమైన వ్యాసం

# ఆవకాయ్.కామ్ ఎడిటర్ కామెంట్

సి. రఘోత్తమరావు

బొల్లోజు బాబా గారు ఆవకాయ.కామ్ కు కొత్తవారు కాదు. ఆవకాయ.కామ్ ఆరంభమైన తొలినాళ్ళలో కవితల్ని వ్రాసి కొత్త వెబ్ సైట్ ను ప్రోత్సహించారు. ఇన్నేళ్ళ తర్వాత వారిని నేను కొత్తగా పరిచయం చెయ్యవలసినదీ లేదు. లేదా అంటే అసలు లేదని కాదు. ఆయన వెలువరించిన "ఆకుపచ్చని తడిగీతం" గురించి చెప్పవలసి ఉంది. యాభై ఎనిమిది కవితలను చేర్చి బాబాజీ "ఆకుపచ్చని తడిగీతం" తీసుకువచ్చారు.

"కవిత్వం హృదయ సంబంధి" అని చాలాసార్లు చదివాను. దాన్ని నేను నమ్ముతానూ కూడా. "తడిగీతం" లో బాబాజీ కూడా చాలా చోట్ల హృదయసంబంధిగానే కనబడతారు.

2010 నుండి ఇప్పటి వరకూ ఆకుపచ్చని తడిగీతాన్ని చదివిన ప్రతిసారీ నాకు బాబాజీని ఆధునిక ప్రబంధ కవిగా పిలవాలనిపించేది. ప్రణయం, విరహం, ప్రకృతి··· ఈ విషయాలతో వారు రచనకు పూనుకున్నప్పుడు వర్ణనలు విరజిమ్ముతాయి. జలయంత్రం లాంటి ఊపు కవిత్వానికి ఓ అందాన్ని ఆపాదిస్తుంది.

ఏది ఏమైనా ఎక్కడైతే హృదయసంబంధియైన బాబాజీ కనబడతారో అక్కడ నిజమైన తడి పచ్చగా తాకుతుంది. "హృదయం తియ్యగా వణుకుతుంది". అపరిచిత మనోలోకమొకటి అమాయకంగా నవ్వుతుంది. ఎలాంటి ముందుమాటా అవసరం లేని పసిపాప బోసినవ్వులా ఆహ్లాదాన్ని పుట్టిస్తాయి."

Raghothama Rao C

# మంచం నేసే చేతులు

శ్రీ శివారెడ్డి

(వెలుతురు తెర పుస్తకానికి వ్రాసిన ముందుమాట)

"There is no Mountain of Sorrows
No ocean of griefs
There are only
Small hands
That Weave sorrow all day
Like a rope on a cot"
Kedarnath Singh - Great Hindi Poet




.

బొల్లోజు బాబా - ఎవరీ బొల్లోజు బాబా? పి.ఆర్.ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో జువాజీ లెక్చరర్ గా పనిచేస్తున్న అధ్యాపకుడు. కవి, కవిత్వ సమీక్షకుడు - యానాం విమోచనోద్యమం గురించి పుస్తకం రాసిన, ఒక రకంగా చరిత్రకారుడు. ప్రతీ కవీ ఒక రకంగా 'చరిత్రకారుడే' తను జీవించిన కాలాన్ని- చరిత్రగా, సామాజిక చరిత్రగా మలచేవాడే. సూఫీకవుల్నీ, విశ్వకవి రవీంద్రుణ్ణి అనువదించిన వాడు. నెరుడా-యిరవై ప్రేమ కవితలు ఒక విషాదగీతం-అనువదించిన వాడు. యివన్నీ ఎందుకంటే బాబా Novice/కొత్తవాడు కాదు; సాహిత్య సాధనలో తలమునకలై ఉన్నాడు అని చెబటానికి.

యానాం అనగానే శిఖామణి, దాట్ల రాజుగారు గుర్తుకు రాక మానరు. బాబా కాకినాడలో పనిచేస్తున్నా- అతని వేళ్ళు యానాంలో ఉన్నాయనిపిస్తుంది. యానాంకొక చరిత్రవుంది - ఒక ఉద్యమ సాంస్కృతిక చరిత్రవుంది. ఒక సాహిత్య చరిత్రవుంది. బాబా పూర్వరంగమిది. సాహిత్య వారసత్వమిది; కాకినాడ అనగానే ఇస్మాయిల్ గారు గుర్తుకురాక మానరు; అటు పిఠాపురం సోమసుందర శిఖరముంది. కోనసీమ సౌందర్యముంది; వీటంటి వెనక కృష్ణశాస్త్రి గారి 'ఊరకే చలియించు ఈ రేయివెన్నెలున్నాయి'

బొల్లోజు బాబా సాహిత్య రేఖా విలాసాలు అందాలను అందుకోవాలంటే, రేఖామాత్రంగానైనా యివి తెలియాలి. ఈ నేపథ్యాల నుంచి, సాహిత్య వారసత్వం

నుంచి బాబా జీవించాడు కవిగా. 2009 లో అచ్చయిన అతని మొదటి కవితాసంపుటి – ఆకుపచ్చని తడిగీతం ' లో సౌందర్యం అనే కవిత చూడండి.

'సెలయేటి ఎగువన ఎవరో
నీటిలో వెన్నెల బిందువుల్ని
కలిపారు.
నీరు తాగాలని వంగితే
దోసిట్లో చందమామ'

సూచ్యంగా, సూక్ష్మంగా బాబా తత్వాన్ని చెప్పే కవిత. ఆ సంపుటిలోనే 'అతడు-ఆమె' అనే కవితవుంది.

'అతడామెను
నడిచే చందమామ అనీ
పరచుకొన్న వెన్నెలనీ
నిలిచిపోయిన వసంతమనీ
వర్ణించాడు'

కవిత అలా సాగి సాగి

'ఎన్నో అన్నాడు
అతడామె గురించి చాలా చెప్పాడు-
కానీ ఆమె మాత్రం
ఒక చిరునవ్వు శాపమిచ్చి వెళ్ళిపోయింది
తెరచాటు మనిషి కదా!'

ఈ కవితా సంపుటిలో లేనిదాన్ని గురించి నేనాలోచించను.

అతనునుకున్న దాన్ని, అతని అనుభవంలోకి వచ్చిన దాన్ని; అదే సాంద్రతతో, తీవ్రతతో మన కందించాడా లేదా అన్నదే ముఖ్యం. ఆ పని బాబా చాలా సమర్థవంతంగా, సంతృప్తి కరంగా నిర్వహించాడని నేననుకుంటా -- శివారెడ్డి

ఒక ముక్తాయింపు, ఒక ఆశ్చర్యపు వెలుగు-
చిరునవ్వు శాపమిచ్చి వెళ్ళిపోవటం' గొప్ప ఊహ-

అతని రెండో కవితా సంపుటి యిప్పుడు రాబోతుంది- 'వెలుతురు తెర' - ఇంకేదయినా మంచి పేరు సూచించమనీ అడిగాడు. 'వెలుతురు తెర' బాగుంది. అతని మొదటి కవితా సంపుటికి గొప్ప పొడిగింపు- Beautiful Extension. వస్తు, రూపాల్లో ఒక Sophistication -ఒక నాగరీకం వచ్చింది. ఏ గుణాలయితే కవిత్వసంబంధి అంశాలో - యిందులో అవి పరిపక్వ దశకి చేరాయి. ఒక పరిణత

కన్పించింది. వస్తువును సంభావించే తీరులో, దానికొక రూపమిచ్చే పనిలో గొప్ప నైపుణ్యం కన్పించింది. ఒక లాఘవం–ఒక వడుపూ అబ్బాయి–

మొదటి కవితా సంపుటిలో ఈ వాక్యాలు ఎదురవుతాయి–

'ఏదయినా ఓ పుస్తకంలోకి నడవటమంటే
పరిచిత పాత్రలోకి
మనల్ని మనం ఒంపుకోవటమే'

ఈ కవితా వాక్యాల్ని కొద్దిగా మార్పు చేస్తే, రెండో కవితా సంపుటికి అన్వయిస్తాయి.

ఏదయినా ఓ పుస్తకంలోకి నడవటమంటే
పరిచిత ప్రాంతాలోకి
మనల్ని మనం ఒంపుకోవటమే–
యింకాస్త మార్చితే–
అపరిచిత ప్రాంతాలలోకి
పాత్రలలోకి
మనల్ని మనం ఒంపుకోవటమే!

పరిచయమయిన పాత్ర గావచ్చు ప్రాంతం గావచ్చు – కవితలో కొత్తగా, మనం చూడని కోణం నుంచి పరిచయమవుతుంది.

షాహర్యార్ (Shahryar) అనే ప్రసిద్ధ ఉర్దూ కవి– ఒక గజల్ లో అంటాడు

The beauty of his verse
is not its meaning
Beauty of his poetry
is not always in its meaning — అని

బహుశ కవిత్వం మొత్తం వస్తువును భాషలోకి అనువదించటమే. ప్రతికవికి అతనిదయిన ప్రత్యేక భాష వుంటుంది. 'Conceiving the context into language' జీవితాంతం తన కవిత్వ పరిభాష నిర్మాణంలో కవి ధ్యానమగ్నుడై వుంటాడు. ఒక కవిని యింకొక కవినుంచి వేరు చేసేది – అతని కవిత్వ పరిభాషే. యిది అతని నేపథ్యం మీద, వర్గ కుల ప్రాంతాల ప్రభావం మీద ఆధారపడి వుంటుంది. ముఖ్యంగా అతని దృష్టిమీద – attitude మీద perception మీద ఆధారపడి వుంటుంది.

ఈ సందర్భంలో నాకొకటన్పిస్తుంది. 'బొల్లోజు బాబా తెలంగాణలో పుట్టి పెరిగివుంటే; ఉత్తరాంధ్రలో పుట్టి పెరిగివుంటే ఎటువంటి కవిత్వం రాసివుండే వాడు' అని. ఖచ్చితంగా యిప్పటి కవిత్వానికి భిన్నమయిన పరిభాషలో రాసివుండే వాడు. కాళ్ళు గాలుతుంటే, వేడిగాలులు వీస్తుంటే, గుక్కనీరు దొరక్క అటమటించిపోతుంటే – తత్సంబంధమయిన వస్తుజాలంతో– నెత్తురంటిన కవిత్వ పరిభాషలో రాసి వుండేవాడని నేననుకొంటా – ఇదంతా ఒక Guess Work

గత రెండుతరాల కవుల– ముఖ్యంగా ముప్పయ్యిలలో–నలభైల్లలో ఉన్న కవుల– కవిత్వం చాలా భిన్నమయింది. రొట్టకొట్టుడు లేదు. వస్తు నవ్యత, రూప నవ్యత గణనీయంగా పెరిగింది. వస్తువును చూడటం దగ్గరనుంచి, కోణం ఎన్నుకోవటం దగ్గరనుంచి–విప్పుకుంటూ పోయే విధానం దాకా కొత్తపోకడలు పోతున్నారు. భాష–యింత సౌందర్యవంతంగా, నాజూకుగా, లావణ్యంగా, లాఘవంగా గతంలో వాడబడిందా అని నాకన్పిస్తుంది. సంక్షోభ భరితమైన సందర్భంలో – ముఖ్యంగా గత రెండు దశాబ్దులుగా– కూడా, మొరటుదనం లేకుండా కనపడకుండా కవిత్వం రాయటం– ఈ నూత్న తరాలకవులు సాధించిన విజయమని నే భావిస్తున్నా– వారివారి తాత్విక నేపథ్యమేదయినా–వాదమేదయినా–కవితమీద కవిత్వరూపం మీద; భాషమీద, వ్యక్తీకరించే పద్ధతి మీద–ఇంతటి ధ్యాస మును పెన్నడూ లేదనిపిస్తుంది
ఈ పుస్తకంలో 'చరిత్ర' అనే ఒక కవిత వుంది. కవిత మొత్తం ఉదహరిస్తా
చరిత్ర

'ఈ సొరంగం చివర
వెలుతురు ఉండి తీరాలి' అన్నాడతను
'ఒకప్పుడు ఉండేదట!
చెదలు తినేసాకా వెలుతురంతా
అయిపోయింది' అన్నారు కొంతమంది వృద్ధులు

మెతురుని వెతుక్కుంటూ సాగిన ఆ యువకుడు
చెదపురుగులకు బయ్యాడు.
ప్రజలు పడీ పడీ నవ్వుకొన్నారు
అయినవాళ్ళే మూర్ఖత్వమని
గుసగుసలాడుకొన్నారు చాలాకాం.

కొన్నేళ్ళ తరువాత

వెలుతురు రాజ్యంలో, నగరం మధ్యలో
ఆ యువకుని విగ్రహం
'వెలుతుర్ని స్వప్నించిన సాహసి' అనే అక్షరాలతో.

ఈ కవితలో ఎన్ని పొరున్నాయో-అర్థ స్ఫూర్తున్నాయో, రకరకాల పాఠకులు రకరకాలుగా వ్యాఖ్యానించటానికీ, ఎంత అవకాసముందో- కాల సందర్భాల్ని వస్తువుగా మార్చి - మూడు బొమ్మ ద్వారా/ Images ద్వారా వ్యక్తపరచటం- వ్యక్తమయిన భావం భాషగా- Image గా- భాష దృశ్యం భావ దృశ్యమై, దృశ్య సమ్మితమైన భాష వస్తువుగాను, దృక్పథంగానూ-తాత్విక సారాంశంగాను-వడకట్ట బడుతుంది.

ఈ నైపుణ్యం యిపుడు కొత్తగా కవిత్వం రాస్తున్న - 30, 40 ఏళ్ళ వయసులో వున్న వాళ్ళ కవిత్వంలో చాలా బలంగా చొచ్చుకొచ్చింది. బహుశ అందుకే ఈ కవులు 'Monotony' ని బ్రేక్ చేసారనిపిస్తుంది. కవిత మొత్తం ఒక అర్థవంతమయిన రూప నిర్మాణమవుతుంది- దాని వ్యక్తిత్వం, అభివ్యక్తులు దానికుంటాయి.

బహుశ ప్రతిదీ, సంక్షోభం కావొచ్చు, సౌందర్యం కావచ్చు అంతర్నిహితమౌతుంది, అంతర్గతమౌతుంది- Internalise అవుతుంది. కవితకి రెండు ఉనికులు లేవు. ఒకే ఉనికి. ఒకే రూపం, సౌందర్యం, సంక్షోభం - నిండిన రూపం పాఠకుణ్ణి పీల్చేస్తుంది. కవిత, తన్లోకి పాఠకుణ్ణి లాగేస్తుంది. కవిత ఉనికీ, జీవితమే - అతని ఉనికి, అతని అనుభవ జీవితం. ఇక్కడ ఈ రెండుతరాల కవులు ముందడుగు వేసారు. గతాన్ని, గతపు వారసత్వాన్ని స్వీకరిస్తూనే వాళ్ళదయిన ఒక కవిత్వ వ్యక్తిత్వం, కవిత్వ నిర్మాణం చేసుకుంటూ వస్తున్నారు.

కవిత్వం వాచ్యంగా రావటం మానేసి చానాళ్ళయింది. బడ బడ శబ్దాలు చేయటం మానేసి, గుండె గొంతుకలో కొట్లాడటం మొదలెట్టింది.

'కొన్ని పదాల గురించి' అనే కవితలో

'ఏమీ గుర్తు లేవిపుడు
జేబుడు సూర్యకిరణాలు
గుప్పెడు చందమామ
ముక్కలు తప్ప.
దు:ఖాశ్రువులు నిండిన
సాయంత్రాన్ని
రాత్రి రెప్పల క్రింద
నిదురపుచ్చి అన్నీ

మరచిపోదామనుకొంటాను
కానీ
కొన్ని పదాలు నా నుండి రాలిపడి
ఓ ఎడారిని సృష్టిస్తాయి
ఆ ఎడారిలోంచి ఓ అరణ్యం
ఆ అరణ్యం లోంచి కుంభవృష్టీ
ఒక్కొక్కటిగా విచ్చుకొని
నన్ను కబళిస్తాయి.

నానుంచి పుట్టినదైనా
నన్నో పూచికపుల్లను చేసి
కొట్టుకొని పోతుంది
ఏమీ గుర్తులేవిపుడు
జేబుడు పదాలు
గుప్పెడు కలల
ముక్కలు తప్ప

అంతా ధ్వనిపూర్వకమే – వచనం నుంచి కవిత్వాన్ని వేరు చేసేది 'ధ్వని' మాత్రమే. Suggestion కి అంత్యంత ప్రాధాన్యత. పద్యం చదవటం ముగిసిన తర్వాత – 'ఎంత బాగా అన్నాడు, ఎంత బాగా ఊహించాడు– ఊహించిన దాన్ని ఎలా దృశ్యమానం చేశాడు – అదెలా మన అనుభవం చేశాడు – మన అనుభవం – కవిత్వానుభవంగా మారి అంచు దాకా చేరి పొంగిపొర్లుతుంది – ఒక ఆహ్లాదం ఒక సంతృప్తి – కొత్త దాన్నేదో అందుకొని అనుభవించిన తృప్తి – లోలోప కాంతిగా పరిణమ్మిలుతుంది – అంతా వెలుగే.

ఈ కవితా సంపుటిలో లేనిదాన్ని గురించి నేనాలోచించను; డిమాండ్ చేయను; దాన్ని గురించి ఎందుకు రాయలేదు దీన్ని గురించి ఎందుకు రాయలేదు' అని నేనడగను; అతనను కున్న దాన్ని, అతని అనుభవంలోకి వచ్చిన దాన్ని; అదే సాంద్రతతో, తీవ్రతతో మన కందించాడా లేదా అన్నదే ముఖ్యం. ఆ పని బాబా చాలా సమర్ధవంతంగా, సంతృప్తికరంగా నిర్వహించాడని నేననుకుంటా –

ఇంకా తను భారతీయ కవిత్వానికి ప్రపంచ కవిత్వానికి Expose కావసివుంది. ప్రపంచ భాషల్లో వస్తున్న కవిత్వం – ఆయా దేశకాల పరిస్థితులలో– ఎంతగొప్పది.

ఒక్కో కవి ఒక్కో అంశం చెపుతాడు. పద్మవ్యూహం నుంచి బయటపడే మార్గం చూయిస్తాడు. నువ్వెంతగా యితరుల కవిత్వాన్ని లోతుగా చదువుతావు - జీర్ణం చేసుకొంటావు - రక్తనిష్టం చేసుకొంటావు అన్నదాన్ని బట్టే, నీ ఎదుగుదల, విస్తీర్ణత, విశాలత - ఒక కవిత విస్తృతమౌతూ - సార్వజనీనానుభవం ఎలా పరిణమిల్లుతుంది; అనే గొప్ప రహస్యాన్ని యితర కవులే బోధించగరు.

మన వేళ్ళ నుంచి-మన జీవితం నుంచి, మన ప్రపంచం నుంచి మన అన్నిరకాల నేపథ్యాల నుంచి- మనం కవిత్వం పలుకుతాం - మన అనుభవాలనుంచి, దేన్ని ఏరుకుని కవిత్వం చేయగలం, గొప్ప కవిత్వం చేయగలం - అనే ఒక కవిత్వమార్మిక సూత్రాన్ని యితరులనుంచే గ్రహించగలం.

అంతా వివరాలతో విస్తృత మౌతుంది. రోజుకోరకంగా రూపు దిద్దుకొంటున్న జీవితాన్ని దాని సర్వసారాంశంతో పట్టుకొని - కవిత్వం చేయటం - లోతయిన అధ్యయనం, నిత్య సాధన ద్వారానే సాధ్యమవుతుందని - బాబా ఈ పాటికి గుర్తించివుంటాడు. గొప్ప Sensibility వుంది, గొప్ప చూపు ఉంది, జీవితాన్ని ప్రకృతిని చూసి పరవశించే గుణముంది - మొద్దు బారనితనముంది; మొగలిపొదలా నిలబడే తత్వముంది-

అది శిఖామణి కావొచ్చు, శ్రీకాంతశర్మ కావొచ్చు- ఒక లోతయిన తాత్విక కోణంలో కవిత్వం రాస్తూ- (రాజకీయం కాని తాత్వికకోణం లేదు) 'కాలుష్యమంటని కవి, కవిత్వం' అనటం-బాధాకరం-నాకీ మాట బూతుమాటగా ధ్వనిస్తుంది - అంతా కృషమయిన జీవితంలో, ప్రపంచంలో అకల్మషమేముంటుంది.

వీటన్నింటినీ అంతర్లీనం చేసుకొని గొప్ప కవిత్వం చెప్పగ సత్తా నీలో ఉండాలి. ఆ సత్తా ఎలా సమకూర్చుకోవాన్నది ముఖ్యం. బహుశ దీర్ఘకాలికంగా కవిత్వ సాధన చేస్తూ వస్తున్న వాళ్ళకి - ఏ వాదపు నేపథ్యం నుంచైనా - ఇవన్నీ అందుతాయి, అనుభవంలోకి వస్తాయి.

గొప్ప కవిత్వం చదవండి;
గొప్ప కవిత్వం రాయండి-
మార్గాలన్వేషించండి-
బాబాని చదువుతుంటే చాలామంది గుర్తుకు రావొచ్చు-ఆ నీడలేవో లీలగా తారాట్లాడతాయి -అవన్నీ క్రమక్రమంగా తొలగిపోతాయి- నిజమయిన బొల్లోజు బాబానే మనముందు ప్రత్యక్ష్యమౌతాడు - ఆ ఆశ, ఆ వాగ్దానం యిందులో పుష్కలంగా వుంది.

దాహం
భూమిలోంచి పైకి లేచిన కుళాయి గొట్టం
ఒంపు తిరిగి పిట్టగోడను అనుసరిస్తూ సాగి
మరో రెండు మలుపులు తీస్కొని
ఇత్తడి టాప్ నేత్రమై
ఏ మేఘసందేశాన్నో నీళ్ళ భాషలో అందిస్తుంది
పుస్తకమూ అంతే
ఎన్నో మలుపులు తీసుకొని చేతిలోకి చేరి
ఒకనాటి మనో ఆకాశపు వానచినుకుల్ని
అక్షరాలుగా వర్షింపచేస్తుంది
మట్టి నయనాలపై

బొల్లోజు బాబా కవిత్వాన్ని గొప్పగా ఆనందించా, అనుభవించా అతనొక తేనెపిట్ట- తేనెపిట్ట పువ్వుమీద వాలకుండా గాల్లో తేలుతూ తేనె పీల్చటం ఎంతగొప్ప విద్యో - ఆ దృశ్యం ఒక అనుభవం
ఆ అనుభవాన్ని నాకిచ్చిన బాబాకి ధన్యవాదాలు
అతనికి శుభం జరగాలి

కె.శివారెడ్డి 5/4/2016

# వెలుతురు తెర మీద ఊహించినదాన్ని దృశ్యమానం చేసే కవి బొల్లోజు బాబా

రాజారామ్ తూముచర్ల

"ఎంతదృష్టం!
కనులున్నాయి
కనులు కనే కలలున్నాయి
కలలు ఆవిష్కరించే
హాయియైన లోకాలున్నాయి
ఎంతదృష్టం !"

గాయాల్ని ఇముడ్చుకునే హృదయం, ఆ హృదయపు గాయాల్ని నయం చేసే కాలపు మలాము, ఆ కాలాన్ని వేటాడే జీవితం ,నిత్యం స్వప్నించే కనులు లేకపోతే ఇన్ని వైరుధ్యాలున్న లోకాన్ని దాటడం ఎంత కష్టమో ? — ఈ మాటల్లోని ఏదో తాత్వికత కట్టి పడేసింది నన్ను బాధలన్ని కలగలిపి చుట్టేసినప్పుడు. ఆ సమయంలో బొల్లోజు బాబా పంపిన ఈ 'వెలుతుర తెర 'నా కళ్ళ ముందున్న దుఃఖపు తెరను చించేసింది. కవిత్వం ఏం చేయ గలదు అనే వాళ్ళకి నా జవాబు ఏమైనా చేయగలదని.

నేను ప్రభుత్వ జూనియర్ లెక్చరర్ల సంఘ రాష్ట్ర నాయకత్వంలో వున్నప్పుడు బొల్లోజు బాబా ప్రభుత్వ జూనియర్ లెక్చరర్ .నేను ఆయన ఎరుకలో వున్నానో లేదో తెలీదు కానీ అకడమిక్ వాయిస్ అనే మా సంఘ పత్రిక నడపాలని అనుకున్నప్పుడు ఆయన పేరును తూర్పు గోదావరి జిల్లా సంఘ ప్రతినిధి ఎవరో సూచించినట్టు లీలగా జ్ఞాపకం.

బొల్లోజు బాబా మంచి భావుకుడు.' ఆకు పచ్చని తడి గీతం ' ఈయన మొదటి కవితా సంపుటి. ఎడారి అత్తరుల పరిమళాల్ని ,ఇరవై ప్రేమ కవితల విషాద గీతాల దుఃఖపు తడిని తన అనువాదంతో తెలుగు కవిత్వ ప్రియుల గుండెలకు అద్దిన కవి బొల్లోజు బాబా.

ఈ కవికి తన అనుభవాలను గులాబీ రేకుల్లాంటి పదాల సమూహంతో, ఒకానొక జీవన కాంక్ష తో కవిత్వం చేసే నేర్పుంది. హృదయ వేదిక మీద పేరుకున్న జ్ఞాపకాల శకలాల్ని పేర్చి నెమలీక లాంటి కవిత్వం చేయగల కళ వుంది ఈ కవిలో.

హృదయాన్ని కదిలించి మెదిలించే పాటలు విన్నప్పుడు కలిగిన అనుభూతుల్ని పట్టుకొని కవిత్వంలోకి వొంపిన కవులున్నారు. పాట వింటున్నప్పుడు రసించగల హృదయం ప్రపంచాన్ని మరచిపోతుంది. పాట లోకాన్ని మరపింప చేస్తుంది. ఈ బాబా కూడా ఒక పాట విన్నాడు. ఆ పాట కాలేజ్ లో తన క్లాస్ మేట్ పాడిన పాట. ఆ పాటని ఇట్లా కవిత్వం చేస్తాడు ఈయన.

'మా అందరి కోరికపై ఆమె
కాలేజి గార్డెన్ బెంచీపై బాచీమఠం వేసుకొని
తలపైకెత్తి కనులు మూసుకొని,గొంతు నరాలు ఉబ్బిస్తూ
ఎన్ని పాటలు వొంపిందో ఆ సాయంత్రపు చెవుల్లోకి.
ఆనాటి ఆ సాయంత్రం ఇప్పటికీ
మట్టిని మోసుకెళ్ళే కందిరీగలా నా దేహంలో
అదే పనిగా ఎగురుతూంటుంది గుర్తొచ్చినప్పుడల్లా'

బాచీ మఠం వేసుకోవడం ,తల పైకెత్తడం ,గొంతు నరాలు ఉబ్బించడం ఇవన్నీ ప్రధానంగా శాస్త్రీయ సంగీతం పాడే వాళ్ళ ఆంగీక హావభావాలు. ఈ కవి ఆ సంగీతపు మూడ్ కి దృశ్యరూపం కల్పిస్తాడు తన వర్ణనతో. ఆ సాయంత్రాన్ని ' ఇప్పటికి మట్టిని మోసుకెళ్ళే కందిరీగలా నా దేహంలో " అని ఈ కవి అనడంలో ఆమె పాట తన మనసులోని విషాదభరితమైనవో సంతోష భరితమైనవో ఏవో పాత జ్ఞాపకాలను రేపి కల్లోల్లాన్ని సృష్టిస్తోంది అనే భావానికీ కవితాత్మక వ్యక్తీకరణ చేస్తాడు.

'శ్రావణ శుక్రవారం పూట
చేతికి తోరం చుట్టుకొని పట్టు పరికిణీ కట్టుకొని
సాంబ్రాణి వాసన చిమ్మే కురులతో,మెరిసే కాటుక కళ్ళతో
ఆమె నడచి వచ్చిన అలనాటిఉ ఆ దృశ్యం నేటికీ
జ్ఞాపకాల పేజీల మధ్య దాచుకొన్న
నెమలీక లాంటి చందమామ శకలం.'

ఈ పై మాటల్ని బట్టి ఆ జ్ఞాపకాలు సంతోషభరితమైనవేనని స్ఫుటమవుతుంది. పూర్వ విద్యార్థుల సమ్మేళనంలో ఆమెను కలిశాకా ఈ కవి ఇలా అంటాడు.

'మేం కలుసుకోకుండా ఉంటే ఎంత బాగుణ్ణు
అనిపిస్తోంది ఈ మధ్య పదే పదే.'

అది ఎందుకో కవి చెప్పడు. చదువరుల ఊహకే వదిలేస్తాడు.
బొల్లోజు బాబా కు పదప్రయోగ ఔచిత్యం కూడా బాగా తెలుసు. మాములుగా చేతికి తోరం కట్టుకొని అని అంటుంటారు. కానీ వెంటనే పట్టు పరికిణీ కట్టుకొని అని చెప్పాల్సివుంది ఈ కవి. కాబట్టే చేతికి తోరం చుట్టుకొని అన్నాడు.నిజానికి పరికిణి నడుముకు చుట్టుకున్న..పరికిణి కట్టుకున్నారని అంటేనే ఔచిత్యంగా వుంటుంది. కాబట్టే ఈ కవి తోరం చుట్టుకొని , పరికీణీ కట్టుకొని రాశాడు.ఇలా పనికట్టుకొని ఆలోచించి రాస్తారా అని అంటే ..ప్రతిభావంతుడైన కవి కలం నుండి యాధృఛ్చికంగానే జాలువారుతుందేమో ?

కవిత్వమనేది ఆత్మలోకంలో ఇద్దరి సంభాషణ అని అంటున్న కవి ఇతను. పైగా 'యానాం విమోచనోద్యమం, ఫ్రెంచి పాలనలో యానాం అనే చరిత్ర పుస్తకాలు రాసినవాడు కూడా. అందుకేనేమో 'చరిత్ర ' అనే కవితలో ఎవరు చరిత్రలో నిలిచిపోగలరనే ఒకానొక సత్యాన్ని శివారెడ్డి గారన్నట్లు 'కాల సందర్భాల్ని వస్తువుగా మార్చి – మూడు బొమ్మల ద్వారా / images ద్వారా వ్యక్త పరచడం' లో ఆకవితను లోతైన కవిత్వంగా ఈ కవి మలచడమే కాదు 'కనుల లోతుల్లోకి ఒక దృశ్యం రాలి పగిలి శకలాలై' పొరలు పొరలుగా విడిపోయి అనేక ఆలోచనలతో అన్వయించుకునేట్లుగా చేస్తాడు.

'ఈ సొరంగం చివర
వెలుతురు ఉండి తీరాలి' – అన్నాడతను
'ఒకప్పుడు ఉండేదట!
చెదలు తినేశాకా వెలుతురంతా
అయుఇపోయింది' అన్నారు కొంతమంది వృద్ధులు

అంటూ మొదలవుతుంది 'చరిత్ర ' – అనే కవిత. ఇది ఒకటో బొమ్మ.
వెలుతురును వెతుక్కొంటూ సాగిన ఆ యువకుడు చెదపురుగులకు బలయ్యాడు.బలైపోయిన ఆ యువకున్ని మూర్ఖుడని అయినవాళ్ళే చాలకాలం అతన్ని గురించి గుస గుసలతో చర్చించుకున్నారు. ఇది రెండో బొమ్మ.

'కొన్నేళ్ళ తరువాత
వెలుతురు రాజ్యంలో,నగరం మధ్యలో
ఆ యువకుని విగ్రహం
'వెలుతుర్ని స్వప్నించిన సాహసి'
అనే అక్షరాలతో

ఈ పాదాలు మూడో బొమ్మ.ఒకప్పుడు గేలిచేయబడిన వారే రాబోయే కాలంలో చరిత్ర నిర్మాతలవుతారన్న విషయాన్ని ఎంతో సమర్థవంతంగా బొల్లోజు బాబా కవిత్వం చేశాడు. వెలుతుర్ని చెదలు తినడం అంటే నిజాన్ని సత్యాన్ని మింగేయడం. వెలుతురు జ్ఞానానికి ప్రతీక. మూడు ఇమేజెస్ తో ఒక సార్వకాలిక సత్యాన్ని నిలబెట్టాడు కవిత్వంగా. పొరల్ని ఒలుచుకుంటూపోయేకొద్ది ఈ కవిత లోతు తెలుస్తుంది. ముందుండే చీకటి ని చీల్చుకుంటూ చెదల్లాంటి కష్టాలని ఓర్చుకుంటూ అన్వేషణ సాగించిన వారే జ్ఞాన సామ్రాజ్య సామ్రాట్టులవుతారన్న స్పృహ నిస్తాడు.

ప్రకృతికి మానవత్వ ఆరోపణలు చేయడం ద్వారా అనూహ్యమైన సంఘటనలు ఊహించడం ద్వారా కూడా బొల్లోజు బాబా కవిత్వాన్ని సృజించగలడు మధుర పదాల తేనె వానల్ని కురిపించగలడు. 'తపస్సు' అనే కవిత చూడండి.

'చెట్ల ఆకులు
ధ్యాన ముద్రలో ఉన్నాయి
కొలను అలలు కూడా వాటిని
కలచ సాహసించడం లేదు
నీడ పొడలు నిశ్శబ్దంగా
తొంగి చూస్తున్నాయి
పరిమళాల సంచారం
నిలిచిపోయింది'

ధ్యానం చేయడం మానవ లక్షణం.దాన్నీ ఈ కవి చెట్ల ఆకులకు ఆపాదించాడు. ధ్యానం చేసే వాళ్ళను భంగ పరచడం మానవ నైజం.ఆ నైజాన్ని కొలను లోని అలలకు ఆరోపిస్తాడు.చివర్లో 'ఆకులు గలగలా నవ్వేశాయి ధ్యానం ఫలించినందుకు' – అని అంటాడు. ఆకులు నవ్వవు. మనిషే నవ్వేది. కానీ

నవ్వాయని అందులోను గల గలా నవ్వాయని మానవత్వ లక్షణాన్ని ఆ ఆకులకు ఆపాదించి చిక్కని కవిత్వాన్ని అందించాడు.

జూపాక సుభద్ర గారు 'మగ గొట్టాలకు కత్తెర్లేయండి' అంటూ ఛత్తీస్ ఘడ్ మహిలలపై జరిగిన కుటుంబ నియంత్రణ హత్య కాండకు, స్త్రీల పట్ల చూపే వివక్షకు నిరసనగా ఒక గొప్ప కవిత రాశారు. బొల్లోజు బాబా కూడా ఈ దేశం లో విచ్చల విడిగా జరిగే గర్భ సంచి తొలగింపు ఆపరేషన్స్ ను నిరసిస్తూ "ఒక హిస్టరెక్టమీ " అనే కవిత రాశాడు. ఈ కవిత చదివితే కారణాలేమయిన కానీ కనపడని గర్భ సంచిని తొలగించిన ఒకానొక వేదన కలుగటమే కాదు ఒక నిట్టుర్పు విడుస్తాం.

'కారణాలేమయిన కానీ
నెలకో రక్త పుష్పాన్ని
రాల్చే
వృక్షాన్ని సమూలంగా
పెకలించారు'

నాగరీకుడైన ఈ వైద్యుని ప్రయోగ శాలలో స్త్రీ దేహమెప్పుడు ఒక గినియా పిగ్గే నని వైద్యంలో కూడా స్త్రీల పట్ల వున్న వివక్షను చెబుతాడు. యానాం తో ఏర్పడ్డ అనుబంధం చాలా గాఢంగా వింత అనుభూతిని వెదజల్లుతూ బొల్లోజు బాబా కవిత్వంలో కనిపిస్తుంది. ప్రధానంగా అక్కడి ప్రకృతి దానికి ప్రధాన కారణమేమో ?.నిరసన కూడా సుకుమారంగా మార్దవంగా వుంటుంది. తీవ్ర ధ్వనితో వుండదు.

'అప్పుడెప్పుడో సాయంత్రపు నడకలో చెరువు గట్టున
ముద్దులొలికే ఓ స్నేహం పిల్లను చూశాను'

అని అంటున్న ఈ కవి ఆ స్నేహం పిల్ల మట్టి పొరల్ని చీల్చుకొని విప్పారిన పత్రాలతో లోకాన్ని చూసిన వైనాన్ని కవిత్వం చేయడమే కాదు ఆకుల్ని రాల్చుకొని రాల్చుకొని వేళ్ళని పాదుకొని పాదుకొని అది ఎదిగిపోయిన దృశ్యాన్ని అతి తేలిక మాటల్తో దృశ్యమానం చేస్తాడు .ఏదో ఒక రోజున ఈ స్నేహం చెట్టు సైకత శిల్పంలా కూలిపోయినా సరే అదే నా జీవితాదర్శం అని స్నేహపు విలువను ప్రతిష్టిస్తాడు.

ఒక సన్నివేశాన్నో సంఘటననో సృష్టించి చాలా భాగం చదివేవాళ్ళ అనుభవానికో ఆలోచనకో వదిలేస్తాడు ఆ తరువాత అంశాల్ని ఈ కవి కొన్ని కవితల్లో.

కవిత్వం అనే కవితను చూడండి. ఆమె వచ్చి కూర్చున్న సన్ని వేశాన్ని చెప్పి, జరిగిన సంఘటనని చూపిస్తాడు పదాల్తో. తన నిస్సహాయ చూపుల్ని విడిపించుకొని వెళ్ళిన ఆవిడ గురించి మన ఊహకే వదిలేస్తాడు. ఈ సంపుటికి ఈ కవిత్వం ఒక కిరీటం.

ఈ కవి అధ్యాపకుడు కావడం మూలానా కొన్ని వృత్తికి సంబంధించి కూడా కవితలు వచ్చాయి ఆయన సృజనలోంచి. ప్రభుత్వ కళాశాలల్లో చదివేది అత్యధిక శాతం పేదవాళ్ళే. ఏదో ఒక పని చేసుకొంటూ జీవనాన్ని సాగిస్తూ చదువును కొనసాగిస్తుంటారు. ఆ కారణంగా హాజర్ శాతం తక్కువై చాలా మంది వాళ్ళకొచ్చే ఉపకార వేతనం కోల్పోతుంటారు.

ఈ సంఘటనని అధ్యాపకుడైన ఈ కవి "ఎందుకో తెలియటం లేదు ..." అనే శీర్షికతో మమ మనసంతా నుజ్జు నుజ్జు అయ్యేటట్లు కవిత్వం చేసేసాడు. బాబా కవిత్వం చాలా వరకు సంభాషణాత్మకంగా నడుస్తుంది. అందుకు ఈ కవిత కూడా ఒక ఉదాహరణే. అట్లా కవితను నడిపే కవులు తక్కువే వర్తమానంలో.

'అటెండెన్స్ సరిపోలేదని
స్కాలర్ షిప్ నిలుపు చేశేసారు సార్
డబ్బు చాల అవసరం హెల్ప్ చేసి పెట్టండి సార్' అని
అభ్యర్థించిన ఆ కుర్ర వాని కనులే
జ్ఞాపకం వస్తున్నాయి'

చ్చాన్నాళ్ళ తరువాత ఆటో నడుపుతూ కనిపించిన ఆ కుర్రాడు దేవును కృప వల్లా అంతో ఇంతో సంపాదిస్తున్నాకదా నువ్వింకా రిక్షా తొక్కడం మానేయమంటే మా నాన్న వినలేదు సార్ — అన్నప్పుడు అధ్యాపకుడైనా ఈ కవి ఇలా అంటాడు.
'క్లాస్ రూమ్స్ లో ఎప్పటికీ నేర్వలేని పాఠాలవి
ఆ రోజు వాడెంత ముద్దొచ్చాడనీ !'

ఉపాధ్యాయులకీ, అధ్యాపకులకీ వాళ్ళ విధ్యార్థులు ముద్దొచ్చే రోజు ఎప్పుడొస్తుందో . 'మూల్యాంకనం', 'సమతుల్యత' మున్నగునవి వృత్తికి సంబంధించిన ప్రవృత్తి ని తెలిపే కవితలే.

'స్వప్నమునందు నిదురించువారు ధన్యులు..' – అనే కవితలో కవికి కవి అంతరాత్మకు జరిగిన సంఘర్షణ ను బొల్లోజు బాబా కళాత్మక భాష లో భాషాతీతంగా కవిత్వం చేసి దాన్ని సార్వత్రిక సత్యావిష్కరణకి ద్వారం చేస్తాడు.

'నాకూ నా అంతరాత్మకు
ఈ మధ్య అస్సలు పడటం లేదు
నే చేసే పనుల పట్ల
వాడు చాలా కోపంగా ఉంటున్నాడు
అరచి గోల చేస్తున్నాడు
నేనో హరిత పంజరంలో చిక్కుకొన్న
పక్షినని ఎంత చెప్పినా వినడు
'నాతో చెప్పొద్దు,నీ ఇష్టం
వచ్చినట్లు చేసుకో' అంటో
చీదరించుకుంటాడు'

కవిత చివర్లో అంతరాత్మతో కవి మాట్లాడి కళ్ళమ్మట నీరు కార్చుకొన్నాకా ....చాలా సేపు మౌనం తరువాత ఆ అంతరాత్మ 'నువ్వు మాత్రం ఏం చేస్తావులే'– అని గొణుక్కోవడం ఈ పద్యం ఒక సత్యావిష్కరణకీ తెరిచిన ద్వారం.

'గడియారం టిక్కు టిక్కు మంటో దగ్గుతున్నట్లుగా .. ఒక మంచి పోలిక జీవిస్తున్నట్లు చెప్పడానికి.

మనిషి దేన్నో ఒకదాన్ని పెంచుకోవడమే తప్ప అందరితో కలసి పంచుకోవడం నేర్చుకోలేదింకా. ఎప్పటికి నేర్చుకొంటాడో అని ఒక విసురు. ప్రకృతిలో అన్ని ఒకదానితో ఒకటి చక్కగా పంచుకోవడం బొల్లోజు బాబా ఎట్లా కవిత్వం చేశాడో చూడండి.

వేకువనీ
తలోముక్కా చక్కగా
పంచుకున్నాయి పక్షులు.
కిరణాల్ని
ఏ పేచి లేకుండా పత్రాల సంచుల్తో
పంచుకొన్నాయి తరువులు
ఇంద్ర ధనువుని
పొరలు పొరలుగా ఒలుచుకొని
పంచుకున్నాయి పూలు

పూలనీ పుప్పొడి గుప్పెళ్ళతో తుమ్మెదలు పంచుకొన్నాయట. రాత్రి హార్మోనియం పై మోహ పరిమళాల రాగాల్ని పలికించినట్లు అనిపించట్లేదూ చదువుతుంటే,..

వెలుతురు తెర అంటే పొరలు పొరలుగా ఒలుచుకొని ఎన్ని అర్థాలైనా చెప్పుకోవచ్చు.అయితే ఈ కవితలో స్మార్ట్ ఫోన్ స్క్రీన్. చెట్టు నీడలో కూర్చున్న విద్యార్థుల గుంపు వెలుతురు తెరలోకి దూరి వైఫై సముద్రంలో తేలిందని అనడం వల్లా అట్లా అర్థం చేసుకోవచ్చు.ఈనాడు గుంపులో కూడా మనిషి ఒంటరి లా వున్నాడు. కారణం అరచేతిలో ప్రపంచం ఒకటి ఇంటర్నెట్ మరొకటి. అది ఇంట్లో గానీ, వీధిలో గానీ, కాలేజ్ క్యాంపస్ లో కానీ సమూహం నుంచి విడివడిన వాడు మళ్ళీ గుంపులోకి రావాలంటే వైఫై లింక్ తెగిపోవాలంటాడు ఈ కవి. ఎవరితోనూ మాట్లాడకుండా మౌనంగా ఇంటర్నెట్ ప్రపంచంలో మునిగిపోయిన విద్యార్థి ని ఇట్లా పోలుస్తాడు ఈ కవి.

"దారాన్ని స్రవించుకొని
కాళతో పేనుకొంటూ తన చుట్టూ తానే
గూడు నిర్మించుకొనే పురుగులా
ప్రతీ విద్యార్థీ తన చుట్టూ
ఓ మౌన పంజరాన్ని దిగేసుకున్నాడు "

వైఫై లింక్ తెగిపోతే ఒక్కో విద్యార్థీ మాటల ప్రపంచంలోకి మెల మెల్లగా మేల్కొంటాడు.కానీ ఇప్పుడు ప్రతి కాలేజ్ క్యాంపస్ లో వైఫై ని వుంచి యాజమాన్యాలు రంగు రంగు మాటల చిలుకలు క్యాంపస్ అంతా రెక్కలల్లార్చుకొంటూ తిరక్కుండా చేస్తున్నాయి.

" ఫ్రాగ్మెంట్స్ " – అనే శీర్షికతో ఓ మూడు దాకా కవితలున్నాయి. ఫ్రాగ్మెంట్స్ అంటే శకలం లేక ముక్క. పూర్వ కవులు కూడా 'ముక్తకాలు' రాశారు . ముక్తకం అంటే పై పద్యంతో కానీ కింది పద్యంతో కానీ అన్వయ సంబంధం లేకుండా వేటికదే ప్రత్యేక అర్థాన్ని కలిగి వుండటం. ఈ ఫ్రాగ్మెంట్స్ లో కూడా ఒక్కొక్క ఫ్రాగ్మెంట్ వేటికదే ఒక ప్రత్యేక భావ సంచయంతో వెలిగిపోయాయి. ప్రతి ఫ్రాగ్మెంట్ కవిత్వపు ఫ్రాగ్రెన్స్ ను వీడకుండా పరిమళుఇంచాయి.మచ్చుకు ఒకటి.

" జీవితం అతని మోముపై
నర్తించి నర్తించి
అలసి పోయింది

ఆ ముఖం పై ముడుతలన్నీ
దాని పాదముద్రలే "

బొల్లోజు బాబాలో భాషా సౌందర్యం, శబ్ద మాధుర్యం వంటివి పుష్కలంగా వున్నాయి.కవిత్వపు వాసన వేసే పదాల ప్రయోగం వుంది. వెరసీ గాఢమైన కవిత్వం చెప్పగలిగే నేర్పు వుంది. మట్టితో పక్షుల బొమ్మలో ఇంకో బొమ్మలో చేసి వాటిని అమ్మి జీవనం సాగించే వారు వుంటారు. వాళ్ళు ఆ బొమ్మల్ని ఏ చెట్టు నీడనో వీధిలోనో తట్టలోనో బుట్టల్లోనో పెట్టి అమ్ముకోవడం చూసిన ఈ కవి రాసిన మంచి కవిత 'పక్షి ప్రేమికులు'

'ప్రతి రోజు అతను తట్ట నిండా దయను మోసుకొచ్చి ప్లాట్ ఫార్మ్ పై పేర్చి ఒక మూలగా కూర్చొని దారిన పోయే వాళ్ళ కళ్ళలోకి చూస్తుంటాడు " – ఈ వాక్యాలు పైన పేర్కొన్న 'పక్షి ప్రేమికులు ' అనే కవిత లోనివి. ఇవి మాములు వచనంలా అనిపించవచ్చు కానీ వచనమై తేలిపోని కవిత్వమవుతుంది ఆ తరువాతి పంక్తులతో.
దయంటే ఏమీ కాదూ
వాని జీవితంలోని కొంత భాగమూ
కొన్ని చెమట చుక్కలు
కాస్తా పల్లెటూరి మట్టి అంతే"
ఇట్లా మాములు వచనాన్ని కూడా కవిత్వం చేయగల శక్తి బొల్లోజు బాబాలో దాగివున్న శిల్ప రహస్యం.

గాయపడ్డ గీతాన్ని తన దేహంలోకి తీసుకొని స్వస్థ పరిచే కవి, ఓ రాత్రిని అనుగ్రహించు ..ఓ రాత్రయినా సందర్భోచితంగా వుంటుందని అనుకుండే వాడు, జేబులోని గులాబి రేకుల గర గరల్ని తడుముకొని తడుముకొని తనేమిటో ఆవిష్కరించుకున్న వాడు బొల్లోజు బాబా.

మధ్యాహ్నపు నిదురలో ఓ స్వప్నం కంటున్నవాడు, కొన్ని పదాల గురించి ఒక జ్ఞాపకం ..ను కవిత్వంగా మార్చిన వాడు, పూల చుంబనాలతో చెట్లు అమరత్వం పొందినట్లు స్వప్నాలతోనే జీవిస్తానని చెప్పేవాడు , అమ్మకై వెచ్చని కన్నీరు ను కవిత్వంగా పేర్చిన వాడు బొల్లోజు బాబా.

అట్లాంటి ఈ కవిని శివారెడ్డి ఇలా అన్నాడు "అతనొక తేనే పిట్ట – తేనె పువ్వుల మీద వాలకుండా గాల్లో తేలుతూ తేనే పీల్చడం ఎంత గొప్ప విద్యో" – ఆ విద్య తెలిసిన వాడు ఈ కవి. అందుకే నేనంటున్నా ఈ కవిని 'వర్తమాన రంపం పరా

పరా కోస్తున్నా సౌకుమార్యం ఏ మాత్రం కోల్పోకుండా కొలను అలలపై ఏటవాలు కాంతి పుంజంలా తన ఆత్మ కోయిల వినిపించిన పాటను కవిత్వం చేసిన వాడని.

రాజారామ్ తూముచర్ల
డిసంబరు, 2016

# 'వెలుతురు తెర' తీస్తే స్మృతి చిహ్నాలు, స్వప్న శకలాలు

అవధానుల మణిబాబు

బొల్లోజు బాబా – డిసెక్షన్ టేబుల్ పై జీవిని ప్రదర్శించి అంతర్గత నిర్మాణాన్ని బోధించే అధ్యాపకుడు. అపారదర్శక దేహంలో దాగిన అంతరంగాన్ని అన్వేషించి అందులో అవకాశమున్నంత మేరా ఆహ్లాదాన్ని నింపాలని తపించే సృజనకారుడు. ఈ రెంటికీ మించి వెలుపలా, లోపలా ఒకేలా ఉండగల అద్వైతి. బహుశా, ఈ మూడవ లక్షణమే మొదటి రెండురంగాలలో వారి ప్రభావానికి కారణమని నా అభిప్రాయం.

పదుగురిలో ఉన్నపుడు తానో విద్యావేత్తగానో; సాహిత్యకారునిగానో బయటపడకుండా జాగ్రత్త పడతారు కానీ ఒంటరిగా కూర్చుని కవిత రాసుకుంటున్నపుడు తనలోని "మాష్టారు, మనిషి" అవసరమైనంతగా చొరబడుతుంటే మాత్రం అచేతనంగా అంగీకరిస్తారు. ఈ బలహీనతే వీరి కవిత్వాన్ని మనసు పెట్టి చదివిస్తుంది. మనసుపట్టి కుదిపేస్తుంది.

★★★

బాబా కవిత్వాన్ని మనం మనలాగే ఉంటూ చదవడం అంత సులభం కాదు. "ఒక సమాంతర కాలంలోకి అనంతంగా ప్రవహిద్దాం వస్తావా!" అని ఆహ్వానిస్తున్నట్లు ఆ పయనం అతనితో సమాంతరం, అనంతం. అంతవరకూ సరే, ఈ ప్రవహించడం ఏమిటి? అప్పటికే హృదయ ద్రవీభవనం జరిగాక మరో మాటెలా అనగలడు కవి?

> బాబా కవిత్వాన్ని మనం మనలాగే ఉంటూ చదవడం అంత సులభం కాదు. "ఒక సమాంతర కాలంలోకి అనంతంగా ప్రవహిద్దాం వస్తావా!" అని ఆహ్వానిస్తున్నట్లు ఆ పయనం అతనితో సమాంతరం, అనంతం.

'ఇంద్ర ధనస్సుని పొరలు పొరలుగా ఒలుచుకొని పంచుకొన్నాయి పూలు' అని ఓ కవితలోనూ, 'క్రోటన్ మొక్కలు ఇంద్రధనుస్సుని పగలగొట్టుకొని పంచుకొన్నట్లున్నాయి' అని fragment గానూ రాసి పక్క పక్క పేజీల్లో ప్రచురించడం, కవికి ఇది పునరుక్తి అని తెలియకకాదు. ఒకే సామ్యాన్ని వివిధ సందర్భాలుగా కవిత్వీకరించగల తన అన్వయశక్తిని ప్రకటించడం. ఒకే భావన అక్కడ పొరలు పొరలుగా ఒలవబడి కవితైతే, ఇక్కడ పగిలి లఘురూపాన మెరిసింది.

కొందరి సహవాసంలో జీవితంలో ప్రతిక్షణం నూతనత్వాన్ని అలముకుంటుంది. అవే పరిసరాలు, అవే సంగతులు అయితేనేం? నిన్నటిని రేపు తలచుకుంటున్నపుడు దాచుకోడానికి కొన్ని జ్ఞాపకాలు కనిపిస్తాయి. ఇంతటి వైవిధ్యాన్ని జీవితంలో నింపిన వ్యక్తులు హటాత్తుగా దూరమైతే? అనుక్షణం సంబరంగా గడవాల్సిన జీవితం సాధారణ సన్నివేశంగా మారిపోతుంది. అలాంటి ఓ సమయంలో "నీ నిష్క్రమణ తరువాత రోజులన్నీ ఒకేలా ఉన్నాయి, మరోసారి ఏడవటం తప్ప మరేం చేయగలను చిన్నమ్మా!" అంటాడు కవి. "జానెవాలే కభీ నహీ ఆతే, జానెవాలోంకి యాద్ ఆతీ హై" అనే పార్శీకవి వాక్యాన్ని పరిచయంచేస్తారు తన "యాది" లో శ్రీ సామల సదాశివ. అవును, పోయినవారు రాలేరు. కానీ, వారి జ్ఞాపకాలు కళ్ళెదుట కదలాడతాయి, కవితలకు ప్రేరణవుతాయి.

జీవితమంటే ఏకాంతిక వర్తనం కాదు. సామూహిక ఉత్సవం. కవులంతా అంతర్వర్తునులే అని కొన్నిసార్లు కొందరు generalize చేసినా, వినడానికో, విమర్శించడానికో వాళ్ళకీ ఓ నలుగురు కావాలి. అందుకే, "ఎవరూ నడవని దారి కదాని ఉత్సాహంగా ముందుకు పోతుంటే జీవితం నవ్వుతో ఓయ్ పిచ్చి మొద్దూ నేనిక్కడుంటే అటేక్కడికి పోతున్నవ్? అంది వెనుకనుంచి" అని స్వీయానుభవంగా చెప్పుకుంటాడు కవి.

అన్ని నవ్వులూ ఆనందాన్ని పంచవు. అన్ని కన్నీళ్ళు బాధించవు. నవ్వు, ఏడుపు ఈ రెండు మాత్రమే ప్రతిస్పందనకు ఉద్దీపనలుగా సరిపోవేమో. వాటి వెనుక స్థితిగతులే ప్రధాన కారకాలేమో. నిజమేననిపిస్తుంది "ఆ కాన్సర్ పిలగాని నవ్వు కన్నీళ్ళ కన్నా ఎక్కువ బాధిస్తోంది" అనే వాక్యం చదివినపుడు.

'సమీక్ష' దృష్టితో చదివేటపుడు, ఓ సంపుటిలోని కవితల అంతస్తత్వాన్నిబట్టి వాటిని వివిధ తరగతులుగా వర్గీకరించి విడి విడిగా పరిశీలించి కవిని అందుకోడానికి ప్రయత్నిస్తాం. "అన్ని నిర్ణయాలు ముందే అయిపోయాయి. ఏదో కాలక్షేపానికి జీవించాలి అంతే' . "ప్రకృతి పొరల్లో ప్రాణాన్ని గింజను చేసి పాతిపెట్టే మృత్యువుంది .. ఎంతదృష్టం?" ఇలాంటి వాక్యాలు ఎదురైనపుడు మాత్రం ఇది వేదాంతమా? జీవితం నేర్పిన రాజీపాఠమా? సంపూర్ణ సంతృప్తి వ్యక్తపరచడమా? – ఇలా పరమార్థం తెలీక సమీక్ష మాట అటుంచి కాసేపు సంబరపడిపోతాం.

"ఇంటికెళ్ళ లేక పోవటం ఒక విషాదం / పెద్ద పులిని నమ్మించలేకపోయిన ఆవుకోసం / లేగదూడ జీవితాంతం అరుస్తూంటుంది" ఇక్కడ 'జీవితాంతం' అనే పదాన్ని ప్రాధాన్యరహితంగా భావిస్తే కవితలో అనేక అన్వయాలకు ఆస్కారం ఉంటుంది. మరోసారి పై పదాన్ని ఒకింత దృష్టి సారించి పలికితే - పెద్దపులి యముడని, తాను ఆవునని, వెళ్ళకపోవడానికి కారణం మరణమని, ఇంటిదగ్గర ఎదురుచూస్తూన్న వారంతా లేగదూడలని, వారి అరుపులు జ్ఞాపకాలని తెలిసిపోతుంది. ఇంత తెలిసాక, వెంటనే పక్క పేజీలోకెళ్ళి మరో కవిత చదివేస్తే, పాఠకునిగా మనమెక్కడో ఫెయిలవుతున్నట్లు లెక్క.

★★★

తన అనుభవాల జేబులో ఇప్పటికీ దాచిన యవ్వన దశలోని "గులాబీరేకల గరగరల్ని' ; నాయనమ్మ, అమ్మ, భార్యల మూడు తరాల గృహ నిర్వహణా సామర్థ్యాన్ని; పరీక్ష పత్రాల్ని దిద్దుతున్నపుడు మెదడుతో తూకం వేస్తూ, హృదయంతో మూల్యాంకన చేస్తూ, ఖాళీ జవాబు పత్రంలో విద్యార్థిని జీవితం సంధించిన ప్రశ్నలను వెతుకగల తన బహుముఖ విన్యాసాన్నీ, ........ పనిగట్టుకుని పెంచాలనో, కావాలని కుదించాలనో తాపత్రయ పడకుండా ప్రతీ అనుభూతినీ, తానో కవితలో అన్నట్లు 'మట్టిని మోసుకెళ్ళే కందిరీగ' లా శ్రద్ధగాతెచ్చి మన గుండెల్లో గూడు కట్టేసాక, ఆలోచించేందుకు మనకంటూ ఏమీ మిగలవిక - " జేబుడు పదాలు, గుప్పెడు కలల ముక్కలు తప్ప" . బతుకు ఉత్సవం కావడానికి ఇవి చాలవా?

అవధానుల మణిబాబు

12-Dec-2016

# బొల్లోజు బాబా - వెలుతురు తెర పరిచయం

జగద్ధాత్రి

నేటి తెలుగు కవితా జగతిలో బొల్లోజు బాబా పేరు వినని వారుండరు. ముంజేతి కంకణానికి అద్దమేలా? అని మీరనొచ్చు. కానీ ఒకోసారి ఇది అవసరం, అందుకే బొల్లోజు బాబా గురించి అతని కవిత్వం గురించి కాసిన్ని కబుర్లుచెప్పుకుందాం.

మెత్తని పారిజాత పూల పై ఆనుకుని చక్కన్ని టాగోర్ మధుర కవిత చదువుతుంటే ఎంత హాయిగా ఉంటుందో బాబా కవిత్వం అలాంటి అనుభూతిని ఇస్తుంది. బాబా ప్రకృతి ప్రేమికుడే కాదు తాను ప్రకృతిలో ఒక భాగమయి జీవించే మనిషి. ఇది ఇతని కవిత్వం బాగా తెలుపుతుంది. ఇతని మొదటి కవితా సంపుటి " ఒక ఆకుపచ్చని గీతం"(2009) కి శిలపరసెట్టి శ్రీరాములు అవార్డ్ వచ్చింది. ఇటీవల బాబా తీసుకొచ్చిన మరో కవితా సంపుటి " వెలుతురు తెర". టాగోర్ రాసిన చిరు కవితలు "స్ట్రే బర్డ్స్" ను కూడా తెలుగు లోకి "స్వేచ్ఛా విహంగాలు" పేరిట అనువదించి పుస్తకంగా వెలువరించాడు. ఈ రెండు పుస్తకాలు ఇటీవలే ఆవిష్కరణ జరిగాయి. ప్రకృతిలో మమేకమయి పోయిన వాడు అయితే చిత్రాలు గీస్తాడు, లేదా కవిత్వం రాస్తాడు. చిత్రంగా బాబా చిత్రాల్లాంటి కవితలు రాస్తాడు. ఇతని తొలి కవితా సంపుటిలోనే ఈ అంశం మనకు అవగత మౌతుంది.

ఆర్తి ఆవేదన కవిత్వానికి మూల కారకాలు. అలాంటి ఆవేదనల నివేదనే బాబా కవిత్వం. ఇక వ్యక్తిగా బాబా గురించి రెండు మాటలు చెప్పుకోవాలి. మెల్లగా మాట్లాడుతాడు , మెత్తగా నవ్వుతాడు. చూడగానే సహృదయత , జీవన మర్యాద ఉట్టి పడుతూ ఉంటాయి. నిత్య విద్యార్థిగా తనని తాను భావించుకునే అతి సౌమ్యుడు, నిగర్వి. నచ్చిన మంచి పుస్తకాలు కవులు తాత్వికులను అనువదిస్తాడు. మనుషుల పట్ల మమతల పట్ల అధికంగా అనురాగం కలవాడు. ఇక బాబా కవిత్వం గురించి. మెరుపుల్లా వచ్చి తెగి పోతున్న ఆలోచనల్ని ఫ్రాగ్మెంట్స్ గా కవితలుగా నమోదు చేసిన ఓ దాన్లో అంటాడిలా :

"జీవితం అతని మోముపై
నర్తించి నర్తించి
అలసిపోయింది
ఆ ముఖం పై ముడుతలన్న
దాని పాద ముద్రలే" సున్నితమైన మాటల్లో జీవితాన్ని చెప్పే కవిత ఇది.

" నేల సంకెళ్ళను
నిత్యం తడుముకుంటూనే
వెలుగును తరుముకుంటూ
నీలాకాశం లోకి చొచ్చుకొని
పోతుంటాయి తరువులు. చెట్టుని మించిన
వ్యక్తిత్వవికాస పుస్తకం ఏది?"

మొదటి పంక్తుల్లో చెట్టుని వర్ణించడం సాధారణమే అయితే చెట్టును మించిన వ్యక్తిత్వ పుస్తకం ఏది అనడం లోనే బాబా తన ముద్రను చూపించాడు. గజల్ లో షేర్ లో రెండవ పంక్తి ముక్తాయింపులో కనిపించే మెరుపు చమత్కారం లాంటిది ఈ అంశం. చెట్టును మించిన వ్యక్తిత్వ వికాస పుస్తకం లేదన్న కవి భావనకి జోహార్లు.

కొత్త కవిత్వ సంపుటి శీర్షిక కవిత :
వెలుతురు తెర
చెట్టు నీడలో కూర్చొన్న
విద్యార్థుల గుంపు
వెలుతురు తెరలో దూకి
వైఫై సముద్రం లో తేలింది
దారాన్ని స్రవించుకొని
కాళ్లతో పెనుకుంటూ తన చుట్టూ తానే
గూడు నిర్మించుకొనే పురుగులా
ప్రతీ విద్యార్థి తన చుట్టూ
ఓ మౌన పంజరాన్ని దిగేసుకున్నాడు.
వైఫై లింక్ తెగింది

ఒహో! షిట్....
గూడులోంచి సీతాకొక చిలుక
మెత్త మెత్తగా బయట పడినట్లుగా
ఒక్కో విద్యార్థీ మాటల ప్రపంచంలోకి
మెల్ల మెల్లగా మేల్కొన్నాడు
కాసేపటికి కాంపస్ అంతా
రంగు రంగుల మాటల చిలుకలు
రెక్కలల్లార్చుకొంటూ ఎగురుతో!

ఈ కవితా చదివిన వెంటనే ఏమనిపిస్తుంది? టాగోర్ , చలం , ఇస్మాయిల్ గుర్తు రావడం లేదూ? మృదుత్వం, వేదన కలబోసుకున్న ఈ మాటల్లో ఆధునిక ప్రపంచం గురించిన అంశాన్ని నేటి పరిభాషలో అభివ్యక్తి చేయడం. ఇదే బాబా కవిత్వానికి గీటు రాయి. మాటలు పాతవే ఎవరు రాసినా , వాటికద్దే భావాల పరిమళాలే ఎప్పటికప్పుడు ఒక కవిని ప్రత్యేకంగా నిలపగలిగేవి. అలాంటి ప్రత్యేక కవి బాబా అనడం లో సందేహం లేదు. ఈ కవి భావలలోనే కాదు పదాల ప్రయోగం లోనూ చలానికి వారసుడు. చలం మాటలాడేటప్పుడు , రాసేటప్పుడు కూడా "ఎగురుతో' అంటాడు ఎగురుతూ అనడానికి బదులు. బాబా కూడా అలాగే ఎగురుతో అని రాస్తాడు. ఇది మనకి భావుకత్వానికి ఒక ప్రతీకగా కనిపిస్తుంది.

బాబా కవిత్వం లో మరొక మంచి కవిత కేవలం స్త్రీలు మాత్రమే రాయగలరు అనుకున్న కవితా అనూహ్యమైన కవిత " ఒక హిస్టోరెక్టొమీ" ప్రముఖ కవయిత్రి హిమజ చాలా కాలం క్రితం ఇదే పేరుతో ఇదే అంశంపై కవిత రాసేరు. మళ్ళీ ఇన్నేళ్లకి బాబా కలం నుండి ఈ కవిత రావడం ఆశ్చర్యం, ఆనందదాయకం కూడా. విచ్చలవిడి గా అవసరం ఉన్నా లేకున్నా జరుగుతున్నా హిస్టెరెక్టొమీ ఆపరేషన్లు చూసిన కవి సున్నిత హృదయం స్పందించింది ఇలా :

"కారణాలెమైనా కానీ
నెలకో రక్త పుష్పాన్ని రాల్చే
వృక్షాన్ని సమూలంగా
పెకిలించారు

నాగరీకుని
వైద్య ప్రయోగశాలలో
స్త్రీ దేహమేప్పుడూ ఓ గినియా పిగ్గే!"

అంటూ ఆవేదన వ్యక్తం చేస్తాడు. స్త్రీల దేహాలపై ఈ శాస్త్ర చికిత్స చూపే ప్రభావాన్ని కూడా ఆవేదనతో చెప్తాడు బాబా. మందులు మాత్రలు , ఇప్పుడిక అద్దె గర్భాలు అన్నీ ప్రయోగాలు స్త్రీ దేహం పైననే అని వాపోతూ చివరిగా అంటాడిలా

"జరాయురహిత దేహమిపుడో
సజీవ టంకశాల కదా!" ఆవేదన కలిగించే ఈ కవిత కు స్త్రీలందరు కృతజ్ఞతలు చెప్పాలి బాబాకీ. ఆ కోల్పోయినతనం ఆ బాధ స్త్రీకి మాత్రమే తెలుస్తుంది. అలాంటి విషయాన్ని తీసుకుని హృదయానికి హత్తుకునేలా రాసిన బాబాకి స్త్రీలందరి తరపునా నేను కృతజ్ఞత తెలియజేస్తున్నా.

"యానాం విమోచనోద్యమం" కూడా బాబా రచించారు. అనుక్షణం మమతల హరివిల్లులా అనవరతం ప్రేమ పొదరిల్లులా జీవితాన్ని ఆస్వాదించే కవి తన చుట్టూ ఉన్న వారికి ఆ అనురాగ సంపదను పంచిపెట్టే బాబా లాంటి కవులు నేటి యాంత్రిక యుగం లో ఆశారేఖలు.
గాధా సప్తసతి , సూఫీ పద్యాలు ఇలా ఇంకా తనకు నచ్చిన వాటిని అనువాదాలు కూడా విరివిగా చేస్తున్న బాబా కలం నుండి హృదయాలు చెమరించే కవిత్వం మరింత రావాలని ఆశతో , ఆకాంక్షతో శుభాకాంక్షలు ....

జగద్ధాత్రి
OCTOBER 1, 2016

# గోదావరి జిల్లాల కవిత్వానికి కొత్త వారసుడు – బొల్లోజు బాబా

ఆకెళ్ళ రవిప్రకాష్

1991 నించి ఏదో ఒక కవిత్వ కాలమ్ లో తరచు తన కవిత్వం కనిపించినా బొల్లోజు బాబా తన మొదటి సంకలనం “ఆకుపచ్చని తడి గీతం” తీసుకు రాడానికి 2009 వరకు ఎదురు చూసాడు. “ సాహితీ యానం” అనే కవిత్వ blog ని అంతకు ముందే ప్రారంభించాడు. 2007 లో యానాం విమోచనోద్యమం 2012 లో ‘ ఫ్రెంచ్ పాలనలో యానాం’ అనే రెండు చారిత్రక పుస్తకాల్ని ప్రచురించాడు. “ఎడారిలో అత్తరులు” అనే సూఫీ కవులవీ, ఇరవై ప్రేమ కవితలు అని పాబ్లో నెరుడా, గాథా సప్తశతి, టాగోర్ Stray Birds ఇవన్నీ అనువాదాలు చేసాడు. 40 పైగా విమర్శనా వ్యాసాలు, ఇపుడు 2017 లో “వెలుతురు తెర” తన రెండో కవితా సంకలనం తో ముందుకొచ్చాడు. పాతికేళ్ళ యితని సాహితీ యాత్రలో గత పదేళ్ళలో అత్యంత చురుకైన కాలంగా గుర్తించవచ్చు. కవిసంగమం వంటి సామాజిక మాధ్యమాలలోనూ ఈ కవి శక్తివంతంగా భాగం తీసుకోవడం చూడొచ్చు.

తూర్పుగోదావరి జిల్లాకు మధ్యన, కోనసీమకు ఆనుకుని వున్న మునుపటి ఫ్రెంచ్ కాలనీ యానాం ఇతని సొంత వూరు. ఇతని తండ్రి గారు బొల్లోజు బసవలింగం గారు యానాం లో ప్రసిద్ధులు. ఫ్రెంచ్ భాషలో పాండిత్యం, యానాం చరిత్ర మీద అనర్గళంగా ప్రసంగించగల శక్తి, సాహిత్యం నాటకం మీద మక్కువతో బసవలింగం గారు నేను యానాం లో పనిచేసినపుడు సుపరిచితులు. ఆరోజుల్లో బాబా దరియాల తిప్ప స్కూల్లో టీచరుగా పనిచేసి తర్వాత ఆంధ్రప్రదేశ్ సర్వీస్ కమిషనులో లెక్చరర్ గా ఎంపికయ్యి, ఇపుడు కాకినాడ PR కాలేజి లో పనిచేయడం మనకు తెలుసు. తన తండ్రిలాగా అధ్యాపక వృత్తి, ఫ్రెంచి చరిత్ర మీద మక్కువ, సాహిత్యం, కవిత్వంలో నేర్పుకలిగి వీటన్నిటిలో, తండ్రిని మించిన తనయుడు అని చెప్పాలి. ఇప్పటికే తండ్రిగారు చేయక మిగిలి వెళ్ళిన పనులన్నీ చకచకా చక్కబెట్టారనడంలో సందేహం లేదు. సూఫీల మీద, ఖలీల్ జిబ్రాన్, టాగోర్ లాటి సాధు కవులమీద మోజు కలిగిన యితనికి తల్లిదండ్రులు “బాబా” అని సార్థక నామం ఇచ్చారనిపిస్తోంది

> సగటు మధ్య తరగతి ఉద్యోగిగా వుంటూ, తన చుట్టూ వున్న ప్రపంచం పట్ల నిజాయితీగా, సున్నితంగా, మృదువుగా స్పందిస్తున్న ఒక దయాళువు కనబడతాడు. సామాజిక స్పృహ అంటే ఇంతకన్నా ఆశించేది ఏముంటుంది ?

యానాం నించి బలమైన కవిగా శిఖామణి తెలుగు కవిత్వంలోకి అడుగు పెట్టిన నాటినించి, ఆ భూమి కవిత్వానికి సారవంతమైన ప్రాంతం గా సాగు చేసుకుని వచ్చాడు. శిఖామణి బొల్లోజు బాబా కి మొదటి కవిత్వ గురువు. మొదటి కవిత నించీ, ఇప్పటి వరకు శిఖామణి ఇతని మీద చూపించిన ప్రత్యేక శ్రద్ధ సామాన్యమయినది కాదు. PG చదువుతున్నప్పుడు ఇస్మాయిల్ గారిని కలిసి కవిత్వ తాత్విక చర్చ చేయడం, ఇస్మాయిల్ ఇతని లోని spark ని గుర్తించి తేలిక పదాల ద్వారా కవిత్వ రచన ఎలా చేయవచ్చో తెలియచేయడం యితని కవిత్వ జీవితంలో పెద్ద మలుపు. ఆ రకంగా ఇస్మాయిల్ వీరికి పెద్ద గురువు. ఇతను ఇస్మాయిల్ లా గా ఆలస్యంగా కవిత్వ సంకలనం తేవడం, ఆయన లాగే PR కాలేజి లో పనిచేయడం ఇవన్నీ కాకతాళీయమే. గోదావరి జిల్లాల కవులు కృష్ణశాస్త్రి, తిలక్, సోమసుందర్, ఇస్మాయిల్, చిన వీరభద్రుడు, శిఖామణి లకు ఈ తరం వారసుడుగా బొల్లోజు బాబాను గుర్తించవచ్చు. గోదావరి జిల్లాల్లో చదువుకున్న వారు మాట్లాడే సహజ వ్యావహారిక భాష, సరళ మైన, సుందరమైన, శుభ్రమైన తెలుగులో కవిత్వం రాస్తున్న వారిలో బాబా ఒకరు.

**కవిత్వంలో నిశ్శబ్దం:**

'కవిత్వంలో నిశ్శబ్దం' అనే పదం ఇస్మాయిల్ గారి ద్వారా అందరికీ చిరపరిచితమే. ఇస్మాయిల్ కవిత్వంలో నిశ్శబ్దం ఉంటుందని అందరూ అంటారు. శబ్ద ఆడంబరం (Rhetoric) లేకపోవడం అనేది మాత్రమే కాకుండా visual metaphors తో దృశ్యాల్ని కంటిముందు నిలిపి భావ ప్రకటన చేయడంలో ఇస్మాయిల్ గారిది అందెవేసిన చెయ్యి. సరళమైన, క్లుప్తమైన వ్యక్తీకరణ తో దృశ్యావిష్కరణ ద్వారా కవిత్వాన్ని సౌందర్యంతో నింపడం బాబా కవిత్వంలోకూడా పుష్కలంగా వుంది.

సౌందర్యం .. (ఆకుపచ్చని తడి గీతం)

'సెలయేటి ఎగువన ఎవరో  
నీటిలో వెన్నెల బిందువుల్ని  
కలిపారు.  
సెలయేరు పొడవునా వెన్నెలే  
నీరు తాగలని వంగితే  
దోసిట్లో చందమామ"

అక్షరాలతో గీసిన చిత్ర పటాల్లా వుంటాయి ఈ కవితలు. దృశ్యమే కవిత్వం గా మారడమే కవిత్వంలో నిశ్శబ్దం అనొచ్చు.

ఊడుపు (వెలుతురు తెర)

పట్టె తోలిన వరిచేను
ఏది మబ్బు? ఏది కొంగ ?
ఒంగున్న స్త్రీలు
వరి మొలకల్ని
అనంత నీలిమలో
గుచ్చుతున్నారు
ఏది మన్ను ? ఏది మిన్ను ?

ఈ కవితను చూస్తే కళ్ళకి నీళ్ళతో నిండిన వరిచేను దర్శనమిస్తుంది. యిలా నిశ్శబ్ద సౌందర్యం బాబా కవిత్వం నిండా పుష్కలంగా దొరుకుతుంది.

**తెరుచుకున్న పద్యాలు:**

తెరుచుకున్న కవితలనే పదాన్ని ప్రాచుర్యంలోకి తీసుకొచ్చింది ఇస్మాయిల్ గారు. కవిత్వం నడకలో చివరివరకు వచ్చే సరికి కొత్త ప్రపంచంలోకి తెరుచుకున్నట్టు వుండడం ఇస్మాయిల్ గారి కవిత్వంలో చూస్తాం. బొల్లోజు బాబా కవిత్వంలో కూడా తెరుచుకునే పద్యాలు అనేకం. ఇస్మాయిల్ గారు పద్యాల్లో రెండు మూడు evolving interconnected metaphors ని, ఎంచుకుంటారు. పద్యం మొదట్లో ఒక రూపకం, చివరి భాగంలో ఒక రూపకం వాడుతూ, చివర లో ఒక metaphor నించి, ఇంకో metaphor కి కవిత నెమ్మదిగా transfer అయినప్పుడు వాడిన సరళమైన పదప్రయోగం ద్వారా చిత్తాన్ని తేలికపరిచి అనుభవాన్ని కలిగించడాన్ని తెరుచుకున్న పద్యం అంటున్నాం. ఈ రహస్యాన్ని బొల్లోజు బాబా చాలా గట్టిగా ఆకళింపు చేసుకుని తన కవిత్వంలో అద్భుతంగా నిర్వహించాడు.
'వెలుతురు తెర' (వెలుతురు తెర సంపుటం లోనిది)

దారాన్ని స్రవించుకుని
కాళ్ళతో పేనుకుంటూ తనచుట్టూ తానే
గూడు నిర్మించుకునే పురుగులా

ప్రతి విద్యార్థి తన చుట్టూ
ఓ మౌన పంజరాన్ని బిగేసుకున్నాడు
గూడులోంచి సీతాకోకచిలుక
మెత్త మెత్తగా బయట పడినట్లుగా
ఒక్కో విద్యార్థి మాటల ప్రపంచంలోకి
మెలమెల్లగా మేల్కొన్నాడు.
కాసేపటికి కాంపస్ అంతా
రంగు రంగుల మాటల చిలుకలు
రెక్కలల్లార్చుకుంటూ ఎగురుతో !

ఇలా బాబా కవిత్వంలో ఎన్నోతెరుచుకున్న పద్యాల్ని దర్శించవచ్చు.

**కథాత్మక ధోరణి:**

ఇతని కవితల్లో కథ చెప్పే ధోరణిలో కవిత్వం నిర్మించడం, అత్యంత చాకచక్యంగా కవితని నిర్వహించడం చూస్తాం. బాబా కవిత్వంలో కవితాత్మక బిగువు ఆద్యంతం సాగుతుంది. ఇతని కవితలో చాలా చోట్ల, కథని metaphor గా నిర్వహించడం చూస్తాం.

'దొరికిన దొంగ' (వెలుతురు తెర)

కొబ్బరికాయల దొంగ దొరికాడట
చెట్టుకు కట్టేసి కొడుతున్నారట
చూట్టానికి వెళ్ళాను

ఇలా అనేక కవితలు చరిత్ర, మార్పు, చర్మం రంగు, పక్కింటబ్బాయి, ఆత్మహత్యా యత్నం, వీటన్నిటిలో కథ ద్వారా అనుభవం కలుగుతుంది.

కథాత్మక ధోరణిలో యిప్పటికే అనేక మంది రాసివున్నా, బొల్లోజు బాబా కవిత్వంలో యిది అత్యంత సహజ సిద్ధంగా కనిపిస్తుంది.

**నాటకీయ శైలి:**

బాబా కవిత్వంలో చాలాచోట్ల కవిత రంగస్థలి మీద నడుస్తున్న నాటక ఫక్కీలో నడుస్తుంది.

చరిత్ర (వెలుతురు తెర)

‘ఈ సొరంగం చివర
వెలుతురు వుండి తీరాలి’ అన్నాడతను
‘ఒకప్పుడు ఉండేదట
చెదలు తినేసాక వెలుతురంతా
అయిపోయింది’ అన్నారు కొందరు వృద్ధులు”

ఇలా సంభాషణాత్మకంగా కవిత పొరలు పొరలుగా తెరుచుకుంటుంది. నాటకీయ ఫక్కీలో ఇంత సహజంగా వచనకవితా విన్యాసం సులువైన విషయం కాదు.

Poetry of experience లో నాటకీయ ఫక్కీలో అనుభవాన్ని పాఠకుడుకి చేరవేయడం లో ఆత్మీయత వుంది. అనుభవాన్ని పాఠకులకి గాఢంగా చేరవేయడానికి తన పూర్వ అనుభవ కవులు దృశ్యాన్ని, double metaphors ని వాహికగా వాడుకుంటే బొల్లోజు బాబా కాస్త ముందుకు నడిచి కథాత్మక నాటకీయత ద్వారా దృశ్యాల్ని రచింప చేసి తద్వారా అనుభవాన్ని బదలాయిస్తున్నాడు. అనుభవ కవిత్వాన్ని పాఠకులకు మరింత చేరువ చేయడానికి powerful tools ని సమకూర్చుకున్నాడు.

**అద్భుత తాత్వికత**

ఆకు పచ్చని తడి గీతంలో గాని, వెలుతురు తెర లో గాని, Fragments అనే పేరుతో కొన్ని కవితా ఖండికలను రాసాడు. నిర్మాణంలో గానీ, శైలి, భాష వీటన్నిటిలో మిగతా కవితల నిర్మాణం కన్నా యివి భిన్న మైనవి. హైకూల కన్నా పెద్దవి. మినీ కవితలు అనవచ్చు. సూఫీ కవులు, ఖలీల్ జిబ్రాన్, టాగోర్ వీరందరి తాత్విక ప్రభావంతో రాసినట్లే వున్నా వీటిలో లోతైన అందం వుంది.  బొల్లోజు బాబా లో లోతైన తాత్వికతా చింతనకు Fragments దర్పణాలు. వీటిలో సరళత, గాఢత నన్ను పూర్తిగా వశపరుచుకున్నాయి.

**సామాజిక భూమిక**

బొల్లోజు బాబా కవిత్వంలో మానవతావాదం, స్వేచ్ఛావాదం, స్త్రీ వాదం తో కూడిన సరళ సామజిక భూమిక కనిపిస్తుంది. ఇతను సామాజికంగా rebel కాదు. కానీ, నిరంతర చింతనాశీలి. తన నిత్య జీవితంలో స్వానుభవంలోకి వచ్చిన ప్రతి విషయం

గురించి సునిశితంగా, దయగా, సూక్ష్మంగా స్పందిస్తాడు. అది ఫీజు కట్టలేక చదువు మానేసిన కుర్రాడు అయినా కావచ్చు, చర్మ రంగు గురించి ఉబ్బిన కళ్ళతో బాధపడిన పాప కావచ్చు. రాత్రిపూట పారిశుభ్య పనివాళ్ళు కావచ్చు, గర్భిణీ స్త్రీలకూ ఉచితంగా సేవలందించే ఆటో ప్రకాష్ కావచ్చు, పోలవరం నిర్వాసితులు కావచ్చు, సగటు మధ్య తరగతి ఉద్యోగిగా వుంటూ, తన చుట్టూ వున్న ప్రపంచం పట్ల నిజాయితీగా, సున్నితంగా, మృదువుగా స్పందిస్తున్న ఒక దయాళువు కనబడతాడు. సామాజిక స్పృహ అంటే ఇంతకన్నా ఆశించేది ఏముంటుంది ?

### గుండెలు పిండేసే కవితలు

అధ్యాపకుని పాత్రలో బాబా రాసిన అన్ని కవితలూ కూడా ఒక్కొక్కటి ఒక master piece. ఆ కవితలన్నిటికీ నేను దాసోహం అయిపోయాను. "ఎందుకో తెలియటం లేదు" కనే కవితలో ఫీజు కట్టలేక చదువు మానేసిన కుర్రాడు ఆటో తిప్పుతూ ఆ ఆటో కి కూడా యాక్సిడెంట్ అయి రిక్షా తొక్కడానికి సిద్ధపడ్డ పిల్లాణ్ణి చూడలేక ఆ రోడ్ ద్వారా వెళ్ళలేక పోతాడు. అలాగే మూల్యాంకనం, సార్ గారండీ, చర్మం రంగు, నీటి పొర, యివన్నీ కంట తడి పెట్టిస్తాయి. శిఖామణి మువ్వల చేతి కర్ర లోని కొన్ని కవితల్లా నన్ను బాగా కదిలించిందీ, కరిగించిందీ వెలుతురు తెరలోని యీ కవితలే.

### సమ్మోహనం

స్త్రీ పురుష బంధాలలోని చిత్రమైన shades ని బాబా చాల బాగా పట్టుకోగలిగాడు. ఈ రకమైన కోణాలు కవిత్వంలో ఇంతకు మునుపు తక్కువ చూసాను.

"ఆమె మాత్రం చిరునవ్వు శాపమిచ్చి సాగిపోయింది" అనడం చిత్రమైన భావనను కలిగించింది.

అలాగే మార్పు అనే కవితలో ఆదర్శప్రాయంగా కాలేజీలోవున్నపుడు ఎంతో అభిమానించిన ఒక అమ్మాయికి old students meet లో చూసి నిరాశ చెంది, చూడకుండా వుంటే బాగుండేది అనడం మరో చిత్రమైన భావన. శ్రీమతి పెళ్ళైన కొత్తల్లో తనకి రాసిన ప్రేమలేఖని కూతురు భలేగా వుందే అని ఆశ్చర్యంగా చూస్తుంటే, అద్భుతంగా వర్ణించిన విషయాలు కాలం గడిచినకొద్దీ బంధం ఎలా పరిణతి చెందుతుందో అద్దం పడుతుంది.

ముగింపు

యానం- గోదావరి జిల్లాల కవిత్వ వారసత్వంలో వెలుగొందిన అనేక గొప్ప కవులు కృష్ణశాస్త్రి, తిలక్, ఇస్మాయిల్, శిఖామణి వీరందరి తర్వాత తరం ప్రతినిధిగా తనదైన ముద్రతో రాస్తున్న కవి బొల్లోజు బాబా. ఇస్మాయిల్ కవిత్వ పురస్కారం అందుకోవడానికి సర్వదా అర్హుడు. ఇతను కవిగా మరింత ఎదిగి దేశ విదేశాల్లో తెలుగు కవిత్వ బావుటా ఎగురవేస్తాడని ఆశిస్తున్నాను.

(ఇస్మాయిల్ పురస్కార ప్రదాన సందర్భంగా)

SrI Akella Ravi Prakash

21 జనవరి, 2018

పాలపిట్ట పత్రిక

# చక్కని కానుక

వాడ్రేవు చినవీర భద్రుడు

(స్వేచ్ఛావిహంగాలకు వ్రాసిన ముందుమాట)



ఇప్పుడు కవిత్వం రాస్తున్నవాళ్ళలో బొల్లోజు బాబా కొంత ప్రత్యేకంగా కనిపిస్తున్నాడు. అతణ్ణి ఒక ఉపాసకుడిగా అభివర్ణించవచ్చు. ఎవరేనా గొప్ప కవిత్వం రాయడం అలా ఉంచి, అసలు ముందు కవికావాలంటే కూడా తీవ్ర సాధనా, ఉపాసనా తప్పనిసరి. తనంతట తానుగా చెప్పాలనుకు న్నది మాత్రమే కాదు, తన పూర్వకవులు ఏం చెప్పారో, ఎట్లా చెప్పారో తెలుసుకోవాలన్న తపన కూడా ఆ ఉపాసనలో భాగమే.

కవిత్వం ఒక individual utterance మాత్రమే కాదు, అది తరం నుంచి తరానికి, యుగం నుంచి యుగానికి ప్రసరించే, అగ్నిధార కూడా. అందుకనే వాక్కులన్నిటికన్నా ప్రాచీనమైన ఋగ్వేదంలో, మొదటి సూక్తంలోనే, అగ్నిని ఆహ్వానిస్తూ 'అగ్నిః పూర్వేభిః ఋషిభిః ఈడ్యో నూతనైః ఉత' అన్నారు. కొత్తగా గొంతు విప్పుతున్న ప్రతి కవిలోనూ పూర్వకవులే మరోసారి గొంతు సవరించుకుంటున్నారు. పూర్వమార్గం నుంచి తప్పుకుని కొత్త పంథా వేసారని చెప్పుకునే కవుల కొత్త పంథాలో కూడా ఎవరో ఒక పూర్వకవి తొంగిచూస్తూనే ఉంటాడు.

పూర్వకవుల్ని అధ్యయనం చేసే కవి, వారిని తిరిగి తన వాక్కులోకి అనుసృజించుకునే కవి జన్మ ధన్యం. ఎందుకంటే అతడు పూర్వతరాల జీవితమంతా మరోసారి జీవిస్తున్నాడు. అట్లాంటి కవి ఆయుర్దాయం గొప్పది, భావనాబలం గొప్పది, అనుభూతి సాంద్రత గొప్పది.

బొల్లోజు బాబా తన ఉపాసనలో ఎందరో పూర్వమహాకవుల సాన్నిధ్యసుఖాన్ని అనుభవిస్తూ నే ఉన్నాడు. రూమీనుంచి నెరూదా దాకా. ఇప్పుడు టాగోర్.

**2**

గాంధీ రచనల్లో ఎక్కడన్నా 'కవి 'అనే పదం కనిపిస్తే అది టాగోర్ అనే అర్థం. కాళిదాసు వాల్మీకినిమాత్రమే కవి అని సంబోధించినట్టు. కాని టాగోర్ ని మనం కవి అంటున్నప్పుడు, అతడి సమకాలికులైన పాశ్చాత్య, ప్రాచ్యకవులు,యేట్సు, ఇలియట్, ఎజ్రా పౌండ్ లేదా మైథిలీ శరణ్ గుప్త, నజ్రుల్ ఇస్లాం,ఇక్బాల్, గురజాడల కన్నా ఆయన చాలా ప్రత్యేకమైన కవి అని గుర్తుపెట్టుకోవాలి.

నిజానికి సాంప్రదాయిక, ఆధునిక అర్థాల్లో మనం గుర్తించే కవి లాంటి వాడుకాదు టాగోర్ . తులసీదాస్, కంబర్, పెద్దన ల్లాంటి కవి కాదు అతడు. ఆయన ఒక వాగ్గేయకారుడు. నామదేవ్, కబీర్, అన్నమయ్య, త్యాగయ్య ల్లాగా ఒక సంకీర్తనాచార్యుడు, భక్తి కవి. ఆయన కవితలు రాసినకవి కాదు, పాటలు కట్టుకున్న గాయకుడు. ఆ పాటలో భావాలు ఎంత ముఖ్యమో, రాగమూ, లయ కూడా అంతే ముఖ్యం. ఆ మాటకొస్తే, భావలకన్నా, సంగీతమే ఎక్కువ ప్రధానం. కొత్త భావాల్ని చెప్పటం మీద ఆయనకు దృష్టి లేదు. 'ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి రెట్లు గొప్పది నవ కథాధృతిని మించి' అనే తూర్పుదేశాల ఆలంకార శాస్త్రం ఆయనది.

ఉదాహరణకి ఈ గీతం చూడండి:
మొహాబిశ్వే మొహాకాశే మొహాకాల్ మాఝే
ఆమి మానొబ్ ఎకాకి భ్రొమి బిస్మాయె, భ్రొమి బిస్మాయె
తుమి ఆఛో, బిస్వొనాథ్, ఒసీమ్ రొహొస్యొమాజే
నీరొబె ఎకాకి ఆపోన్ మొహిమానిలొయె.
ఒనొంతొ ఏ దేశ్ కాలే,ఒగొణ్యొ ఏ దీప్తొ లోకే
తుమి అఛోమొరే చాహి–అమి చాహి తొమా–పానె.
స్తొబ్ధొ షొర్బొ కొలాహొల్ శాంతిమొగ్నొ చొరాచొర్
ఎక్ తుమి, తొమా మాజే అమి ఎకా నిరొరొ.

ఇందులో కొత్త భావాలు, బుద్ధిని స్పందింపచేయగల అంతర్దృష్టి, మిరుమిట్లు గొలిపే రూపకాలంకారాలూ ఏవీ లేవు. కాని ఆకాశంలోని వైశాల్యం, సాయంసంధ్యలోని గాంభీర్యమంతా ఈ గీతంలో కనిపిస్తుంది. ఇక్కడ కవిత మరేదో భావాల్ని, సత్యాల్ని తీసుకొచ్చే ఒక వాహిక కాదు. దానికదే ఒక సంపూర్ణ, సమగ్ర అనుభవం. ఆ పాట వింటూనే మనం లోనుకాగల అనుభవమే ఆ కవిత సందేశం.

ఆయన ప్రధానంగా గీతకారుడు. సంగీతమయం కాని కవితతో ఆయన భగవంతుణ్ణి సమీపించడానికి ఇష్టపడలేదు.

‘పాడమని నీ ఆజ్ఞ అయినప్పుడు గర్వంతో నా గుండె పగులుతుందేమోననిపిస్తుంది..నా
బతుకులో కర్కశమైందీ, అపభ్రంశమైందీ
సంగీతమాధుర్యంలో కరిగిపోతుంది.నా పాటంటే నీకు ఆనందమని తెలుసు.
గాయకుడిగానే నీ సమక్షానికి నా ప్రవేశమని తెలుసు. ఎన్నటికి నేను నాకుగా అందు
కోలేని నీ పాదాల్ని నా గానపక్షాంచలంతో స్పృశించగలుగుతాను. గానోన్మత్తుడై నన్ను
మరిచి నా ప్రభువైన నిన్ను ‘నా సఖా ’ అని పిలుచుకుంటాను
(గీతాంజలి, 2 అను.చలం) అని అంటాడు.

ఇటువంటి గీతకారుడు టాగోర్ చైనా, జపాన్ యాత్రల తరువాత కొత్త ప్రక్రియలో కొన్ని కవితలు రాసాడు.

ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న ‘స్వేచ్ఛావిహంగాలు’ ఆ కొత్త ప్రక్రియలో వెలువడ్డ Stray Birds (1916) కి అనుసృజన.

> స్వరతంత్రుల్నీ, హృదయ తంత్రుల్నీ ఎక్కడ అదిమి పట్టుకోవాలో,ఎక్కడ విడిచిపెట్టాలో తెలియడమే కవిత్వకళ
>
> గోదావరీతీరంలో నన్నయనుండి ఇస్మాయిల్ దాకా ఈ పద్యవిద్య గురించే మాట్లాడుతూ వచ్చారు. ఇప్పుడు మరొకసారి టాగోర్ పేరిట బొల్లోజు బాబా మనకి గుర్తు చేస్తున్నదిదే.

నిజానికి ఈ ప్రక్రియ టాగోర్ చైనానుంచో, జపాన్ నుంచో నేర్చుకున్నది కాదు. ఈ తరహా కవిత్వానికి ఆయన తన తొలిరోజుల్లోనే శ్రీకారం చుట్టకపోలేదు. ‘కణిక’ అనే పేరిట ఇటువంటి కవితల్ని ఆయన 1899 లోనే వెలువరించాడు. కాని ఆ ప్రక్రియ ఆయన ప్రధాన ప్రక్రియగా మారలేదు. కాని అటువంటి తరహా కవిత్వం భారతీయ సాహిత్యంలో కొత్త కాదు, సంస్కృత ముక్తకాలు, హిందీ దోహాలు, పారశీక పద్యాల్లోని ద్విపదలు టాగోర్ కి తెలియనివి కావు.

కాని సంస్కృతం, పారశీకం, హిందీ,బెంగాలీలలో కనిపించే ముక్తకాల్లో భావంతో పాటు ఛందస్సూ, సంగీతమూ కూడా ప్రధాన పాత్ర వహిస్తాయి. అయితే ఈ కొత్త తరహా ప్రక్రియలో ఛందస్సుకీ, సంగీతానికీ ప్రాధాన్యత తక్కువ. ఇవి మనసులో తటిల్లున మెరిసే ఆలోచనల్ని తట్టినవి తట్టినట్టుగా మనతో పంచుకునే ప్రయత్నం.

వీటివెనక రెండు ప్రేరణలున్నాయని మనం భావించవచ్చు. ఒకటి, తన ‘లేఖన్’ (1926) సంపుటికి ముందుమాటలో టాగోర్ రాసుకున్నట్టుగా చీనాయాత్రనే.అక్కడ ఆయన్ను అభిమానులు పట్టువస్త్రాలమీదా, చిన్ని చిన్ని విసనకర్రలమీదా కవితలు రాయమని అడిగినప్పుడు తానా పంక్తులు రాసానని ఆయన చెప్పుకున్నాడు.

కాని ఆయన స్పష్టంగా చెప్పకపోయినా, రెండవ ముఖ్యమైన ప్రేరణ, ఆధునిక వచన కవిత. ఆయన సాంప్రదాయిక పద్యకవీ, లేదా ఆధునిక వచనకవీ కాదు. ఆయన గీతకర్త. సంగీతకర్త. కానీ, ఇరవయ్యవ శతాబ్ది ప్రారంభంలో ప్రపంచమంతా వరదలాగా ముంచెత్తుతున్న ఆధునిక వచన కవిత గురించి ఆయన విన్నాడు. తన గీతాలు అంతదాకా రససమ్మోహితంగా మాత్రమే కాక, నిర్దిష్ట రూపసౌష్టవంతో కూడా వికసిస్తున్నాయని ఆయనకి తెలుసు. తన గీతాల్లోని రూపశిల్పాన్ని పక్కన పెట్టి, తన భావాలతో అదే రసస్ఫూర్తి కలిగించగలడా?

ఆ ప్రశ్న ఆయన్ని 1916-26 మధ్యకాలంలో తీవ్రంగా వెన్నాడింది. ఆ తర్వాత ఆయన రాసిన కవిత్వమంతా ప్రధానంగా వచన కవిత్వమే. ఆ కొత్తధోరణి ఆయన 'బలాక ' (1916) నుంచే కనిపిస్తున్నదని బుద్ధదేవ్ బోస్ అంటాడు. 1922 లో ప్రచురించిన 'లిపిక' పూర్తి వచనకవితాసంపుటి కావడం కూడా గమనించాలి.

Stray Birds
వెనక హైకూ ప్రభావం ఉందని కృష్ణ కృపలానీ అభిప్రాయపడ్డాడు. 1916 లో రాసిన జపాన్ డైరీలో టాగోర్ హైకూ గురించి చాలా ఆసక్తికరమైన పరిశీలనలు పంచుకున్నాడు. (ఈ డైరీని తెలుగులోకి అనువదించిన రాయప్రోలు సుబ్బారావు, దురదృష్టవశాత్తూ ఆ భాగాల్ని అనువదించకుండా వదిలేసారు). ఇప్పటికీ ఇంగ్లీషులోకి అనువాదం కాని, ఆ రచనలో హైకూ మీద పరిశీలనల్ని అమృతసేన్ అనే ఆయన Rabindranath Tagor and Haiku
అనే తన వ్యాసం కోసం అనువదించాడు. అందులో టాగోర్, ఒక జాతిగా జపనీయుల విశిష్టత వారం తమలోని పరస్పర విరుద్ధమైన రెండు శక్తుల మధ్య సాధించుకున్న సమన్వయంలో ఉందని, రాసాడు.

ఒకవైపు తమని తాము అభివ్యక్తపరుచుకోవాలన్న ఉత్సాహం, మరొకవైపు తమ మీద తామం విధించుకునే సమన్వయం-దీన్నే ఆయన జపనీయుల ధీరత్వంగా పేర్కొన్నాడు. ఒక ప్రక్రియగా హైకూ ఈ ఆత్మనిగ్రహానికి అద్దం పడుతున్నదని టాగోర్ భావించాడు.

> '...వారి హృదయాలు ఉరకలెత్తే కొండవాగులాగా గలగల్లాడవు. లోతైన కాసారజలాల నిశ్శబ్దం వారిది. వారి కవిత్వం జీవితాన్ని గాఢంగా దృశ్యమానం చేస్తుంది. మానవ భావావేశాలమీద గొప్ప నియంత్రణ కనిపిస్తుందందులో. అలాగని వారి సౌందర్య సంవేదనలేమీ తక్కువ కాదు. వారి సౌందర్య దృష్టిలో ఎంత పారవశ్యం ఉందో,అభివ్యక్తిమీద అంత సంయమనం కూడా ఉంటుంది '
>
> అని రాసాడాయన తన జపాన్ డైరీలో.

ఇది టాగోర్‌లో కలిగిన కొత్త మెలకువ. అంతదాకా ఆయన రాసిన పాటల్లో ప్రవహించడం జలపాతంలాగా ఎగిసిపడటం, శ్రావణమేఘం లాగా వర్షించడం మాత్రమే ఉండేవి. అప్పట్లో ఆయన దృష్టిలో రూపం రసానికి వాహిక మాత్రమే. కాని రూపంతో ప్రయోగాలు చెయ్యవచ్చుననీ, రాగానికి తాళంలాగా, రూపం రసవిస్ఫోటనానికొక చౌకట్టు సమకూరుస్తుందని ఆయన గుర్తుపట్టాడు. ఈ నవీన జాగృతిలోంచి పుట్టుకొచ్చినవే Stray Birds (1916), Lekhan (1926), Fireflies (1928), Sphulimga (1946) సంపుటాలు.

అలాగని Stray Birds
లో కనవచ్చే కవితలు హైకూలు కావని మనకి అర్థమవుతుంది. అందుకు కారణం టాగోర్ హైకూ అనుకరించాలనుకోకపోవడమే. ఆయన అన్వేషిస్తున్నది అభివ్యక్తిమీద అదుపు కోసం. అంతదాకా గీతాలుగా వ్యక్తమవుతున్న తన కవితల రూపసౌష్టవాన్ని కాదని కొత్త రూపాన్ని అన్వేషించడం. అది కూడా వచనకవితారూపంలో.

నిజమే. Stray Birds
గీతాంజలిలాగా గొప్ప కవిత్వం కాకపోవచ్చు. అంతగా రసజ్ఞ హృదయాల్ని కదిలించకపోవచ్చు. కాని టాగోర్ కవిత్వం monotonous కాకుండా కాపాడిన ప్రక్రియ అది.

మరో విశేషం కూడా ఉంది. Stray Birds
ధోరణి వెనక టాగోర్ చీనా, జపాన్ యాత్ర ఉందని చెప్పాను కదా. వినడానికి ఆశ్చర్యంగా ఉంటుందిగానీ, టాగోర్ Stray Birds
ఆధునిక చీనా కవిత్వాన్ని ఒక మలుపు తిప్పిందని చీనా సాహిత్యవిమర్శకులు నేడు చెప్తున్నారు.
Stray Birds: Tagore and the genesis of modern chinese poetry
అనే వ్యాసంలో వోల్ప్ గాంగ్ కుబిన్ అనే చీనాసాహిత్యవేత్త ఈ విషయాన్ని ఎంతో విపులంగా చర్చించాడు. ముఖ్యంగా సమకాలిక చీనాకవుల్లో అగ్రగణ్యుడైన బీ–దావో మీద టాగోర్ ప్రభావముందని తెలియడం చాలా ఆశ్చర్యకరంగానూ, నాలాంటి టాగోర్ పిచ్చివాడికి గొప్ప ఊరటగానూ వినిపిస్తుంది
.

**3**

ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న 'స్వేచ్ఛావిహంగాలు' తెలుగులో ఇంతదాకా వచ్చిన టాగోర్ అనువాదాల్లో మహనీయమైన వాటి సరసన నిలవగలిగే సామర్థ్యాన్ని సంతరించుకుందని చెప్పగలను.

ఇందుకు, రెండు కారణాలు. ఒకటి నేను ముందే చెప్పినట్టు బొల్లోజు బాబా కవిత్వోపాసకుడైనందుకు. రెండవది, ఇప్పటి కాలానికీ, ఇప్పటి కవులకీ అవసరమైన ఒక విషయాన్ని గుర్తుచేసినందుకు.

ఇప్పటి కవులకి ధారాళమైన అభివ్యక్తి అయితే ఉందిగాని, ఎక్కడ నోరారా పలకాలో, ఎక్కడ నిగ్రహించుకోవాలో వారికి తెలియడం లేదు. కొన్ని తంత్రుల్ని మీటుతూనే, కొన్ని తంత్రుల్ని అదిమిపట్టినప్పుడే, వీణ సంగీతం పలికిస్తుంది. స్వరతంత్రుల్నీ, హృదయ తంత్రుల్నీ ఎక్కడ అదిమిపట్టుకోవాలో, ఎక్కడ విడిచిపెట్టాలో తెలియడమే కవిత్వకళ. గోదావరీతీరంలో నన్నయనుండి ఇస్మాయిల్ దాకా ఈ పద్యవిద్య గురించే మాట్లాడుతూ వచ్చారు. ఇప్పుడు మరొకసారి టాగోర్ పేరిట బొల్లోజు బాబా మనకి గుర్తు చేస్తున్నదిదే.

అనువాదకుడిగా ఆయన ఇందులో చూపిన ప్రజ్ఞకి ఎన్నో ఉదాహరణలివ్వవచ్చు. ముఖ్యంగా ఆ క్లుప్తతనూ, గాఢతనూ అంతే పదిలంగా తెలుగులోకి పొదివిపట్టి తెచ్చుకోగలిగాడు.

I cannot choose the best
The best chooses me
శ్రేష్ఠమైన దాన్ని నేనెన్నుకోలేను
శ్రేష్ఠమైనదే నన్ను ఎన్నుకుంటుంది.

The World has kissed my soul with its pain asking for its
return in songs.
ప్రపంచం తన వేదనతో
నా హృదయాన్ని ముద్దాడి
బదులుగా గీతాల్ని కోరింది. (167)

The World does not leak because death is not a crack.
మృత్యువు ఒక పగులు కాదు
అందుకే ప్రపంచం కారిపోదు. (222)

Life has become richer by the love that has been lost.
పోగొట్టుకున్న ప్రేమలతో జీవితం
మరింత సుసంపన్నమయింది. (223)

The same lotus of our clime blooms here in the alien water
with the same sweetness, under another name.
అపరిచిత జలాలలో కూడా
మన ప్రాంతపు కలువ అంతే అందంగా
వికసిస్తోంది, మరో పేరుతో. (232)

ఇట్లా చాలా ఎత్తిచూపవచ్చు.

ఏ భాషలో నైనా అనువాదం అనుసృజన. ఒక భాషలోని పదానికి, చాలాసార్లు మనకి స్ఫురించేపదం సమానార్థకంగా ఉండదు. అంతకన్నా ఒకింత తక్కువగానో, లేదా ఒకింత ఎక్కువగా నో ఉంటుంది. చాలా సార్లు ఆ స్ఫురించే మాట మన చేతుల్లో ఉండేదీ కాదు. అదొక సద్య:స్ఫురణ. అందుకనే తన కవిత అల్లుతూ కవి ఎంత సంభ్రమానికి లోనవుతాడో అనువాదకుడూ అంతే ఆశ్చర్యానికి లోనవుతాడు.

ఈ వాక్యం చూడండి:
రాత్రి చీకటి తిత్తి
సువర్ణోదయంగా పగిలింది. (213)
ఇది చదివినప్పుడు కలిగే స్పందన దీని ఇంగ్లీషు మూలం చదివినప్పుడు కలగదని చెప్పగలను.

Nights darkness is a bag that bursts with the gold of the dawn.

ఇంత చక్కనికానుక మనకి అందించినందుకు అందరికన్నా ముందు బొల్లోజు బాబానే ఎక్కువ ఆనందించి ఉండవచ్చు. ఆ తర్వాత నేను. ఇప్పుడు మీరంతా కూడా.

హైదరాబాదు **వాడ్రేవు చినవీరభద్రుడు**
3 మే 2016

# అల్పాక్షరాల్లో అనల్పార్థ రచన

డా|| జోశ్యుల కృష్ణబాబు

కొందర్ని కవిగా ఇష్టపడతాం. కాని వ్యక్తిగా అంత ఇష్టపడలేం. మరికొందర్ని వ్యక్తిగా చాలా ఇష్టపడతాం. కాని కవిగా అంగీకరించలేం. అయితే బొల్లోజు బాబా ఎంత మంచి కవో అంత మంచి మనిషి. ఆయనలో కవిత్వం-వ్యక్తిత్వం రెండూ పోటీపడతాయి. ముఖ్యంగా నేడు కొందరు కవుల్లో కనిపించే, ఇగో, అహం లాంటివి ఆయనలో ఎప్పుడూ, ఎక్కడా కనిపించవు. అందుకే ఆయన్ని అందరూ ఇష్టపడతారు. ఆయన కవిగా మరింత ఎత్తుకు ఎదగగల్గుతున్నారు. కాకినాడ సాహితీ స్రవంతికి కార్యదర్శి అయిన బాబా మంచి వక్త. ప్రతి సభకు శ్రద్ధగా హాజరయ్యే మంచి శ్రోత కూడ.

బాబాకి మంచి సాహిత్య వారసత్వం ఉంది. వారి తండ్రి బసవలింగం గారు మాస్టారు. అయితే ఉత్తి మాష్టారు కాదు. ఆయనకు తెలుగుతోపాటు, సంస్కృతం, ఆంగ్లం, ఫ్రెంచి, భాషా సాహిత్యాలలో మంచి అభినివేశం ఉంది. సువర్ణశ్రీ పేరుతో ఆయన రచనలు చేసారు. "నేటి విద్యార్థి" అనే ప్రబోధాత్మకమైన నాటకం రాసారు. విద్యార్థి నాయకునిగా ఫ్రెంచి పాలన నుండి యానాం విమోచనోద్యమంలో చురుకైన పాత్ర పోషించారు.

అదిగో! అటువంటి సాహిత్య సాంస్కృతిక వారసత్వం నుండి కవిగా ఎదిగిన వ్యక్తి బొల్లోజుబాబా. బాబా ఇంత వరకు నాల్గు గ్రంధాల్ని ప్రచురించారు. 1991లో ఆదివారం ఆంధ్రజ్యోతిలో 'ఈవారం కవిత' ద్వారా వీరు సాహితీ లోకానికి పరిచయమయ్యారు. 2009లో 'ఆకుపచ్చని తడిగీతం' అనేది వీరి తొలికవితా సంకలనం. ఈ గ్రంథాన్ని వీరు తన జీవనసహచరి శ్రీమతి సూర్యపద్మ గార్కి అంకితమిస్తూ, అలా ఎందుకిస్తున్నారో టాగూర్ రాసిన, స్ట్రే బర్డ్స్ లోని ఒక చిన్న కవితను ఉదహరిస్తారు.

'మగువా!/ నా ప్రపంచాన్ని నీ సొగసరి
అంగుళులతో స్పృశించావు. అంతే..!
ప్రశాంతత సంగీతమై పల్లవించింది'.

అందుకే నా ఈ తొలి భావధార, నీకే అంకితం అంటూ అంకితం ఇచ్చారు. ఇందులో మొత్తం 58 కవితలుంటాయి. అన్నీ హృదయపు లోతుల్లోకి చొచ్చుకుపోయి గిలిగింతలు పెట్టేవే. అక్కడక్కడ అధ్యాపకునిగా పిల్లలతో ఉన్న అటాచ్ మెంట్ కూడా కవిత్వీకరించటం కనిపిస్తుంది.

సెలవుల్లో కళాశాల కళావిహీనంగా ఎలా ఉంటుందో చక్కని ప్రతీకలతో చెపుతారు, "సార్ గారండీ... సార్ గారండీ" అనే కవితలో బాబా. ఒక అధ్యాపకుడు పిల్లల్ని తీర్చిదిద్దే పనిని కవిత్వీకరిస్తూ

"పరస్పరవైరుధ్యాల అరణ్యంలో
వాడు దారితప్పి కునారిల్లినపుడు
నా అనుభవాల్ని దిక్సూచిగా చేసి బహూకరిస్తాను
ఒక తరం తన నడతను ప్రసవించుకొనే వేళ
నేను మంత్రసానినౌతాను".

అనటంలో అధ్యాపకునిగా కేవలం పాఠాలు చెప్పటమే, తనపనికాదని, వారి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దాల్సిన బాధ్యత కూడా తనకుందని ఈ కవితలో వ్యక్తంచేస్తారు. ఇలా మొత్తం కవితలన్నీ ఎంతో హాయిగా మనసుని స్పృశిస్తూ, మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తాయి.

ఇక ఆయన 2007లో 'ఫ్రెంచ్ పాలనలో యానాం" అన్న పుస్తకం రాసారు. బాబాకు తన ఊరిపట్ల ఉన్న ప్రేమ, ఆ ఊరి చరిత్రపట్ల ఉన్న జిజ్ఞాస, ఈ గ్రంధ రచనకు ప్రేరణగా కనిపిస్తాయి. తండ్రి గారి ప్రోత్సాహం కూడా ఒక కారణం. బాబా తనకు అందుబాటులో ఉన్న వాఙ్మయ, లిఖిత ఆధారాలతో అనేక చారిత్ర ఘట్టాలను, విశేషాలను వివరిస్తూ ఇది రాసారు.

ఇక 2016 జూన్లో ఒకేసారి వీరు 'వెలుతురు తెర' 'స్వేచ్ఛా విహంగాలు' అనే రెండు పుస్తకాల్ని హైదరాబాద్లో కె.శివారెడ్డి గారి చేతుల మీదుగా ఆవిష్కరించారు. ఇందులో వెలుతురు తెర '59' కవితల సమాహారం.

ఇందులో కూడా ఒక అధ్యాపకునిగా తన జీవితంలో విద్యార్ధులతో ఏర్పడిన అనుబంధం, వారి జీవితాల్లో ఎదురయ్యే సమస్యలు, ప్రశ్నపత్రాల మూల్యాంకన సమయంలో కలిగే ఫీలింగ్స్ఇలా చాలా అంశాల్ని పట్టుకొని బాబా అక్షర చిత్రాల్ని ఆవిష్కరించారు. 'మూల్యాంకనం' అనే కవితలో..

"జవాబు పత్రాన్ని పట్టుకోగానే
ఓ ఏడాది కాలాన్ని
చేతిలోకి తీసుకొన్నట్లుంటుంది
ఏదో అపరిచిత జీవితాన్ని
తడుముతున్నట్లనిపిస్తుంది"

అంటారు. అంతేకాదు "పేపర్లు దిద్దటం అంటే ఒక్కోసారి, పత్రికల్లో ఆత్మహత్యగానో, అత్యుత్తమ ర్యాంక్ గానో, పతాక శీర్షిక కావటంకూడా" అంటారు. ఈ కవిత చదువుతుంటే ఒక అధ్యాపకుడు మూల్యాంకనంలో ఎంత జాగ్రత్త వహించాలో కూడా అర్థమవుతుంది.

అలాగే అవసరమున్నా లేకపోయినా విచ్చలవిడిగా స్త్రీలకు జరుగుతున్న హిస్టోరెక్టొమి ఆపరేషన్లను నిరసిస్తూ

"నాగరీకుని/ వైద్యప్రయోగశాలలో
స్త్రీ దేహమెపుడూ ఓ గినియాపిగ్గే!
కారణాలేవైనా కానీ
రెండు కోతల్ని భరించి
ఒక తరాన్ని సృష్టించిన
మానవజాతి మొదటి ఊయల
మూడోకోతలో మొదలు తెగి నేలకూలింది" అంటారు.

"గర్భసంచిని" మానవజాతి మొదటి ఊయలగా భావించటం గొప్ప భావన. అలాగే ఒక్కోసారి కవితకు ప్రారంభ వాక్యాలు పేజీలు తిప్పుకొంటూ పోయే పాఠకుణ్ణి అక్కడే ఆపేస్తాయి.

"ఎందుకో తెలీటంలేదు కాని
ఆ వీధిలోంచి వెళ్ళాలనిపించటంలేదు"

అన్న కవిత అలాంటిదే. ఆ కవితను చదవకుండా ముందుకు వెళ్ళలేం. ఒక విద్యార్థి ఆవేదన, యాక్సిడెంట్లో నుజ్జయి గుడిసె ప్రక్కనే పడివున్న వాడి ఆటో, ఆ ప్రక్కనే ఉన్న డొక్కురిక్షా ఇలా కవి, ఈ కవితలో ఒక చిన్న కథనే చెప్పారనిపిస్తుంది.

అలాగే ఆ తరంవారి బాల్యపు జ్ఞాపకాల్లో రేడియో ఒకటి. అందుకే అంటారు బాబా,

"నా బాల్యాన్ని ఆక్రమించిన
ఆ పాత రేడియో అంటే నాకెంతో ఇష్టం
రోజుకోసారి దాన్ని తాకనిదే
ఆరోజు గడిచినట్లుండదు
అయినా బాల్యానికి పాతేమిటి? కొత్తమేటి?" అంటారు.

ఇక్కడొక విషయం ప్రస్తావించాల్సి ఉంది. తెలుగు కవితకు ఇస్మాయిల్ గారు వేసిన బాట ఒక విలక్షణమైనది. అభ్యుదయ కవిత్వోద్యమం వచ్చిన దగ్గర నుంచి కవిత్వానికి పీడన, అణగారిన బ్రతుకులు, వేదనలు, సమస్యలే కవితావస్తువులు అవుతూ వచ్చాయి. జీవితమూ, ప్రపంచమూ ఎంత దుర్భరంగా ఉన్నాయో ఎలుగెత్తి చెప్పడమే పనిగా ప్రధాన స్రవంతి కవిత్వం సాగిపోయింది.

అయితే ఎంతసేపూ ఈ సమస్యలు బాధలేతప్ప జీవితంలో మరేవీ లేవా? అని చాలా కొద్ది మంది కవులు మాత్రమే ఆలోచించారు. జీవితంలో ఆనందం కూడా ఉంది. దాన్ని పట్టించుకోవద్దా? జీవితం పట్ల ఇష్టాన్ని పెంచొద్దా? ఆ పనికే ఇస్మాయిల్ పూనుకొన్నారు. ఎవ్వరూ చెప్పని రీతిలో 'జీవిత మహోత్సవంలోని అద్భుతాన్ని ఆవిష్కరించటమే కవిత్వం పని' అంటారు ఇస్మాయిల్.

ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే ఇలాంటి అనుభూతివాదమే, బాబాగారిలో కనిపిస్తుంది. వెలుతురు తెరలోని స్నేహంచెట్టు, పక్షి ప్రేమికులు, అదే గులాబీ, రెండు చింతలు, మూల్యాంకనం, ఒక హిస్టరెక్టామీ, ఊడుపు-వంటి కవితలన్నీ చాలా వరకు అనుభూతి, ఆనందం ప్రధానంగా సాగిపోతాయి. అందుకే ఇస్మాయిల్ సాహిత్య పురస్కారానికి బాబాను ఎంపిక చేయటం జరిగిందని నా కనిపిస్తోంది.

ఇక రవీంద్రుని స్ట్రేబర్డ్స్ కు స్వేచ్ఛావిహంగాల పేరుతో బాబా చేసిన అనువాదం తెలుగులో ఇంతదాకా వచ్చిన టాగోర్‌అను వాదాల్లో గొప్పవాటి సరసన తప్పకుండా చేరితీరుతుందని చెప్పాలి. అనువాదకవి మూలకవి భావాన్ని ఒడిసిపట్టుకొని తనదైన వాక్సరళిలోకి లాక్కోవాలి. మూలానికి సమాంతరంగా ఉండాలి. పేలవంగా ఉండకూడదు. బిగి సడల కూడదు. ఉదాహరణకు-

I cannot choose the bese, the best chooses me అన్నదానికి "శ్రేష్ఠమైనదాన్ని నేనెన్నుకోలేదు. శ్రేష్ఠమైనదే నన్ను ఎన్నుకొంటుంది" అన్నదాన్ని చూపొచ్చు. కొన్నిచోట్ల మూలాన్ని అధిగమించి అల్పాక్షరాల్లో అనల్పార్థ రచన సాధిస్తారు బాబా. ఈ క్రింది కవిత చూస్తే అర్ధమవుతుంది.

"రాత్రి చీకటి తిత్తి/ సువర్ణోదయంగా పగిలింది" అనే బాబా అనువాదాన్ని చదివేటప్పుడు కలిగే స్పందన Nights darkness is a bag that bursts/ with the gold of the dawn అన్న మూలవాక్యాలు చదువుతోంటే కలగదంటారు ముందుమాటలో వాడ్రేవు చినవీరభద్రుడు.

ఒక విధంగా చెప్పాలంటే ఈ కవిత్వం చైనీస్ మోడర్న్ పొయిట్రీని తలపిస్తుంది అంటారు సత్య శ్రీనివాస్. అలాగే "గొప్ప వినయాన్ని కలిగి ఉన్నప్పుడు శ్రేష్ఠత్వానికి దగ్గరైనట్లే' అన్న ఇందులోని రవీంద్రుని వాక్యాలు బాబాకే అన్వయిస్తానిపిస్తుంది.

ఇంకా ఎడారి అత్తరుల పేరుతో ప్రముఖ సూఫీ కవుల గీతాలకు అనువాదాలు, ఇరవై ప్రేమకవితలు- ఒక విషాదగీతం, గాధా సప్తశతి - కొన్ని అనువాదాలు, వివిధ పుస్తకాల పరిచయ వ్యాసాలు, వీటితోపాటు కవిత్వంలో, అలంకారాలు, ప్రతీకలు ఎలా ఉండాలో చెప్పే వ్యాసాలు, ఇవన్నీ ఇ-బుక్స్ రూపంలో వెలువరించారు.

ఇప్పటికే వీరి "ఆకుపచ్చని తడిగీతం" పుస్తకానికి "శిలపరశెట్టి సాహితీ ప్రత్యేక పురస్కారం", "కళాలయ సాంస్కృతిక సంస్థ, పాలకొల్లు వారి సాహితీ పురస్కారం" లభించాయి. కాకినాడలో 2017, డిశెంబర్10న ఇస్మాయిల్ మిత్రమండలి బాబాకి ఇస్మాయిల్ కవితా పురస్కారాన్ని ఇవ్వటం సర్వదా, సర్వధా అభినందనీయం. ఆ పురస్కారానికి కూడ ఒక గౌరవం సంతరించుకొన్నట్లయింది.

భవిష్యత్తులో మిత్రులు బాబా మరిన్ని విలువైన గొప్ప రచనలు చేయాలని, ఇంకా ఎన్నెన్నో పురస్కారాలు అందుకోవాలని కోరుతూ వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

(ఇది ప్రస్థానం ఆగస్టు 2018 సంచికలో ప్రచురింపబడినది.

డా|| జోశ్యుల కృష్ణబాబు

# మునివేళ్ళ మీది పుప్పొడి!

జి. సత్య శ్రీనివాస్

విశ్వకవి ‘ stray birds ’ ,బోల్లోజు బాబా ‘స్వేచ్చా విహంగాలు’ అనువాదం చదువుతునప్పుడు నా అరచేతి ఆకాశం నుండి ఎగిరే గాలి పక్షులు రెక్కల తివాచీపై పయనించేట్టు చేసింది. అందుకే, ముందుగా బొల్లోజు బాబా ముని వేళ్ళని ముద్దాడాలనిపిస్తుంది. సరిగ్గా వందేళ్ళ మునుపు అచ్చయిన స్ట్రె బర్డ్స్ ద్వారా కవిత్వంలో మరో కొత్త ఒరవడిని విశ్వ కవి సృష్టించారు. చైనీస్ ఆధునిక కవిత్వానికి, చైనీస్ వెదురు వేణువు లోనుండి వీచే గాలికి విశ్వకవి కొత్త రుతువుగాలి కల్పించారు అని చైనీస్ సాహిత్య కారులే అన్నారు. అటువంటి కవితలలోని భావాన్ని పాల్లుపోకుండా ,చక్కని నైపుణ్యం తో అనువదించారు బొల్లోజు బాబా .

విశ్వకవి ‘ stray birds ’, బోల్లోజు బాబా ‘స్వేచ్చా విహంగాలు’ అనువాదం చదువుతునప్పుడు నా అరచేతి ఆకాశం నుండి ఎగిరే గాలి పక్షులు రెక్కల తివాచీపై పయనించేట్టు చేసింది.
అందుకే, ముందుగా బొల్లోజు బాబా ముని వేళ్ళని ముద్దాడాలనిపిస్తుంది.

అనువాదం ఒక నెరేటివ్ రీసర్చ్, ఒక వైవిధ్యమైన ప్రక్రియ. అది భాషా నైపుణ్య పరిధులు దాటే ఏరు. ఎందుకంటే అది కవిని, అనువాదకుడ్ని, పాఠకుడ్ని, బాషకల్లుకున్న సాంస్కృతిక మూలాల్లోకి తీసుకువెళుతుంది. అందరూ కలిసి నది ఒడ్డున చేసే ప్రయాణాన్ని బొల్లోజు బాబా గారు ఏర్పచ గలిగారు. మన అడగుజాడల గుర్తులు ఇసుక మబ్బు గూళ్ళలోని నీటి చుక్కలా మిగిలి వుంటాయి.

దేశ దిమ్మరి పిల్ల మూకల్లారా
మీ పాద ముద్రలను నా పదాలపై విడువండి.

అనువాదంలో ఒక ఈజ్ తో బాటు అల్లుకుపోయిన Colloquialness, నేటివిటీ వుంది. దానితో బాటు అనువాదానికి కావాల్సిన స్వేచ్చ మంత్రం ధ్వనిస్తుంది. అది ఈ కవితలో స్పష్టంగా కనబడుతుంది

వసంతపు దరహాసాలను కావలి కాసేది
మట్టి అశ్రువులే

ఈ స్వేచ్ఛకు రహస్యం తెగింపు కూడా అవసరమని చెబుతోంది. అనువాదంలో వుండే కీలకమైన ఇబ్బంది వేరు వేరు బాషల మధ్య వుండే వ్యాకరణ రూపంలోని వైవిధ్యం.

కొన్ని పోలి వుంటాయి, మరి కొన్ని భిన్న ధృవాలుగా వుంటాయి. అందుకే అనువాదానికి ప్రేమపూరితమైన బాధ్యతతో నిండిన స్వేచ్ఛవుండాలి. రవీంద్రుడు కాక మరొకరు స్ట్రే బర్డ్స్ ని ఆంగ్లంలోకి అనువాదం చేసి వుంటే అది మరోలా వుండేది.కారణం భారతీయ ఆంగ్లం లో స్థానిక పోపు సామాగ్రిని మిళితం చేయడం చాల అవసరం. ఆయన అనువాదం తన గూటి పక్షుల్ని, గగనం లోని మరో మార్గంలో లోకి తనే ఎగరేసాడు. బాబా కి ఆ మార్గాన్ని పట్టుకునే స్వచ్ఛమైన, స్వేచ్ఛమైన చూపుంది.

What you are you do not see, what you
see is your shadow.

నీవేమిటనేది నువ్వు దర్శించలేవు
నీవు దర్శించేది నీ ఛాయ

అనువాదం కూడా ఇంతే. అనువాదం ద్వారా కవి మనో భావ బాషని అనువాదకుడు ఇది అనువాదం అని నొక్కివక్కాణించకుండా చెపుతూనే ,మూలాన్ని, తన – మన అన్న బేధం లేకుండా ఆస్వాదించేలా చేయాలి. అప్పుడే మూల బీజంలో మొలకెత్తే గుణం పొదిగివుంటుంది, అది పరివ్యాపిస్తుంది. సహజంగానే మూలం లోని తాత్విక సంచారి నైజం అనువదంలోనూ వచ్చింది. బీజం లోని మొలకెత్తే గుణం పోలేదు. కారణం విశ్వకవే బెంగాలీనుండి ఆంగ్లంలోకి అనువదించుకున్న మూల ఆనువాదకుడు, అది ఇంకెన్ని బాషల్లో అనువాదమైనా పరివ్యాప్తి చెదే గుణం పోదు. 'స్వేచ్ఛా విహంగాలు' తో ప్రయాణం అంటే , ఈస్ట్ కోస్ట్ లో హౌరాకి వెళ్ళినట్టు.

మన బాషనుండి, ఆంగ్లం లోకి అనువాదం మళ్ళీ వేరే ప్రాంత బాషలోకి అనువాదం అంటే. తెలియందేముంది మన ప్రాంతంలో మాట్లాడే ఆంగ్లానికి కూడా మన రంగు, రుచి, సువాసన వుంటాయి. వందేళ్ళ చరిత్ర గల ఈ పుస్తకానికి మనం నివాళిగా మన కవితల్ని మనమే ఆంగ్లంలో అనువదించి మనమే నేటి గ్లోబల్ విలేజ్లో మనమే నాటుదాం అని, నేటి తరానికిచ్చే పచ్చటి స్ఫూర్తి. పుస్తకం మొత్తం చెప్పేదిఇదే తత్త్వం.

విహంగం తానొక మేఘాన్నైతే
బాగుణ్ణనుకొంటుంది
మేఘం

తానొక విహంగాన్నెందుకు కాలేదా అనుకొంటుంది.

మన భావవ్యక్తీకరణ, దాని రూపం మన జనపదాల్నుండి వచ్చిన ఆస్తి, దీన్ని ముందు తరానికి అందించడం అంటే, బాషల కుటుంబ చెట్టు సంరక్షణే. అది జరగాలంటే దీనిని విధ్వంసం చేసే అనువదీకరణకు అడ్డుకట్ట వేయాలి. అందుకు కవిత్మాకంగా అలోచించడడం కంటే గొప్ప ఆయుధం లేదు. అనువాదం అన్నది మూల రూపాన్ని మళ్ళీ నాటే సృజనాత్మక ప్రక్రియ. పలు చోట్లున్న పాఠకులని, కవికి అందించి ,పాఠకులకి కొత్త చిగుర్లని చూపించే దృష్టి. రాతలు కొనసాగాలి వాగుల్లా, వంకల్లా…

చిన్నారి గడ్డిపోచా
నీ పాదం చిన్నదే కావచ్చు కాని
పుడమి మొత్తం నీ అడుగుల కిందే వుంది.

'స్వేచ్ఛా విహంగం" గా వెళుతునప్పుడు అక్కడక్కడా కాలిబాటలో అరికాలిలో చిన్ని రాళ్ళు గుచ్చుకుని మనం ఎక్కడున్నాం అని గుర్తుచేసినట్టు చిన్న ఇక్కట్లున్నాయి. అవి మూల స్పర్శ, పరిమళాన్ని వదిలేసిన జాడలు. ఇది అనువాదంలో, లీనమైపోవడం వల్ల ఏర్పడే పొరపాట్లు తప్ప తెలిసి చేసినవి కాదు. ఎందుకంటే , ప్రతి పదానికి నిఘంటువులో మనకి కావాల్సిన అర్ధం దొరకదు,ముఖ్యంగా కవిత్వానికి.

Night's darkness is a bag that bursts
with the gold of the dawn.

రాత్రి చీకటి తిత్తి
సువర్ణోదయం లా పగిలింది

పగిలింది అనే పదానికి బదులుగా విచ్చుకుంది అంటే బాగుంటుంది. కారణం అనువాదం ఒక శీర్షాసన ముద్ర, కొన్ని జాగ్రత్తలు అవసరం ,వాట్ని విస్మరించలేం, న్యూయాన్సెస్ ని పట్టుకోవాలి.

That which ends in exhaustion is death,
but the perfect ending is in the endless.

అలసటలో ముగిసేది మృత్యువు మాత్రమే,
సంపూర్ణ ముగింపు అనంతంలోనే వుంది.

అనువాదం ఫర్ఫెక్షన్ కాదు, పసి పిల్లల అడుగుల సవ్వడి, అవి తడబడే అడుగులు కావు, ఇరువురి చూపులకి నడకలు నేర్పే లయలు. 'స్ట్రే బర్డ్స్' నాకై నేను ,ప్రపంచానికి 'కవిత్వ' మాధ్యమం లో ఆలాపించే ప్రవచనా గీతం. ఆ గీతాన్ని 'స్వేచ్ఛా విహంగాలు' గా చదువుతునప్పుడు సీతాకోకచిలుక ని పట్టుకుని వదిలేసిన తర్వాత దాని పుప్పిడి మునివేళ్ళకి సింధూర తిలకంలా అద్దుకుంటుంది. అందుకే బాబా మునివేళ్ళని మరోసారి ముద్దాడుతూ…

జి. సత్య శ్రీనివాస్

JULY 20, 2016

# గుప్పెళ్ళతో వెదజల్లిన కవితా పరిమళం బొల్లోజు కవిత్వం

కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి

సృజనాత్మ కళల్లో నూతన సృష్టికి మొదటివరుసలో నిలబడేది కవిత్వం. వర్తమాన జీవనశైలి మారుతున్నట్లే కవిత్వమూ మారుతుంటూంది. కవిత్వాన్ని పాఠకలోకం మెచ్చుకోవాలంటే హక్కున చేర్చుకోవాలంటే నిత్యనూతన భావాల సృష్టి జరగాలి. నూతన భావాలు వ్యక్తీకరించాలంటే కొత్త పదబంధాల్ని సృష్టించుకోవాల్సివుంటుంది. కవిత్వాన్ని కేవలం పదజాల కూర్పు అనుకోవడం పొరపాటు. ఆ అక్షరాల్లో వైవిధ్యభరితమైన అనుభూతి ఉంటుంది. ఆచరణాత్మకమైన జ్ఞాన సంపద ఉంటుంది. కాలంతో కలసి నడిచి సమాజిక చీకటి కోణాలను వెలికి తెచ్చే ఓ ప్రజ్ఞ ఉంటుంది.

సాంద్రతరమైన వాక్యాలు, తీవ్రతతో ఆంతరంగిక పరిపక్వతతో వెలువరించే కవుల్లో బొల్లోజు బాబా మొదటివరుసలో ఒకరుగా ఉంటారు. వీరి కవిత్వంలో కొత్త ధ్వని వినిపిస్తూంటూంది. సార్వజనీనానుభవం కనిపిస్తూంటుంది.

నేడు కవుల సంఖ్య పెరిగినంతగా కవిత్వం లోతులు పెరగడం లేదు. పాత పడికట్టు పదాలతో, శిల్పం కింద మీద చేస్తు వస్తుమార్పిడిగా భ్రమింపచేస్తూ రాయడం పరిపాటై పోయింది. అసలు కవిత్వం ఇది కాదు అని తెలుసుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. ఏదో ఒక కొత్త దారి అనంతాన్వేషణ దిశగా వెతుకులాట మొదలెడితే, ఒక వెలుగు కిరణం దృశ్యంగానో, అదృశ్యం గానో కొత్త రూపాన్ని వ్యక్తపరుస్తూ, కొత్తలోకాన్ని స్పృశిస్తూ కొత్తదారిన నడిచినట్లు, వస్తువును సంభావించడం భాషను ఓన్ చేసుకోవడం ఒక లాఘవం ప్రదర్శించాలి కవులంతా. సాంద్రతరమైన వాక్యాలు, తీవ్రతతో ఆంతరంగిక పరిపక్వతతో వెలువరించే కవుల్లో బొల్లోజు బాబా మొదటివరుసలో ఒకరుగా ఉంటారు. వీరి కవిత్వంలో కొత్త ధ్వని వినిపిస్తూంటూంది. సార్వజనీనానుభవం కనిపిస్తూంటుంది. అలతి అలతి పదాలే ఆయుధాల్లా మొనదేలి పాఠక హృదయాన్ని తాకుతుంటాయి. పువ్వుల్లా విప్పారుతుంటాయి. ఎంతో పరిమళాన్ని వెదజల్లుతుంటాయి.

'నీటి పొర' అనే కవితలో మద్యపానం మంచిది కాదు అని చెప్పే విధానం గమనించండి. మొదటి లైన్స్ లో తాగుబోతులతో చేతులు కలిపినట్లే ఉంటాడు తరువాత పేరాల్లో తాగుడు వలన కలిగిన నష్టాన్ని ఎంత నైపుణ్యంగా చెప్తాడో చూడండి

తాగుడుపై సదభిప్రాయం లేకపోయినా
దురభిప్రాయం మాత్రం ఉండేది కాదు

అదో పురాతన విలాసం కదాని

అనడంలో పూర్వుల దగ్గరనుంచి మనం చేస్తున్న పని అదే గదా అన్నట్లు ధ్వనిస్తుంది. తరువాత అంటారు...

కానీ.../
మొనోరోజు మా కాలేజీలో
ఓ విద్యార్థిని తండ్రి తన కూతుర్ని
నలుగురెదుటా బూతులు తిడుతూ
అవమానించినపుడు
ఆమె కనుల నీటి పొరలో
తాగుబోతు తండ్రులందరూ
దగ్ధమైపోవాలనుకొన్నాను//
కువాయిట్ అమ్మ నా పేర్న పంపించే
డబ్బుల కోసమే ఇదంతా
అని ఆ అమ్మాయి అన్నప్పుడు
ఆ నీటి పొరలో
ఈ మద్యప్రపంచం
కొట్టుకుపోవాలనుకొన్నాను

ఇక్కడ తండ్రి తాగుడుకు బానిసైనా, తల్లి బిడ్డల మీద ప్రేమతో ఇతరదేశం పోయి, కూలిపని చేసి బిడ్డ చదువుకు డబ్బు పంపుతుండు. ఆ డబ్బుకోసం తండ్రి బిడ్డను బాధిస్తున్నాడు అనే కథ నాలుగు లైన్స్ లో చెప్పాడు కవి. ఇట్లా బొల్లోజు బాబా పద కాఠిన్యం లేకుండా భావ సాంద్రతను పెంచే దిశగా కవిత్వాన్ని చెప్పడం హర్షింపదగిన విషయంగా భావిస్తాను.

నేడు కవిత్వం రూపు ఏ విధంగా మారిపోయిందో చూడండి. వాచ్యంగా ఒక్క పదమూ లేదు.

ఏమీ గుర్తులేవిపుడు
జేబుడు సూర్యకిరణాలు
గుప్పెడు చందమామ
ముక్కలు తప్ప
దుఃఖాశ్రువులు నిండిన

సాయింత్రాన్ని
రాత్రి రెప్పల క్రింద
నిదురపుచ్చి అన్నీ
మరచిపోదామనుకొంటాను
కానీ
కొన్ని పదాలు నానుండి రాలిపడి
ఓ ఎడారిని సృష్టిస్తాయి
ఆ ఎడారిలోంచి ఓ అరణ్యం
ఆ అరణ్యంలోంచి కుంభవృష్టి
ఒక్కొక్కటిగా విచ్చుకొని
నన్ను కబళిస్తాయి

అట్లా సాగిపోతుంది కవిత. కవిత్వం రాయలేకుండా ఉండలేని తనాన్ని, కవిత్వం ఆనందం దుఃఖమయమనే భావాన్ని నిగూఢంగా చెప్పాడు కవి.

'వస్తావా' అనే కవిత చూడండి

చీకటి దుప్పట్లో దూరి
దేహ దీపాల్ని
వెలిగించుకొందాం
రాత్రి హార్మోనియంపై
మోహ పరిమళాల రాగాల్ని పలికిద్దాం
శీతవేళకు చిక్కకుండా
వేడి శ్వాసల్ని కప్పుకుందాం
ఒక సమాంతర కాలంలోకి
అనంతంగా ప్రవహిద్దాం వస్తావా! ..... అంటారు

చీకట్లో వెలుగులు నింపుకోవడం, నిశిలో మోహపరిమళాల రాగాల్ని పలికించుకోవడం, మనిషి కోల్డ్ హార్టెడ్ కాకుండా వేడి శ్వాసల్ని కప్పుకోవడం అభివ్యక్తిపరంగా ఎంతో నూతనత్వాన్ని సాధించాడు కవి బొల్లోజు బాబా.

బొల్లోజు బాబా యానంలో బొల్లోజు బసవలింగం, అమ్మాజి దంపతులకు జన్మించారు. ఈయన ఎం.ఎస్సి, బియిడి, ఎంఫిల్ చేసి జువాలజి అధ్యాపకునిగా పని చేస్తున్నారు. ఈయన సహచరి సూర్యపద్మ.

వీరి రచనలు: 1. యానాం విమోచనోద్యమం, 2. ఆకుపచ్చని తడిగీతం 3.ఫ్రెంచిపాలనలో యానం 4. స్వేచ్ఛా విహంగాలు 5. వెలుతురు తెర. వీరి ఇ బుక్స్. 1. ఎడారి అత్తరులు 2. ఇరవై ప్రేమ కవితలు- ఒక విషాద గీతం 3.గాథా సప్తశతి కొన్ని అనువాదాలు. 4. వివిధ పుస్తకాల పరిచయ వ్యాసాలు. వీరు పొందిన అవార్డులు 1. శిలపరశెట్టి సాహితీ ప్రత్యేక పురస్కారం 2. కళాలయ సాంస్కృతిక సంస్థ పాలకొల్లు వారి సాహితీ పురస్కారం 2012

సాహిత్యం కాలానుగుణ్యంగా మరుతుండాలి. భాషా పటిమ కంటే భావ పటిమ జాస్తిగా ఉండాలి. పాఠకుణ్ణి కఠిన పదాలతో కన్ ఫ్యూజ్ చేయకూడదు. బాబా కలం నుండి మరెంతో సాహిత్యం వెలువడాలని ఆశిస్తూ అభినందిస్తున్నాను.

కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి

(16, సెప్టెంబరు 2016 నాటి నేటినిజం పత్రికలో ప్రచురణపొందింది)

## గుప్పెళ్లతో వెదజల్లిన కవితా పరిమళం బొల్లోజు కవిత్వం

-బొల్లోజు బాబా
30-7-31, సూర్యనారాయణ పురం
కాకినాడ. సెల్: 9849320443
ఫోన్: 0884-2368189

సృజనాత్మక కళల్లో నూతన సృష్టికి మొదటి వరుసలో నిలబడేది కవిత్వం. వర్తమాన జీవనశైలి మారుతున్నట్లే కవిత్వమూ మారుతుంటూంది. కవిత్వాన్ని పాఠకలోకం మెచ్చుకోవాలంటే హక్కున చేర్చుకోవాలంటే నిత్యనూతన భావాల సృష్టి జరగాలి. నూతన భావాలు వ్యక్తీకరించాలంటే కొత్త పదబంధాల్ని సృష్టించుకోవాల్సి వుంటుంది. కవిత్వాన్ని కేవలం పదజాల కూర్పు అనుకోవడం పొరపాటు. ఆ అక్షరాల్లో వైవిధ్య భరితమైన అనుభూతి ఉంటుంది. ఆచారణాత్మకమైన జ్ఞాన సంపద ఉంటుంది. కాలంతో కలసి నడిచి సమాజిక చీకటి కోణాలను వెలికితెచ్చే వో ప్రజ్ఞ వుంటుంది. నేడు కవుల సంఖ్య పెరిగినంతగా కవిత్వం లోతులు పెరగడం లేదు. పాత పడికట్టు పదాలతో, శిల్పం కిందుమీదు చేస్తు వస్తు మార్పిడిగా భ్రమింపచేస్తూ రాయడం పరిపాటై పోయింది అసలు కవిత్వం ఇది కాదు అని తెలుసుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. ఏదో ఒక కొత్త దారి అనంతాన్వేషణ దిశగా వెతుకులాట మొదలెడితే, ఒక వెలుగు కిరణం దృశ్యంగానో అదృశ్యంగానో కొత్త రూపాన్ని వ్యక్తపరుస్తూ, కొత్త లోకాన్ని స్పృశిస్తూ కొత్తదారిన నడిచినట్లు, వస్తువును సంభావించడం భాషను ఓన్ చేసుకోవడం ఒక లాఘం ప్రదర్శించాలి కవులంతా. సాంద్రతరమైన వాక్యాలు, తీవ్రతతో అంతరంగిక పరిపక్వతతో వెలువరించే కవుల్లో 'బొల్లోజు బాబా" మొదటి వరుసలో ఒకరుగా ఉంటారనుకుంటా. వీరి కవిత్వంలో కొత్త ధ్వని వినిపిస్తూంటూంది. సార్వజనీనానుభవం కనిపిస్తూంటూంది. అలతి అలతి పదాలే ఆయుధాల్లా మొనదేలి పాఠక హృదయాన్ని తాకుతుంటాయి. పువ్వుల్లా విప్పారుతుంటాయి. ఎంతో పరిమళాన్ని వెదజల్లుతుంటాయి.

"నీటి పొర" అనే కవితలో మద్యపానం మంచిది కాదు అని చెప్పే విధానం గమనించండి. మొదటి లైన్స్‌లో తాగుబోతులతో చేతులు కలిపినట్లే వుంటాడు తరువాత పేరాల్లో తాగుడు వలస కలిగిన నష్టాన్ని ఎంత నైపుణ్యంగా చెప్తాడో చూడండి. "తాగుడుపై సదాభిప్రాయం లేకపోయినా/ దురభిప్రాయం మాత్రం ఉండేది కాదు/అదో పురాతన విలాసం కదాని" అనడంలో పూర్వుల దగ్గర నుంచి మనం చేస్తున్న పని అదేగదా అన్నట్లు ధ్వని వినిపిస్తుంది తరువాత అంటారు. "కానీ.../ మొన్నో రోజు మా కాలేజీలో/ ఓ విద్యార్థిని తండ్రి తన కూతుర్ని/ నలుగురెదుటా బూతులు తిడుతూ/ అవమానించినపుడు/ ఆమె కనుల నీటి పొరలో/ తాగుబోతు తండ్రులందరూ/ దగ్ధమై పోవాలనుకొన్నాను".. "కువాయిట్ అమ్మ నా పేర్న పంపించే/ డబ్బుల కోసమే ఇదంతా" అని ఆ అమ్మాయి అన్నప్పుడు/ ఆ నీటి పొరలో ఈ మద్య ప్రపంచం/ కొట్టుకుపోవాలనుకున్నాను" ఇక్కడ తండ్రి తాగుడుకు బానిసైనా, తల్లి బిడ్డల మీద ప్రేమతో ఇతర దేశం పోయి, కూలి పని చేసి, బిడ్డ చదువుకు డబ్బు పంపుతుండు. ఆ డబ్బు కోసం తండ్రి బిడ్డను బాధిస్తున్నాడు అనే కథ నాలుగు లైన్స్‌లో చెప్పాడు కవి. ఇట్లా బొల్లోజు బాబా పద కాఠిన్యం లేకుండా భావ సాంద్రతను పెంచే దిశగా కవిత్వాన్ని చెప్పడం హర్షింపదగిన విషయంగా భావిస్తాను.

నేడు కవిత్వం రూపు ఏ విధంగా మారిపోయిందో చూడండి. వాచ్యంగా ఒక్కపదమూ లేదు. "ఏమి గుర్తు లేవిపుడు/ జేబులోసూర్య కిరణాలు/ గుప్పెడు చందమామ/ ముక్కలు తప్ప/ దుఃఖాశ్రువులు నిండిన/ సాయంత్రాన్ని/ రాత్రి రెప్పల క్రింద/ నిదురపుచ్చి అన్నీ/మరచిపోదామనుకొంటాను/ కానీ/ కొన్ని పదాలు నా నుండి రాలిపడి/ ఓ ఎడారిని సృష్టిస్తాయి/ ఆ ఎడారిలోంచి ఓ అరణ్యం/ ఆ అరణ్యంలోంచి కుంభవృష్టి/ ఒక్కొక్కటిగా విచ్చుకొని/ నన్ను కబళిస్తాయి" అట్లా సాగిపోతుందీ కవిత. కవిత్వం రాయలేకుండా వుండలేని తనాన్ని, కవిత్వం ఆనందం దుఃఖమయమనే భావాన్ని నిగూఢంగా చెప్పాడు కవి.

'వస్తావా?" అనే కవిత చూడండి. "చీకటి దుప్పట్లో దూరి/దేహ దీపాల్ని/ వెలిగించుకొందాం/ రాత్రి హార్మోనియంపై/ మోహ పరిమళాల రాగాల్ని పలికిద్దాం/ శీత వేళకు చిక్కకుండా/ వేడి శ్వాసల్ని కప్పుకుందాం/ ఒక సమాంతర కాలంలోకి/ అనంతంగా ప్రవహిద్దాం/ వస్తావా!" అంటారు చీకట్లో వెలుగులు నింపుకోవడం, నిశిలో మోహ పరిమళాల రాగాల్ని పలికించుకోవడం/ మనిషి కోల్డ్ హార్టెడ్ కాకుండా వేడి శ్వాసల్ని కప్పుకోవడం అభివ్యక్తిపరంగా ఎంతో నూతనత్వాన్ని సాధించాడు కవి బొల్లోజు బాబా.

బొల్లోజు బాబా యానంలో బొల్లోజు బసవలింగం,అమ్మాజి దంపతులకు జన్మించారు. ఈయన యం.యస్.సి.బియిడి యంఫిల్ చేసి జువాలజీ అధ్యాపకునిగా పని చేస్తున్నారు. ఈయన సహచరి సూర్య పద్మ.

**వీరి రచనలు:** 1) యానం విమోచనోద్యమం, 2) ఆకుపచ్చని తడిగీతం, 3) ఫ్రెంచి పాలనలో యానం, 4) స్వేచ్ఛా విహంగాలు, 5) వెలుతురు తెర. వీరివి ఇబుక్స్. 1) ఎడారి అత్తరులు, 2) ఇరవై ప్రేమ కవితలు. ఒక విషాద గీతం. 3) గాథ సప్తశతి కొన్ని అనువాదాలు. 4) వివిధ పుస్తకాల పరిచయ వ్యాసాలు. వీరు పొందిన అవార్డులు. 1) శిలవరశెట్టి సాహితీ ప్రత్యేక పురస్కారం2010 2) కళాలయ సాంస్కృతిర సంస్థ పాలకొల్లువారి సాహితీ పురస్కారం2012.

**వీరు మెచ్చిన ఆధునిక కవులు:** శివారెడ్డి, శిఖామణి, దాట్ల దేవదానం రాజు, అఫ్సర్, వాడ్రేవు చిన వీరభద్రుడు.

సాహిత్యం కాలనుగుణ్యంగా మారుతుండాలి. భాషా పటిమకంటే భావ పటిమ జాస్తిగా ఉండాలి. పాఠకుణ్ణి కఠిన పదాలతో కన్‌ఫ్యూజ్ చేయకూడదు. 'బాబా' కలం నుండి మరెంతో సాహిత్యం వెలువడాలని ఆశిస్తూ అభినందిస్తున్నాను.

-కొండ్రెడ్డి
వెంకటేశ్వర రెడ్డి
సెల్: 9948774243

కదిలించే కలాలు

# బాబా "వెలుతురు తెర" చూడండి

రవికాంత్, ఆంధ్రభూమి డెస్క్

జీవించిన కాలాన్ని కవి లిఖిస్తే చరిత్రకారుడవుతాడు. సమకాలీన పరిస్థితుల్ని గుర్తిస్తే అతడు సామాజిక చరిత్రకారుడవుతాడు. అలా తనకు తానుగా తన ఊరు "యానాం" చరిత్రను రాసి చరిత్రకారుడయ్యాడు. కవిత్వ సొగసులతో సమాజాన్ని అంతర్మథనం చేసి కొత్త చరిత్రకు నాంది పలకటానికి సామాజిక చరిత్రకారుడయ్యాడు ఈ కవి. ఆయనే బొల్లోజు బాబా. సాహితీ లోకానికి కొత్తగా పరిచయం కానవసరం లేని కవిత్వ సమీక్షకుడు. వృత్తి రీత్యా జంతుశాస్త్ర అధ్యాపకుడు. ఆయన రాసిన రెండో కవితా సంపుటి వెలుతురు తెర. పిల్లలకు చదువు చెప్పటానికి ఏవిధానం అనుసరిస్తున్నారో కాని కవిత్వాన్ని ఎలా చుంబించాలో చూపించారు. కవిత్వాన్ని ఎంత దృశ్యమానం చెయ్యవచ్చో అలా ఎంత ధ్వనిమానం చేయవచ్చో కవి బాబా కవిత్వం చదివితే తెలుస్తుంది.

బ్రతుకు చిత్రంలో చాలామంది సాదాసీదాగా బతికేస్తుంటారు. అయితే జీవిత చిత్రణ అంటే ఏమిటో తెలియకుండ అగడిపేస్తుంటారు. అసలు జీవితం ఏదో తెలీని మనిషిని జీవితం ఇదని చెప్పే కవిత 'జీవితం'. ఒక తొమ్మిది పంక్తుల్లో చెప్పిన విధానం చూస్తే ప్రశ్నార్థకపు బ్రతుకు కళ్లకు కనబడుతుంది.

ఎలా బతకాలో, ఏది బతుకో తెలియదు చాలామందికి. మరి దేహం గురించి ఏం తెలుస్తుంది? అలౌకితను అధ్యాత్మికతను ఎత్తి చూపే ప్రయత్నం దేహం-నీడ' కవితలో ప్రస్ఫుటమౌతుంది. లోకరీతిని చెబుతూనే దాగిన తాత్వికతను ఎలుగెత్తి చాటే కవిత ఇది. ఆలోచనాత్మకతను తెలివిగా ప్రకటించే క్రమం. అందులో దాగిన సత్యాన్ని వెలికితీసే ప్రయత్నం కన్పిస్తుంది.

దేహం కన్నా
నీడ తెలివిగా ఉంది
ఈ బూడిదలోకాన్ని
నిత్యం సందేహిస్తుంది

ఎవరు ఎక్కడ ఎప్పుడు మనసు నిత్యయపరుచుకుంటారో తెలిసాక నీడచెప్పేసత్యం సందేశాత్మకం కాదు.

'దేహాన్ని నీడ ఎత్తుకుపోయి

మృతుల దేశంలో దించేసింది' అని చెప్తు ఆ తరువాత.... అని ముగించటం గొప్ప మార్మికత

సాంద్రత కల కవిత్వాన్ని కొలవటానికి సాధన సంపత్తులు ఏ విశ్వ విద్యాలయం రూపొందించలేదు. ఒక చిక్కని భావుకతను కొలవటానికి అనకూడదు కాని చదవటానికి మాత్రం కాస్త మనసుంటే చాలు అవగతమవుతుంది. పదాల పేర్పుతో అక్షర పంక్తులు పేజీలో నింపేస్తే కవిత్వమనే భ్రమను పటాపంచలు చేయడం, భావాన్ని పలికించడంలో వైయక్తికంగా చెప్పటమే కవిత్వం. కవిత్వాన్ని రాసుకోడానికి, కవిత్వాన్ని వేసుకోడానికి ఎక్కడా పరిమితులు లేవు. అలాగని ఎక్కడా వాటిని అమ్మే పరిస్థితులు లేవు. ఎవరు తీసుకుంటారు ఈ పుస్తకంలో కవిత్వాంశ లేదు అనే సాహసం అయితే మంచి కవిత్వం ఎక్కువకాలం మన్నికతో మనగలుగుతుంది అది నిజం.

చదువరుల కొరత, సాహిత్య మనుగడ చింత తెలుగులో వ్యక్తీకరణ చేసేవారి సంఖ్యపడిపోవడం వంటి మాటలు తరుచూ వింటుంటాం. అదీ తెలుగుమాట్లాడే వారి కోసం చెప్పుకొనే సంగతులు. తమ మాతృభాషలో 30 శాతం మించి మాట్లాడకపోతే అది మృతభాషకింద లెక్క. అలా మనమూ చెడిపోయే అవకాశం కొద్దిదూరంలో ఉంది. ఇదీ తెలుగువారికి దాపురింఇచ్చ పరిస్థితి. మరి ఈ లెక్కల్ని మించిపోయి తెలుగు సాహిత్యానికి పట్టం కట్టే పరిస్థితి ఉందా? నిందా పుర్వకంగా మాట్లాడే హక్కులో ఇమిడిపోగలమా? మంచి కవిత్వానికి ఆదరణ కలిపిస్తేనే అది సాధ్యమవుతుంది. కవిత్వ విమర్శనాత్మకతకు నోచుకుంటేనే ఉత్తమం కాగలదు. ఆ కోవలోకి వచ్చే మంచి కవిత్వం వెలుతురు తెరలో చూడొచ్చు.

మౌనం నుంచి మేల్కొల్పిన మాటను సుతారంగా వదిలారు. పదాల్ని నలిపేసి అక్షరాల్ని ఏ బండకింద మెలిపెడితే పెగిలించుకొని చించుకొని ఉబికి కాసిన్ని మాటలువెలుతురును ఎలా చీల్చుకొస్తాయో చెప్పారు. వెలుతురై ప్రతిబింబించాల్సిన ముఖాలు కాంతిలో తచ్చాడటం విద్యార్థి జిజ్ఞాసను కాదు దుర్దశను "వెలుతురు తెరపై" చూస్తాం.

పంటవేయడానికి సిద్ధం చేసిన వరి మడిలోకి ఆకాశాన్ని దించిన కవి బాబా అభినందనీయుడు. 'ఊడుపు' కవితలో

ఒంగున్న స్త్రీలు
వరి మొలకల్ని
అనంతనీలిమలో
గుచ్చుతున్నారు'

మినీ కథలు

# బాబా 'వెలుతురు తెర' చూడండి!

ప్రతులకు:
బొల్లోజు బాబా
30-7-31,
సూర్యనారాయణపురం
కాకినాడ, తూ.గో.జిల్లా
సెల్: 9849320443
పేజీలు: 95, వెల: 100/-

- రవికాంత్, సెల్: 9642489244

అంటారు. ఆశాజనకమైన ఊహతో మహిళలచే బీజం వేయించారు ఆహారోత్పత్తికి. చాలా చిన్న కవిత ఇది. అయితే పెద్ద ఆశయాన్ని తెలిపింది. తనను తాను స్కానింగ్ చేసుకొనిరాసిన కవిత 'సమతుల్యత'. తన వృత్తిని ప్రతిబింబింప చేస్తూనే బోధితత్వాన్ని బయలు పరచారు. విద్యార్థులతో ఎంత మమేకమైపోయుంటారో కనుకనే సమాజంతో సామాజీకరణ చెందారు. ప్రభుత్వ కళాశాలలో పనిచేయటం వల్ల కాబోలు మనుషుల్ని సంఘాన్ని బాగా చదవగలిగారు. జవాబు పత్రాన్ని చూడగానే తెలిసిపోతుంది విద్యార్థి జీవితం. రోగి నాడి పట్టుకున్న వైద్యుడిలా వాడి బతుకు లక్షణాన్ని ఇట్టే గుర్తుపట్టెస్తారన్న మాట. 'మూల్యాంకనం' కవిత నిజంగా పిండేస్తాది. 'జవాబు పత్రాన్ని మెదడు తూకం వేస్తే/ హృదయం మూల్యాంకనం చేస్తుంది' అంటారు. పేపర్లు దిద్దటం అంటే ఒక్కోసారి/పత్రికల్లో పతాక శీర్షికలవటం కూడా/ఆత్మహత్యగానో, అత్యుత్తమ రాంక్ అనో ... చాలా నిర్ధారించి చెప్పిన మాట ఇది.

ప్రతి కవిత ముగింపు చాలా అర్ధవంతంగాను ఆలోచనా హితం గాను ఉపసంహరించడం కవి బాబా ప్రత్యేకత. పుస్తకంలో ఏ కవిత చదివినా మది పులకిస్తుంది. అదే క్షణంలో మనసూ చమరిస్తుంది. ప్రకృతి అంటే ఆహ్లాదభరితం ఆనందపూరితం అనుకుంటారు. అవును మరి లొట్టలేసుకుని ఆరగించే మానవుడు మనిషిని తినడం మొదలు పెట్టాక

'పాపం!
జగమేలే పరమాత్మ
ఎవరితో మొరపెట్టుకొంటుంది?

పర్యావరణ సమతుల్యాన్ని చెప్పిన ప్రకృతి కవిత ఇది. కవిలోని ఆర్ధ్రత ప్రతికవితలో మనకు కన్పిస్తుంది. దాని అందిపుచ్చుకోగలిగితే కవి ప్రయత్నం సార్ధకమయినట్లే.

రవికాంత్, ఆంధ్రభూమి డెస్క్

# కవిత్వం నుంచి కవిత్వంలోకి... 'దారి తప్పిన పక్షులు

– నిషిగంధ

(Telugu translation of Tagor's Stray Birds by Bolloju Baba)

కవిత్వమంటే అనుభవించిన క్షణాల్ని అక్షరాల్లోకి అనువదించడం! ఆ అనువదించిన అక్షరాలని పట్టుకుని పాఠకుడు కవి పొందిన అనుభూతిని పొందగలిగినప్పుడే ఆ కవిత్వం సార్థకమౌతుంది.

కవికి కవిత్వం ఒక జీవన విధానంగా ఉండాలి. అంతే కానీ బ్రతుకుతెరువు కోసం రాయడం మొదలుపెడితే అనుభూతి పాలు తగ్గిపోయి అభూత కల్పనలు ఎక్కువైపోతాయి! 'తత్త్వతః వస్తువు అలంకారాలుగా మారిపోవడమే కవిత్వం. అలాగని కవిత్వమంటే అర్థవైచిత్రిగాని, శబ్దవైచిత్రి కాదని' అంటారు శేషేంద్ర శర్మ. అంటే క్లిష్టమైన పదబంధాలు, లోతైన భాషా పటిమతో మంచి కవిత్వం పుట్టదు. కవి యొక్క అనుభవాల పరంపర అభివ్యక్తమయ్యే రీతి కళాత్మకంగా, తమ హృదయాలకు దగ్గరగా ఉన్నప్పుడు మాత్రమే పాఠకుడు అందులో తనని తాను ఆవిష్కరించుకోగలడు.

సరిగ్గా అలాంటి కోవలోకి వచ్చేదే విశ్వకవి రవీంద్రుని కలం నించి వెలువడిన కవితా సంకలనం, 'Stray Birds'. టాగోర్ గురించి, ఆయన రచనల గురించి పరిచయ వ్యాక్యాలు చెప్పాలనుకోవడం సాహసమే అవుతుంది. చదవడానికి ఎంతో సరళంగా ఉంటూనే, గాఢమైన భావార్థతను కలిగి ఉండటం వాటి ప్రత్యేకత! తన అక్షరాల్లో కనిపించే వేదాంత దృక్పథం, ఉపనిషత్తుల ప్రభావం అని చెప్పుకునే టాగోర్, తన రచనలన్నీ చాలావరకు బెంగాలీలోనే చేసినా, తర్వాత కొన్నింటిని స్వయంగా ఆంగ్లంలోకి అనువదించారు. అలా తర్జుమా చేయబడినదే, 1916 లో అచ్చువేయబడిన ఈ 'Stray Birds' కవితా సంకలనం. క్లుప్తత, గుప్తత ఈ కవితల ప్రధాన లక్షణాలు. చైనా, జపాన్ పర్యటనా కాలంలో ఆయా దేశాల కవిత్వ ప్రభావంతో ఈ చిన్న చిన్న కవితలు రాసినట్టు చెబుతుంటారు. అందుకేనేమో అక్కడక్కడా 'హైకూ' ఛాయలు కనబడుతుంటాయి!

టాగోర్ రచనలు చాలానే తెలుగులోకి అనువదింపబడినా ఎప్పటికీ నిలిచిపోయేవిగా గీతాంజలి, రాణీఘాట్, గోరా వంటి వాటిని చెప్పుకోవచ్చు.

అడపాదడపా కొంతమంది ఒకటీ రెండు పద్యాలను తెలుగీకరిస్తూనే ఉన్నా బహుకాల విరామం తరువాత టాగోర్ రచించిన ఈ కవితా సంకలనం 'Stray Birds' మొత్తం 'స్వేచ్ఛావిహంగాలు' గా తెలుగులోకి అనువదింపబడినది. అనువాదకుడు మరెవ్వరో కాదు, పదచిత్రాలతో మనల్ని తరచూ సాహితీయానం చేయించే బొల్లోజు బాబా గారు.

ప్రకృతి, ఈశ్వరుడు, స్నేహం, ప్రేమ, మొదలైన వివిధ విషయాలను టాగోర్ చిన్న చిన్న కవితలలో స్పృశించాడు. ఈ చిట్టి కవితలలో కొన్ని, ఒక్క లైనుకే పరిమితమైనవి కూడా ఉన్నాయి. 'దారితప్పిన పక్షులు' పేరు వినగానే ఇదేదో వేదనా స్వరమేమోనన్న సంకోచం. కానీ మొత్తం 326 కవితలున్న ఈ సంకలనంలో చతురత, ఆరాధన, వేదాంతం, భక్తి ఇత్యాది భావాలన్నీ కలగలిసి, మంద్రస్వరంలో సాగుతున్న అద్భుతమైన పాటనేదో వింటున్న అనుభూతి కలుగుతుంది! వీటిలో లీనమవుతుండగానే, ఇవి పక్షులు కావు దారితప్పిన కవి ఆలోచనలు, భావాలు అన్న విషయం సుస్పష్టమవుతుంది.

నిజమే కదా! మన ఆలోచనలు కూడా పక్షులంత స్వతంత్రంగా విహరిస్తాయి. ఎక్కడెక్కడో తిరిగిన గువ్వలన్నీ చివరికి గూటికే చేరినట్లు ప్రాపంచిక విషయాలన్నిటినీ స్పృశించిన ఈ ఆలోచనా స్రవంతి కూడా కవి హృదయంలోకి ఒదిగిపోతుంది. అక్షరాలుగా జారి పాఠకులకి విశేషాలను వినిపిస్తుంది!

అనువాద రచన, పైగా ఇది యథామాతృకానువాదం. యథేచ్ఛానువాదం కాదు! అందులోనూ ఈ సంకలనంలోనివి చిన్న చిన్న కవితలు. ఇదే economy of words ని వేరే భాషలోకి తర్జుమా చేయడం అంత సులువు కాదు. అసలు రచనలోని అంతఃస్సూత్రాన్ని అవగాహించుకోవడమే కాదు అందులోని భావం, శిల్పం చెడకుండా అనువదించడం, అదీ సహజత్వానికి ఏమాత్రం దూరం కాకుండా చూడగలగడం కష్టసాధ్యమే!!

చిన్న కవితలలో పదాలను ఆచితూచి ప్రయోగించాలి. ఉన్న పరిధిలోనే ఉన్మీలనం చెందగలిగి ఉండాలి. అంటే కలం పట్టుకున్నవారికి భాషా ప్రావీణ్యమేకాదు, పదాల ప్రయోగంలో నైపుణ్యం ఉండాలి! ఇది సాధించడానికి ఇరు భాషల మీదా పట్టు ఉండాలి. వేరే భాషలో ఉన్న కవిత్వాన్ని అనువదించేప్పుడు భాషా ప్రయోగం కుదరకపోతే, ఆయువుపట్టైన రసజ్ఞతా భావం లోపించి కవిత్వం వచనమైపోయే ప్రమాదం ఉంది. బాబా గారి కవితలు చదివిన వారెవరికైనా ఆయన ప్రతిభ మీద ఏమాత్రం సందేహం కలుగదు. అనువాద వాసనలు ఇసుమంతైనా తగలని చిక్కని కవిత్వాన్నే మనకందించారు!

టాగోర్ సాహిత్యంతో, ముఖ్యంగా కవిత్వంతో పరిచయమున్న వారెవరికైనా తెలుస్తుంది ఆయన ఎన్ని రకాల సూచికలు, ఉపమానాలు, పద చిత్రాలు ఉపయోగించారో! బాబా గారి అనువాదం చదువుతుంటే 'టాగోర్ మాతృకలో ఎలా వ్యక్తపరిచి ఉంటాడో!?' అన్న కుతూహలం ఎక్కడా కలుగదు. మన నేపథ్యానికి తగినట్టుగా అనువాదకుడు పరిచిన పదజాలంలో ఒదిగిపోతూ మనమూ ఆ పక్షుల వెనకే చేతనాచేతనలను మరచి సంచరించడం మొదలుపెడతాము!

1

వేసవిలో దారితప్పిన పక్షులు, నాకిటికీ పై వాలి
పాటలు పాడి ఎగిరిపోయాయి.
పాటలు లేని శిశిర పత్రాలు
తల్లడిల్లి నిట్టూరుస్తో నేలరాలాయి.

అంటూ మొదలుపెడుతుండగానే కవి మాయమైపోయి అతని అనుభవాలు, అనుభూతులే మన కళ్ళముందు నిలుస్తాయి! ఇది ఆత్మాశ్రయ కవిత్వమా లేక అనుభూతి కవిత్వమా అంటూ ఒక వర్గానికి పరిమితం చేయలేము. కానీ ప్రధానంగా మూడు కవితా వస్తువులు కనబడతాయి: ప్రాపంచిక విషయ జ్ఞానం (Philosophy of life), భక్తి / ఆరాధన, ప్రకృతి.

ముందుగా ప్రాపంచిక విషయ జ్ఞానం గురించిన కవితలనే తీసుకుంటే వీటిలో మౌలికాంశాలను స్పృశించే తాత్త్వికాలోచన కనిపిస్తుంది.

14

సృష్టి రహస్యం రాత్రి చీకటిలా ఒక అద్భుతం.
జ్ఞానం యొక్క మాయలు
ఉదయపు మంచు పొగ వంటివి.

రాత్రి చీకటి అంటే గాఢమైన నిశ్శబ్దం. చుట్టూ ఉన్న ప్రపంచంతో డిటాచ్మెంట్ కలిగించే అలౌకిక స్థితి. రసానుభూతుల సంఘర్షణ నించి విరామం దొరుకుతున్నప్పుడే నిశ్శబ్దంగా ఒక మొగ్గ మెల్లగా విచ్చుకుంటుంది. అదే సృష్టి రహస్యం. అంతా జరుగుతూనే ఉంటుంది. కానీ రాత్రి చీకటిలా అస్పష్టంగా, అద్భుతంగా! జ్ఞానం మనల్ని మనం అవగాహన చేసుకోవడానికి ఉపయోగపడుతుంది. ఈ ప్రక్రియలో మన లోపల, బయట ఉన్న అనేకాంశాలు తేటతెల్లమౌతుంటాయి. ఉదయకాలపు పొగమంచు కిరణాల స్పర్శతో

కరిగిపోయినట్లు, జ్ఞాన సముపార్జన ప్రాపంచిక విషయాలపై అప్పటివరకూ ఉన్న భ్రాంతిని కరిగించివేస్తుంది.

20
శ్రేష్ఠమైన దాన్ని నేనెన్నుకోలేను.
శ్రేష్ఠమైనదే నన్ను ఎన్నుకొంటుంది.

మనకు అనువైనది, అవసరమైంది తనంతట తానే మనల్ని చేరుకుంటుంది. అదే అన్నిటికంటే విలువైనది. అలవికాని వాటికోసం వృథా ప్రయాస కూడదనే హెచ్చరిక ఇందులో కనబడుతుంది.

45
అతను తన ఆయుధాలను
తన దేముళ్లుగా చేసుకొన్నాడు.
అతని ఆయుధాల విజయం, అతని ఓటమే.

ఆయుధాలకు ఉన్నత స్థానం ఆపాదించడం, వాటితో సాధించిన విజయమేదైనా వ్యక్తిగత ఓటమిగానే పరిగణించాలంటున్నారు. స్వీయప్రతిభతో చేజిక్కించుకోలేని ఏ విజయమూ మనది కాదు.

మనిషి ఆత్మజ్ఞానం గురించి ఏమాత్రం ప్రయత్నించడం లేదన్న ఆవేదనను వేరొక కవితలో ఇలా వ్యక్తపరిచాడు.

52
చరిత్రలో మానవుడెక్కడా
తనని తాను బయలు పరచుకోలేదు.
యుద్ధాలతోనే గడిపేసాడు.

48
మిణుగురులుగా
అగుపించటం పట్ల
తారలు భీతినొందవు.

సూర్యునికంటే తేజోవంతమైనవి తారలు. అయినా అవి తమ పరిధులను దాటి వచ్చి విశ్వానికి తమ స్వయంప్రకాశాన్ని ప్రదర్శించాలనుకోవు. యావత్ ప్రపంచం దృష్టిలో కేవలం మిణుకు మిణుకుమనే మిణుగురు పురుగులవలె కనిపించినప్పటికీ తమ

తమ స్థానాల్ని వదలక నిలుచుంటాయి. అదేవిధంగా ప్రపంచానికి జ్ఞానుల అంతర్గత శక్తి అవగతమవ్వక వారిని చిన్నచూపు చూసినా, చెదరక స్థిరచిత్తంతో ఉంటారు. పేదవారని, అధికారబలం ఉన్నవారని, గొప్పవారని, బిచ్చగాళ్ళనీ లేకుండా అందరికీ ఎప్పుడో ఒకప్పుడు తటస్థపడే ఆఖరి అతిథి మృత్యువు. మనకి మృత్యువు అంటే భీతి. అదొక అత్యంత దుఃఖకరమైన ఘట్టం. మృత్యురహిత ప్రపంచమెందుకు లేదా అని వాపోతుంటాము. కానీ టాగోర్ మాటల్లో మృత్యువు ఎలా ఉంటుందో చూస్తే:

99
మృత్యువనే ముద్ర జీవితం అనే నాణానికి
యోగ్యతనిస్తుంది.
అపుడు మాత్రమే దానితో
ప్రియమైన వాటిని కొనగలం.

మనకి కావాల్సినది మరణరహితమైన సమాజం కాదు, దుఃఖరహితమైన సమాజం. మృత్యువే లేకుంటే మనం చేసే ఏ పనికీ ప్రాధాన్యత ఉండదు. అచ్చు, బొమ్మ ముద్రింపబడని నాణెం లానే!
మన జీవితానికి అర్థాన్ని, ప్రయోజనాన్ని కలుగజేసేది మృత్యువే!
ఇంకొక కవితలో..

222
మృత్యువు ఒక పగులు కాదు
అందుకే ప్రపంచం కారిపోదు.

మృత్యువు ప్రపంచాన్ని నిర్జీవం చేయదు. నిరంతరంగా కొత్తని సృష్టించే అవకాశాన్నిచ్చే అమరత్వం అది!

అసలైన కవికి పరిధి ఉండదు. ఒకేరకమైన వాద కవిత్వానికే కట్టుబడి ఉండాలనుకోడు. స్థూలంగా కవితా వస్తువు జీవితమే అయినా సూక్ష్మంగా పరిశీలిస్తే అవి అనేకానేకం. అనంతం!

ముఖ్యంగా స్వచ్ఛమైన ప్రకృతిలో తడిసి మైమరిచిపోవాలని అనుకోని కవి ఉండడేమో! ప్రకృతి వ్యక్తపరిచే విభిన్న ప్రేమవల్లరిని చూస్తూ, ఆమె ప్రతి కదలికనీ, ఆ కదలిక తనపై ముద్రించే అనుభూతినీ తనే ప్రేక్షకుడిలా చూసుకుంటూ, అదేదో ప్రపంచానిక్కూడా అనుభవమయ్యేలా చూపాలని తపిస్తాడు.

30

చంద్రమా! దేనికై ఎదురుచూస్తున్నావూ?
'సూర్యునికి వందనమిడి ఆయనకు దారివ్వటానికై'

రాత్రికి రాజుననే అతిశయపు సెగలు ఏ కోశానా చిందించని చందమామ, తన అధిపతి సూర్యుడేనన్న విషయం ఏమరపాటుకి రానివ్వడేమో! అందుకే జాబిలి సన్నిధిలో ఎప్పుడూ మనం చల్లదనాన్నే ఆస్వాదిస్తాము.

65

చిన్నారి గడ్డి పోచా!
నీ పాదం చిన్నదే కావొచ్చు కానీ
పుడమి మొత్తం నీ అడుగుల క్రిందే ఉంది.

సూక్ష్మమైన, సున్నితమైన గడ్డిపోచకు విలువేమిటని తీసిపారేస్తాము. కానీ ధరణి అంతా ఆ సున్నిత పాదాల కిందే ఒదిగి ఉంది కదా!

88

'నీవు ఈ తామరాకు క్రింద ఉన్న పెద్ద మంచుబిందువువి.
నేను పైన ఉన్న చిన్నదాన్ని'
కొలనుతో మంచుబిందువు అన్నది.

ఇది చదవగానే ముందు మంచుబిందువు స్వాతిశయమే కనిపించినా తరచి చూస్తే కొలనుకీ, మంచుబిందువుకీ ఉన్న సమన్వయం ఎంత చక్కగా అవగతమౌతుందో! రెండిటినీ నియంత్రించే శక్తి కిరణాలది.

100

ఆకాశంలో ఒక మూల
ఆ మేఘం వినమ్రంగా నిలుచుంది.
ఉదయసంధ్య
దానికి తేజో కిరీటాన్ని కట్టపెట్టింది.

124

చంద్రునితో సూర్యుడు పంపించిన
ప్రేమలేఖలకు తన జవాబును
గరికపై కన్నీళ్ళతో రచించింది – రాత్రి.

ఒకనాటి ఉషోదయాన పైన ఆకాశం, కింద భూమిలో ఒకేసారి మనకు తెలియకుండానే మమేకమవుతామేమో! ప్రకృతి వర్ణన అంటే శబ్దాడాంబరంతో, అలంకారాలు చేర్చి ఇంత పొడవుగా సాగే కవితలే మనకి ఎదురౌతాయి. చిన్న చిన్న పదాలతోనే టాగోర్ మనకందించిన తాదాత్మ్యత మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేయక మానదు.

ముఖ్యంగా రెండవ కవితలో కనిపించే గాఢానుభూతి గుండెను తడి చేయకమానదు. చంద్రుడిని సూర్యుడు తన ప్రేమలేఖగా రాత్రి కోసం పంపడమన్న భావనే మనసులో మాధుర్యాన్ని నింపుతుంటే, తన ప్రియతముడు సూర్యుడిని కలుసుకోలేని తన అశక్తతకు చింతిస్తూ కన్నీళ్ళను మంచుబిందువులుగా గడ్డి చివుళ్ళపై వదిలి వెళ్ళే, రాత్రి ఉదాత్తమైన ఆరాధనను మనకు పరిచయం చేస్తున్నది.

185
వానలు నిండుకున్న
శరత్కాల మేఘాన్ని నేను
నా నిండుతనమంతా
పండిన వరిచేలల్లో ఉంది.

శరదృతువులో మేఘాలకు తళుకులీనే మెరుపులుండవు. గంభీరమైన గర్జన స్వరముండదు. తమ ఆడంబరాన్నంతా పంటచేలల్లోకి ఒలకబోసేసి అన్నీ త్యజించిన పాత్రల్లా పారదర్శకంగా చెదురుమదురుగా పడి ఉంటాయి. వాటి జీవాన్ని పీల్చుకుని పెరుగుతున్న చేలన్నీ ఆ మేఘాలను మందహాసంతో పలుకరిస్తుంటాయి. ఇంతలా ప్రకృతిలో లీనమవ్వడం సాధ్యమేనా అనిపిస్తుంది.

ఇక ఈశ్వరుని ప్రసక్తి లేని రవీంద్రుని రచన లేదేమో! మనలో ఎవరినైనా ఈశ్వరుడెవరని అడిగితే వెంటనే అలవోకగా చెప్పలేము. నిరాకారుడని, సాకారుడని, నిర్గుణుడని, ఒక్కడని, లేదా అనేకులలో ఒకడని ఎన్నెన్నో రకాలుగా చెప్తాము. టాగోర్ ఇలాంటి తర్కాల జోలికి పోకుండా తనకు అవగతమయ్యే ప్రియసఖుడు, తండ్రి, గురువుల రూపాలలో ఈశ్వరుడిని చూసుకున్నాడు. ఒక 'గీతాంజలిని' సమర్పించుకున్నాడు. ఈ సంకలనంలో ఈశ్వరుడు మన వద్ద నించి నిజానికి ఏమి ఆశిస్తాడో విశదపరుస్తున్నాడు.

67
ఈశ్వరుడు గొప్ప గొప్ప రాజ్యాల వల్ల
విసుగునొందునేమో కానీ
చిన్న చిన్న కుసుమాల వల్ల కాదు.
215
తన సుమాలనే తిరిగి
మానవుని కాన్కలుగా పొందటానికై
ఈశ్వరుడు కాచుకొని ఉన్నాడు.

ఈశ్వరుడు మనపై కురిపించే దయ, ప్రేమ, కరుణ, స్నేహానికి మనం బదులుగా ఇవ్వాల్సిన కానుకలు ధనము, విలువైన వస్తువులు కాదు నిర్మలము, కోమలము అయిన పూలు మాత్రమే అని ప్రవచిస్తున్నాడు. ఇహలోకంలో మనం అనుభవించే ప్రతీది ఈశ్వరుని సృష్టే. అలా ఆయన సృష్టించిన పుష్పాలను తిరిగి ఆయనకే సమర్పించినప్పటికీ ఆనందంగా స్వీకరిస్తాడు!!

170
ఈ నిశ్శబ్ధ ఘడియలో
నా హృదయ ఖాళీ పాత్రను ముంచాను.
నీ ప్రేమతో అది నిండింది, ప్రభూ.

247
'నిన్నే గానం చేస్తూ పూజించటమెలా?"
సూర్యుని అడిగింది ఓ చిన్ని పూవు.
'స్వచ్ఛమైన నీ నిశ్శబ్దం ద్వారా"
బదులిచ్చాడు సూర్యుడు.

ఇంతకంటే సరళమైన ఆధ్యాత్మిక మార్గాన్ని మనకు ఎవరు చూపించగలరు! ప్రభువు ప్రేమను పొందడానికి నిశ్శబ్ద స్మరణకి మించిన మార్గం లేదంటున్నాడు. భగవద్గీత గురించి ఓషో ఇలా అంటాడు "గీత చదివిన ప్రతిసారీ మనం భూమిమీద కాకుండా ఏవో దివ్యలోకాలలో ఉన్న అనుభూతిని పొందుతాము. ఎందుకంటే గీత ఆ లోకాలకి సంబంధించినది!" సరిగ్గా అలాంటి పారవశ్యమే మనకు రవీంద్రుడు ఈశ్వరునిపై రాసిన కవితలు చదువుతున్నప్పుడు కూడా కలుగుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

గుప్పెడు అక్షరాలతో భావారణ్యాన్ని సృష్టించడం అంటే ఏమిటో ఈ కింది, రెండులైన్ల చిన్న చిన్న కవితలు చదివితే తెలుస్తుంది. కవితకి తగిన వస్తువు. వస్తువుకి తగిన కల్పన. ఉదాత్త కవిత్వ లక్షణాలన్నీ ఈ కవితల్లో ఉన్నాయి. వీటిలోని మాధుర్యాన్ని తగినరీతిలో ఆస్వాదించగలుగుతున్నాము అంటే బాబా గారి అనువాద పటిమ వల్లనే! హైకూ ఛాయలు కొంచెం ఎక్కువగా కనిపించే వీటిని చదువుతుంటే సమయాన్ని స్థంభింపజేయడం అంటే ఏమిటో అనుభవమౌతుంది!

22
నేనున్నాను అనుకోవటం
ఒక నిరంతరమైన అద్భుతం
అదే జీవితం.
24
శ్రమకు విశ్రాంతి
కంటికి రెప్పలా ఉంటుంది.
118
స్వప్నం మాట్లాడే భార్య
నిద్ర మౌనంగా భరించే భర్త
157
రహస్యంగా పూలను పుష్పించే రాత్రి
మెచ్చుకోళ్లను పగలుకు వదిలేస్తుంది.
262
ఈ గలగలలాడే ఆకులు, నా హృదయాన్ని
చిన్నారి శిశువు చేతివేళ్లలా స్పృశిస్తున్నాయి.

కవితా వస్తువు ఏదైనా టాగోర్ కవితల్లో అధికార స్వరం ఉండదు. రణగొణ ధ్వనులు ఉండవు. హృదయాన్ని ఆవిష్కరించే సున్నితత్వం ఉంటుంది. గానంలో లీనమైన ధ్యానం ఉంది. బాబా గారి కలం కూడా ఆ సున్నితత్వాన్ని బహు జాగ్రత్తగా అందిపుచ్చుకుంది! బాబా గారి పదాల్లో టాగోర్ ప్రతిస్పందించిన వ్యవస్థలన్నీ మనకు సజీవమై సాక్షాత్కరిస్తాయి. అందుకే ఆయన అనువాదకుడి కంటే ఉన్నత పాత్రనేదో పోషించారనిపిస్తుంది! విశ్వకవిగా టాగోర్ లో జీవన వాస్తవికతను చిత్రించే నైపుణ్యంతో పాటు అంతఃలోక వీక్షణ, నూతన దృష్టి, ఉత్తమాభిరుచితో కూడిన

భావుకత కనబడతాయి. అందుకే ఆయన రచనలన్నీ విభిన్న పరిస్థితులకి తట్టుకుని నిలబడగలిగాయి.
భావకవి టాగోర్ మస్తిష్కంలో రూపుదిద్దుకున్న 'Stray Birds' లో కొన్ని మనస్సుని స్పర్శిస్తాయి. మరికొన్ని కొత్త దృష్టిని పరిచయం చేస్తాయి. ఇంకొన్ని అంతర్లోకాలకు ప్రయాణం చేయిస్తాయి. కవితలన్నీ పూర్తయ్యేసరికి మనకు తెలీకుండానే ఆలోచనాస్థాయి పెరగడం గమనిస్తాము. ఈ సంకలనంలోని కవితా సౌందర్యాన్ని తెలుగులో తేటతెల్లం చేసేందుకు సంకల్పించి, కృషి చేసిన బాబా గారికి ప్రత్యేక శుభాభినందనలు.

– నిషిగంధ

(పొద్దు పత్రికలో విశ్వకవి రవీంద్రుని స్ట్రే బర్డ్స్ కు తెలుగు అనువాదంపై
నిషిగంధగారు వ్రాసిన సమీక్ష)

# ఆకుపచ్చని తడిగీతం పై ఒక స్పందన

శ్రీ పి.ఆర్. ఎల్. స్వామి

శ్రీ పి.ఆర్. ఎల్. స్వామి గారు యానాం కు చెందిన ప్రముఖ కవి. పాండిచేరీ ప్రభుత్వం కళాకారులకు ఇచ్చే కలైమామణి" బిరుదాంకితులు.వృత్తిరీత్యా ఉపాధ్యాయులు. వీరి కవిత్వం సరళంగా జీవితంలోని భిన్నపార్శ్వాలను తాకుతూ అలరింప చేస్తుంది . ఆధునిక, ప్రాచీన కవిత్వ ధారణ వీరి ప్రత్యేకత. ప్రముఖ కవుల కవితలను అనర్ఘళంగా గానం చేస్తూ అనేక ప్రదర్శనలను ఇచ్చారు. పలువురి ప్రశంసలు పొందారు.

నా కవితా సంకలనాన్ని చదివి మెచ్చుకొంటూ వారు వ్రాసి ఇచ్చిన కొన్ని వాక్యాలు ఇవి. వీటిలోని దాదాపు అన్ని పదాలు నా కవితా శీర్షికలైనప్పటికీ, దీనిని విడిగ చదివినా ఒక కవితలాగ అనిపించటం వీరి ప్రతిభకు నిదర్శనంగా, నా కవిత్వానికి లభించిన గౌరవంలా నేను భావిస్తున్నాను.

★★★

తడి గీతం మీద పొడి సంతకం

మిత్రుడు......
సహృదయుడు....
బొల్లోజు బాబా వెన్నెల నావనెక్కి
ఆకుపచ్చని తడిగీతాన్ని శిల్పంలా చెక్కాడు
ఆ శబ్దానికి రాలిన పూలు
సుగంధాలను గానం చేస్తున్నాయి
కవికి అపరిచిత ప్రపంచంలో
బతకడం ఇష్టం ఉండదు.
అందుకే మట్టికనుల పల్లెతో
నిరంతరం కరచాలనం చేస్తూంటాడు.
ఇన్నాళ్ళూ తనలో దాచుకున్న అనేకానేక
రహస్యాలతో పొగడ చెట్టుమీద
వెన్నెల పిట్టలా కాగితాలమీద వాలాడు.

అతని అక్షరాల సంగీతమేఘం
తేనెపాటాల్ని వర్షిస్తోంది.
అతని వాక్యాల వసంతపు మొగ్గలు
పువ్వులుగా బద్దలవుతున్నాయి.
ఖాళీ రాత్రులలోంచి ఉదయించే జ్ఞాపకాలన్నీ
హాయిగా సలపడం కోసం
బాబా జీవితాన్ని పుటలు పుటలు గా పరిచాడు
అతడికి ఒకే ఒక ఆశ
పుస్తకంలోకి నడవటం
ప్రతివేకువ జామున ముళ్లగాయాలను
స్పర్శిస్తూంటాడు.
కాంక్షాతీరా వెతుకులాటలో అతడి నిరీక్షణ
ఆకాశంలోకి తెరుచుకుంటుంది.

అతని గుండెలో
సుళ్లు తిరిగే కన్నీళ్లని, ఆశల్ని, ఆవేశాల్ని
కలల తెరపై చిత్రించుకుంటాడు.
కవి "సాహితీయానాన్ని"
గాలి, చెట్టు,పిట్టా
నిత్యం శ్రుతి చేస్తూనే ఉంటాయి.
పోలవరం నిర్వాసితులకోసం
జీవనసౌందర్యాన్నే నిర్మించగల
ఈ కవి హృదయం
ఒక సూర్యుడు
ఒక నది.

కలైమామణి పి.ఆర్.ఎల్. స్వామి
JANUARY 3, 2010

# కౌముది పత్రికలో - స్ట్రే బర్డ్స్ సమీక్షా వ్యాసం

కౌముది పత్రికలో ప్రచురించబడిన స్ట్రే బర్డ్స్ సమీక్షా వ్యాసం ఇది. ఎడిటర్ గారికి ధన్యవాదములు.

విశ్వకవి రవీంద్రుని పేరు వినగానే "గీతాంజలి" కవితాత్మ మనసంతా కమ్ముకుంటుంది. విశ్వకవి కలంనుంచీ వెలువడిన మినీ కవితల సంపుటి Stray Birds: -(మినీ కవిత అనే పదాన్ని సమకాలీన సాహిత్య ధోరణుల దృష్ట్యానే అన్వయించుకోవాలి) ఇందులో అన్నీ ఒకటి రెండు వాక్యాల కవితలే. ప్రకృతీ, స్నేహం, ఆశావాదం, మనిషి తనం, మనసులో మెదిలే వివిధ భావాలూ, ఎన్నింటినో స్పృశిస్తాయి ఈ కవితలు. కవితా పంక్తులు చిన్నవే ఐనా ఒక్కో వాక్యంలోని అర్థం,

గుండెలోతుల్ని సూటిగా తాకే భావం మనల్ని పదే పదే వెంటాడుతాయి బెంగాలీలో వ్రాసిన తన కవితలని రవీంద్రనాధ్ టాగోర్ గారే స్వయంగా ఆంగ్లంలోకి అనువాదం చేసారు. ఆంగ్లవాక్యాల పరిమళాలని ఆస్వాదిస్తుంటే మాతృకలోని మాధుర్యం ఏమాత్రం తీసిపోలేదు అనిపిస్తుంది. ఈ అద్భుతమైన కవితల్ని అంతే సుందరంగానూ తెలుగులోకి అనువదించారు బొల్లోజు బాబా గారు.

కవిత్వాన్ని అనువదించటం అంటే చాలా పెద్ద సాహసమే. వచనాన్ని అనువదించటంలో చాలా సౌలభ్యం ఉంటుంది. వివరణకోసం ఒకటి రెండు వాక్యాలు ఎక్కువ వ్రాసినా ఫరవాలేదు. కానీ కవిత్వంలో అలా కాదు. మూలంలోని అర్థం ఏమాత్రం మారకుండా పదాల పొందిక సాగడమే కాక కవిత నడక కూడా చెదరకూడదు. ఈ విషయంలో బొల్లోజు బాబా గారు నూటికి నూరు శాతం విజయం సాధించారని చెప్పవచ్చు. ఇటీవలి కాలంలో సొంతగొంతుకతో చక్కటి చిక్కటి కవిత్వం వ్రాస్తున్న బాబా గారు, అంత గాఢమైన కవిత్వాన్ని ఈ అనువాద కవితా చరణాల్లో పొదిగారు. మచ్చుకి కొన్ని ...

నా హృదయ శిశిర దినాలపై
నీ సూర్యోదయం నవ్వులు చిందిస్తోంది
నా వసంతాగమనం పట్ల రవంత
అనుమానం లేకుండా.

సూర్యుని కోల్పోయినందుకు కన్నీరు రాల్చుకొంటే
నక్షత్రాలను కూడా చేజార్చుకోవల్సి వస్తుంది.

300 కు పైగా సాగిన ఈ కవితలు కేవలం చదువుకొని మరిచిపోలేము. వెంటనే ఎవరికైనా చదివి వినిపించాలనిపిస్తుంది. 31 పేజీల ఈ పుస్తకాన్ని అందరికీ అందుబాటులో ఉండే ఇ.పుస్తకంలా scribd.com లో ఉచితంగా ఉంచారు. కేవలం కవిత్వాన్ని ప్రేమించేవారు మాత్రమే కాక మంచి భావాలని అందమైన తెలుగులో చూడాలనుకున్న వారందరూ చదవాల్సిన పుస్తకం.

కౌముది అంతర్జాల పత్రిక

# కవిత్వభాష వింటూ

శ్రీ రెంటాల శ్రీవెంకటేశ్వర రావు

(కవిత్వ భాష పుస్తకానికి వ్రాసిన ముందుమాట)




బొల్లోజు బాబా కవి. కవిత్వానువాదకులు కూడా. ఆ పదాలకు మంచి అనే విశేషణం చేర్చడానికి మొహమాట పడక్కర్లేదు. 'వెలుతురు తెర' చదివాక ఆయన అభిమానినయ్యాను. ఆయన విశ్లేషణ వ్యాసాలు కూడా రాస్తున్నట్టు తెలుసుగాని పెద్దగా చదవడం పడలేదు.

ఆ మధ్య పుష్పరాజ్‌గారని ఒక సాహిత్యమిత్రుడితో మాట్లాడుతున్న సందర్భంలో 'బొల్లోజు బాబా ఎవరండీ?'అని అడిగారాయన. ఎందుకొచ్చిందీ ఆ ప్రశ్న?' అని నేను ఎదురడిగాను. ఫేస్‌బుక్‌లో వారి రచనలు చదవడం మొదలుపెట్టి నిన్న రాత్రి పన్నెండింటి వరకూ మేలుకొని ఉండిపోయాను. బాగా రాస్తున్నారు' అన్నారు. ఇటువంటివి గుప్త అవార్డులు. పునాదులా ఉంటాయి. భవనాల్లా పైకి కనబడకుండా. ఆ సందర్భంగా ఆయన విమర్శ వ్యాసాలు కూడా రాస్తున్నారని, బాగా రాస్తున్నారని నాకు అర్థమైంది.

ఇప్పుడు 'కవిత్వ భాష' అని ఈ పుస్తకంతో మన ముందుకు వస్తున్నారు. దీనికి అలంకార దర్శనం అనో, కవిత్వ అభివ్యక్తి పద్ధతులు అనో ఒక 'గాఢ నామం' తగిలించక కవిత్వభాష అని పేరు పెట్టారు పొందికగా. బాబాగారిని చూస్తున్నాను కదా ఆయన అన్ని పనులలోనూ ఈ పొందిక, క్లుప్తత కనిపిస్తాయి.

ఇటువంటి వాటిని ఆధునిక అలంకార శాస్త్ర పుస్తకాలు అనాలి. ఈ మాట అతిశయోక్తిగా అనిపిస్తుంది కానీకాదు. సులక్షణ సారం వంటి పుస్తకాలు కొత్త విషయాలు ఏమీ ప్రతిపాదించకుండా అంతకు ముందు

చెప్పిన ఛందోది విషయాలను ఒక చోట చేర్చి చెప్పి అంత మాత్రానే అలంకార శాస్త్ర గ్రంథాలు అనబడుతున్నప్పుడు దీన్ని అనడంలో తప్పులేదు అయితే ఒక తేడా ఉంది. అవి నిర్దేశాత్మకాలు ఇది వివరణాత్మకం. ఆధునిక శాస్త్రాలన్నీ డిస్క్రిప్టివ్‌గానే ఉంటున్నాయి.

ఇలాంటి పుస్తకాలు రెండు రకాలుగా తయారవుతాయి. రచయిత తనకు అప్పటికే బాగా తెలిసిన విషయాలను పాఠకులతో పంచుకోవడానికి రాయడం ఒకటో రకం. తాను తెలుసుకోవడానికి, తెలుసుకుని జీర్ణం చేసు కోవడానికి ప్రయత్నించే క్రమంలో రాయడం రెండో రకం. ఇది రెండో రకం రచన అని నాకు అనిపించింది. సాధారణంగా ఈ రెండో రకం రాత ల్లో కొంత అస్పష్టత ఉంటుంది. కానీ ఈ పుస్తకంలో ఆ లక్షణం లేదు. పొ రపాటు పడిన సందర్భాలున్నాయి తప్ప అస్పష్టత లేదు.

బాబాగారు పాశ్చాత్య అలంకార శాస్త్రం నుంచి కొన్ని అలంకారాల ను అభివ్యక్తి పద్ధతులను తీసుకుని సోదాహరణంగా వివరించారు. ఇటువం టి రచనల్లో ఒక క్లేశం ఉంటుంది. తగిన ఉదాహరణలను ఎన్నుకోవడం అంత తేలిక కాదు. కొన్ని సందర్భాలలో ఆయన ఇచ్చిన ఉదాహరణలు చూ శాక ఆ అవగాహనలోని ఖచ్చితత్వానికి (ప్రెసిషన్‌కి )నాకు ముచ్చటేసింది. ఆయన పఠన వైశాల్యానికి కూడా ముచ్చట పడ్డాను. చాలామంది కవుల్ని కోట్ చేశారు. విస్తృతంగా చదువుతున్నారు బాబాగారు.

ఈ అలంకార విశ్లేషణతో వదిలిపెట్టక ఆయన మరి కొన్ని విషయా లను ముచ్చటించారు. లినియేషన్ అని ఒకటి. వచనకవితలో పాదవిభజన ఎలా ఉండాలి అన్నది చర్చించారు ఒక వ్యాసంలో.

'కవిత్వంలో నిరలంకారత' అనే వ్యాసం నన్ను ప్రత్యేకించి ఆకట్టుకుం ది. ఏ అలంకారాలూ లేకుండా కవిత్వం రాయొచ్చు అని గమనింప చెయ్య డం బావుంది. ఈ నిరలంకారత 'ఒక ప్రమాద కరమైన పొలిమేర' అని బాగా చెప్పారు. కానీ మంచి కవి చేరి తీరాల్సిన ప్రదేశం కూడా అది.

బాబాగారి ఇటువంటి కొన్నివాక్యాలు మనని ఆకర్షిస్తాయి. 'మానవ జాతికి రెండు చరిత్రలుంటాయి. ఒకటి యుద్ధాలతో తారీఖులతో రాజకీయా లతోను మరొకటి సాంస్కృతిక భావాలతోను నిండి ఉంటాయి. రెండో దాన్ని కవులు రచయితలు నిర్మిస్తారు' అన్నారొక చోట. మంచి గమనింపు.

అలాగే రచనభాషకి అలంకారాలు ఎందుకు అవసరం అవుతాయో చెబుతూ ఉచ్చరించే వేళ పదాలకి ఉచ్చారణ, స్వర విశేషాలవల్ల జతపడే ఉద్వేగాలు లిఖిత రూపంలో కనబడవు కాబట్టి కూడా అలంకారం అవసరం అవుతుంది అని ఒక కారణం చెప్పారు. ఇది కూడా మంచి గమనింపు.

కొప్పర్తి చిత్రలిపి అని ఒక మంచికవిత రాశారు. దాన్ని ఉదాహరిస్తూ 'తెలుపుకూ నలుపుకూ తేడా లేకుండా పోతుంది' అన్న చివరి వాక్యాన్ని ఇలా వ్యాఖ్యానించారు బాబా. 'తెలుపుకు నలుపుకు తేడా లేకపోవడం అంటే బ్రిటిష్ పాలనకు,స్వపరిపాలనకు తేడా లేదని అదే దోపిడీ, అదే అవినీతి, అదే అణచివేత ఇంకా కొనసాగుతున్నా యని చెప్పటం' అని. ఆ కవిత చదివినప్పుడు నాకు ఈ విషయం ఎందుకో తట్టనే లేదు.

ఈ గ్రంథంలో నేను విభేదించే విషయాలు కొన్ని ఉన్నాయి. ఇటువంటి పుస్తకం నేను రాసినా ఇతరులు –ఎవరో ఎందుకు బాబాగారే –నావి కొన్ని పొరపాట్లని తేల్చవచ్చు. అంటే ఈ రచనల స్వభావం అటువంటిది. అయినప్పటికీ ఈ ముందుమాటలో కొంత చోటు వాటిలో కొన్నిటి కోసం కేటాయించడం అనుచితం కాదనీ పైగా అవసరమనీ భావించి ఇక్కడ ప్రస్తావిస్తున్నాను. ఎందుకంటే ఊరికే ఆమోదించేయడం కాకుండా ఈ పుస్తకాన్ని పాఠకులు క్రిటికల్‌గా చదువుతారని.ఆ వంకన సాహిత్యవిమర్శా నిఘంటువు నొకదాన్ని తెరిచి చూస్తారని. అసలు ఈ పారిభాషికపదాలన్నీ ఖచ్చితమైన సరిహద్దురేఖలు గియ్యడానికి కాదు. కొన్ని భావనలను గుర్తింప చెయ్యడానికి అని నేను అనుకుంటాను. తద్వారా కవులకు రచన వేళ కొన్ని అభివ్యక్తి వ్యూహాలు స్ఫురించేటట్టు చేస్తాయి ఇవి.

కవిత్వంలో స్టేట్ మెంట్స్ అని ఒక వ్యాసం. అందులో అతిశయోక్తిని అండర్ స్టేట్‌మెంటుని తీసుకుని వివరించారు. అండర్‌స్టేట్‌మెంట్ అన్నది బాబాగారికి సరిగా అవగతం కాలేదని నాకు అనిపించింది. 'రాయినైనా కాక పోతిని రామపాదము సోకగా, బోయనైనా కాకపోతిని పుణ్య చరితము పాడగా' అనే పాటలో అండర్ స్టేట్‌మెంటు ఉందంటారు. ఎందుకనిట. ఆ స్త్రీ తనని రాయి బోయ వంటి 'కింది' స్థాయి వస్తువులతో వ్యక్తులతో పోల్చుకున్నందువల్లనట. అండర్ స్టేట్‌మెంటు లక్షణం అదికాదు. అండర్ స్టేట్‌మెంట్ అంటే 60 డిగ్రీల ఉష్ణోగ్రత ఉన్న ఎడారిలో ఉండి 'ఇవాళ కొంచెం వెచ్చగా ఉంది' అనడం లాంటిది. ఉన్న స్థితిని తగ్గించి చెప్పడం అది మంచికానీ చెడు కానీ . అతిశయోక్తికి సరిగ్గా వ్యతిరేకం అంటే ఇలా.

ఫ్రి ఓన్డ్ కార్స్ అనే మాటలో ఉన్నది అండర్‌స్టేట్ మెంట్ కాదు. సెకండ్ హాండ్ కార్స్ అనడంలో ఉన్న తక్కువదనాన్ని తొలగించి కాస్త మర్యాదగా చెప్పడం ఉంది. యూఫిమిజం అంటామే అది ఉంది.

82 వ పేజీలో ఐరనీకిచ్చిన ఉదాహరణ సరైనది కాదు. చంద్రునిలో మచ్చలున్నాయి కనుక సరిపోయింది. లేకపోతే ప్రతి ఒక్కడూ ఆమె ముఖాన్ని చంద్రబింబంతో పోల్చేవారే అనే వాక్యాలలో ఐరనీ లేదు. వెర్బల్ ఐరనీ అంటే ఉద్దేశించిన అర్థానికి వ్యతిరేకమైన అర్థాన్నిచ్చే పదాలు వాడడం. బుద్ధిహీనుణ్ణి పట్టుకుని బృహస్పతి అన్నట్టు. ఇటువంటి తేడాలు ఇంకా కొన్ని ఉన్నాయి.

అనువాద సాహిత్యం అనే వ్యాసం ఈ పుస్తకంలో ఇముడదు. బాబా కవిత్వానువాదం కూడా రాసిన వారు కనక అనువాదంమీద ఉన్న ప్రత్యేక ప్రీతి కొద్దీ దీన్ని చేర్చి ఉంటారు. కవిత్వేతర అనువాదాల ప్రసక్తి ఎక్కువ కావడం వల్ల ఇక్కడ అనవసరం అంటున్నాను. కవిత్వానువాదంలో భాష రీత్యా వ్యక్తీకరణ రీత్యా వచ్చిపడే సమస్యల్ని వాటి పరిష్కరణ రీతుల్ని – తన అనువాద రచనానుభవజన్యమైన విషయాలతో చర్చించి ఉంటే బావుండేది.

ఏదో ఒక్కలోపమయినా లేని రచన ఏదీ ఉండదు.ఏ పనయినా నిర్దుష్టత వల్ల కాక గుణ బాహుళ్యం వల్ల మంచిదనిపించుకుంటుంది.కాబట్టి ఇది అభినందించదగ్గ మంచి ప్రయత్నం.

# నవ్య నవనీత విమర్శ

– ఆర్. సీతారాం

(కవిత్వ భాష పుస్తకానికి వ్రాసిన ముందుమాట)

'కవిత్వం భాష యొక్క భాష' అని వేగుంట మోహన ప్రసాద్ అంటారు. బొల్లోజు బాబా 'కవిత్వ భాష' అంటున్నాడు. మొదటిది కవిగా మో కవిత్వానికిచ్చిన నిర్వచనం. రెండోది విమర్శకుడిగా లేదా పరిశీలకుడిలా కాదంటే సహృదయ పాఠకుడిలా 'కవిత్వ భాష' ఎట్లా ఉంటుంది? ఏది కవిత్వ భాష, ఎందుకు కవిత్వ భాష సాధారణ భాషకాంటే భిన్నంగా ఉంటుంది? ఇంకా ఇట్లాంటి ప్రశ్నలకు సమాధానం లాంటి వివరణ ఈ వ్యాస సంపుటిలోని వ్యాసాలలో కనిపిస్తుంది.

నిజాయితీతో కూడిన విమర్శ, సున్నితమైన ప్రశంస కవి మీదకంటే కవిత్వం పైనే దృష్టి నిలుపుతుందని టి.ఎస్. ఇలియట్ అన్నట్లుగా విమర్శకులు పేర్కొంటూ ఉంటారు. బాబా వ్యాసాలలో ఈ రెండూ కనిపిస్తాయి. సాహిత్యానికి కూడా ఒక ethical reader అవసరం ఉంటుంది. మరి ethical reading ని promote చేయటం ఎట్లా ... ఇటువంటి సందేహాలు ఏవో బాబా మనసును తొలిచి ఉంటాయి. ప్రస్తుతం మన కేంద్ర ఎన్నికల సంఘం ఏ విధంగానైతే ethical voting గురించి ఎంతో చక్కగా ప్రచారం చేస్తున్నదో మనకు తెలుసు. ఎటువంటి ప్రలోభాలకు, ప్రభావాలకు లొంగకుండా ప్రజాస్వామ్యాన్ని కాపాడేందుకో, పరి రక్షించేందుకో ప్రతిపౌరుడు బాధ్యతాయుతంగా ఓటు వేయాలి అని చెపుతున్నట్లుగానే, ప్రతి పాఠకుడు తన పాఠకస్వామ్యాన్ని లేదా వాచక స్వామ్యాన్ని కాపాడుకునేందుకు బాధ్యతాయుత పఠనం అవసరం అని బాబా భావిస్తున్నాడనలేం గానీ, ఈ వ్యాసాలు చదివాక కవిత్వం చదవడానికి, కవిత్వాన్ని ఆస్వాదించడానికి కొంత ప్రాధమిక జ్ఞానం పాఠకుడికి అవసరమవుతుందని పాఠకుడే తెలుసు కుంటాడు.

పాఠకోపకారిగా బాబా వ్యాసాలు ఎంతో మేలు చేస్తున్నాయి. పాఠకుడికి ఇంద్రియ నైశిత్యం పెరగడానికి ఇవి దోహదం చేస్తాయి. అయితే బాబా వీటిని నెటిజన్ పాఠకుల సౌకర్యార్థం వెలువరించినా ఇవి నెటిజనేతర పామర సిటి జనులకు బహుధా లబ్దిని చేకూర్చి పెడతాయి అనడంలో సందేహించాల్సిందేమీ లేదు. పాఠకుడు నిశితంగా, సున్నితంగా, నిజాయితీగా పఠించడానికి కావలసిన భావ భూమికను ఇవి అందించగలుగుతున్నాయి. ఈ ప్రయత్నం హర్షణీయం, అభినందనీయం అని అనాలని ఉంది కానీ, కొందరికిది హర్షణీయం కాకపోవచ్చు. ఆక్షేపణీయం

కూడా కావొచ్చు. ఏందుకంటే బాబా ఈ వ్యాసాలలో ఇచ్చిన సమాచారం, జ్ఞానం , అవగాహన, వివరణ, విశ్లేషణల కంటే మెరుగైన సాహిత్య పఠన జ్ఞానశీలావగాహనలు పుష్కలంగా కలవారు కూడా ఉండి ఉండవచ్చు. అట్లాంటి వారి కంటికివి ఆనకపోనూ వచ్చు. ఆ దృష్ట్యా బొల్లోజు బాబా ఒక విధేయ ప్రయత్నం చేసాడని, అందులో కృతార్థుడయ్యాడని కూడా మనకు అర్ధమవుతుంది. ఇట్లాంటి ప్రయత్నాలు బహుముఖంగా, బహుళంగా, బహు పార్శ్వాలనుండి బహుళజన సందోహాలనుండి ఎంత విరివిగా వస్తే అంతగా సాహిత్యానికి మేలో కీడో తప్పకుండా జరుగుతుంది.

కవితలో కనిపించే లేదా వ్యక్తమయ్యే ఉద్వేగం కొన్ని సందర్భాలలో అందరికీ దొరకదు. అందరూ సమానంగా దానిని అందుకోనూ లేరు. దానికి అనేక కారణాలు ఉండి ఉండవచ్చు. నిజానికి అందిన మేరకు కవిత్వోద్వేగాన్ని పఠితలు ప్రశంసించాలి తప్ప కవి వ్యక్తిగత చరిత్రను కాదని పలు సందర్భాలలో ఎంతో మంది విమర్శకులు తెలిపి ఉన్నారు. అందుకే కవుల వ్యక్తిగత విషయాలలోకి తొంగి చూడకుండా 'కవిత్వ భాష'ను ఎంచుకొని కవిత్వంలోకే తొంగిచూస్తున్నాడు. 'కవిత్వ భాష'గా పేరు పెట్టినప్పటికీ వీటిలో భాషగురించి మాత్రమే వివరించలేదు. బాబా కు కవిగా కొన్ని నిశ్చిత సంవేదనలున్నాయి. పాఠకుడిగా కొన్ని ప్రతి స్పందనలున్నాయి. విశ్లేషకుడిగా కొన్ని అభిప్రాయాలు, ఆలోచనలు ఉన్నాయి. ఇవన్నీ ఆయా సందర్భాలను బట్టి వీటిల్లో క్రమానుగతంగా ప్రకటితమయ్యాయి.

సాహిత్య లేదా కవిత్వ విమర్శ సాహిత్యం లేదా కవిత్వంలోని కళాత్మకతను విశదీకరించడంతో పాటుగా సాహిత్యాభిరుచిని సరిదిద్దటం అనే ప్రాతిపదిక మీద ఏదో ఒక మేరకైనా నడుస్తూ ఉంటుంది. అర్ధం చేసుకోవటం, ఆస్వాదించటాన్ని ప్రోత్సహించటమే ప్రాతిపదికగా కూడా కొంతకాలం కొనసాగింది. తెలుగు కవితారంగంలో అన్నీ కలగలుపుగానే కొనసాగుతూ కనిపిస్తాయి. ఏది ఎక్కడ స్పష్టంగా అంతమై కొత్తది వచ్చి చేరిందో తేల్చి చెప్పటం కొంచెం కష్టమైన పని. వివిధ వాదాలు, ఉద్యమాలు, ధోరణులు, సిద్ధాంత, దృక్పథాలకు సంబంధించి కొంత స్పష్టత ఉంటుందేమో కాని, మిగతా విషయాలకు సంబంధించి ఏదీ విస్పష్టంగా చెప్పటానికి లేదు. బాబా ఈ గొడవలోకి తలదూర్చాడని అనలేంఈ దూర్చలేదనీ చెప్పలేం. ఈ కవిత్వాన్ని ఆస్వాదించడానికి, ప్రశంసించడానికి అవసరమైన కనీస అవగాహనను, విమర్శ అందించాలనే ఆకాంక్ష ఉంది కనుక ఇంత వొద్దికగా ఈ వ్యాసాలు రాసాడు.

ఈ పనిని సమర్థంగా చేసే క్రమంలో నవ్య విమర్శ, ప్రాక్టికల్ క్రిటిసిజం, నిర్మాణవాద విమర్శ, భాషా శాస్త్రం-విమర్శ, పాఠక ప్రతిక్రియ, పోస్ట్ మాడర్నిజం, భారతీయ కావ్య సౌందర్య శాస్త్ర పరిచయం తదితరాలను ఒక క్రమ పద్ధతిలో తన అవసరం మేరకు అధ్యయనం చేసి, అవి అందించిన పనిముట్లను, పరికరాలను, పరిభాషను తెలుగు కవిత్వానికి అను ప్రయుక్త పరిచే ప్రయత్నం చేసాడు. తన లక్ష్య

ం ఆంగ్ల సాహిత్య విమర్శ వికాస పురోగతిని ప్రస్తావన కాదు కనుక తన పరిధి, పరిమితులను గుర్తెరిగి ఆయా విషయాలను తగురీతిలో ప్రస్తావించాడు.

'కవిత్వ భాష అర్థాంతర స్ఫూర్తినిస్తుంది' అని అంటాడు బాబా. ఈ అర్థాంతర స్ఫూర్తిని దీప్తి మంతం, తేజోవంతం చేసేవాటిని ట్రోప్ అంటారని, ఆంగ్ల విమర్శకులు ట్రోప్స్‌గా పేర్కొన్న కొన్ని విషయాలు, మన కావ్యాలంకార శాస్త్రంలోనూ ప్రసక్తమై ఉన్నాయని, ఈ రెంటి మధ్య సామ్య భేదాలను కొంతమేరకు సంగ్రహించి ఇమేజరీ నుంచి సంస్కృత అలంకారాలు VSఇంగ్లీషు ట్రోప్స్ వరకు తన అవగాహనను వివరిస్తూ విశ్లేషణ చేశాడు బాబా. ఈ వ్యాసాలు కవిత్వ పాఠకులు శ్రద్ధగా చదివితే వారికొక సాధికారత వస్తుంది. ఇట్లాంటివి పఠితల సామర్థ్యాలను పెంపొందిస్తాయి.

మనమెందుకో కవిత్వ భాష అనడంలో వెసులుబాటు చూసుకున్నాం కాని, నవ్య విమర్శకు పాదులు తీసిన ఐ.ఏ. రిచర్డ్స్ వాడిన మాటల్లో ఎక్కడా 'Poetic' అని కనిపించదు. 'emotive' Language
అంటాడు. అలాగే రిచర్డ్స్ అర్థం విషయంలో 'denotative', 'connotative' అనే విభజన కూడా చేశాడు.

ఈ మాటలకు సాధారణార్థం/నైఘంటికార్థం గాను, రెండవదానికి విశేషార్థం /లక్ష్యా ర్థం గానూ అనువదించుకోవచ్చు. ఈ లక్ష్యా ర్థ సిద్ధి కోసమే కవులు విరివిగా ట్రోప్స్‌ను ఉపయోగిస్తారు. ఉపమా రూపకాది అలంకారాలతో పాటుగా ఇంకా ఎన్నో రకాల కవిత్వ వ్యక్తీకరణ సాధనాలు, అభివ్యక్తి రూపాలు వచ్చాయి. బొల్లోజు బాబా ఈ Tropesఏయే ప్రకార్యాలను నిర్వర్తిస్తూ వచ్చాయో విశ్లేషణాత్మకంగా చెప్పు ప్రయత్నం చేశారు. మెటాఫర్ ను ఆయన సర్వాంతర్యామి సూత్రంగా భాష గూర్చి పేర్కొంటాడు. మెటాఫర్‌ను కేవలం అలంకారంగా మాత్రమే చూడొద్దని తెలుగు కవులలో మో ఎన్నోసార్లు పేర్కొన్నారు. బొల్లోజు పేర్కొన్నవి ఏవీ అలంకార మాత్రాలు కావు. భాషా స్వభావంలోనే ఇవి ఇమిడి ఉన్నాయి. కవి తన భావనా శక్తి ద్వారా వీటిని విశిష్టంగా ఆవిష్కరిస్తాడు. ఈ వ్యాసాలు అట్లా ఆవిష్కృతమైన భావోద్వేగాల సందర్భాలను కవిత్వభాష ఇదీ అని చూపుతున్నారు.

బాబా ఈ వ్యాసాలలో స్టేట్‌మెంట్స్ మీదా కూడా చక్కని వ్యాసం సమకూర్చాడు. భాషను ఉద్వేగపూరితంగా ప్రయోగించే క్రమంలోనే ఒక distortion జరుగుతుంది. కవిత్వంలో ఇటువంటి distortions అనేకం ఉంటాయి. ప్రతి కవిత్మాక ప్రకటన కూడా ఒక Pseudo-Statement
అవుతుంది. కవిత్వం ఒక కపట ప్రకటనే తప్ప, అబద్ధపు లేదా తప్పుడు ప్రకటన ఏంతమాత్రమూ కాదు.

ఎంతో విస్తృతీ, అర్థ, భావ గాంభీర్యమూ గల పలు విషయాలను ఈ కవిత
ా హృదయుడు సద సద్వివేకముతో, సహృదయ సంభరితంగా నేను కొన్ని సంగతుల
ు తెలపగలుగుతున్నాననే ఆనందంతో విశదమవుతున్నాడు. నిజమైన సాహిత్య ఆశ
క్తి అంటే మనిషి, సమాజం, నాగరికత పట్ల ఆసక్తిని కలిగి ఉండటం. ఆటువంటి ఆ
సక్తిని అభిరుచిని ఈ వ్యాసాలు పెంపొందింపచేస్తాయి. నవ్య విమర్శకులు తమ
పూర్తి దృష్టిని కవిత్వ భాషమీదనే నిలిపి ఉంచుతారు. భాష, నిర్మాణం, అర్థం మొద
లైన వాటిలో నవ్య విమర్శ తొణికిసలాడుతూ ఉంటుంది. క్లెయాంత్ బ్రూక్స్, రాబర్ట్
పెన్ వారెన్, అలెన్ టీటో, జాన్ క్రొవె రాన్సమ్, విలియం ఎంప్సన్, ఆర్పి బ్లాక్వ
ఌర్, విలియమ్ కె విమ్సాటోలు ముఖ్యులు. వీరిలో బ్రూక్స్ కి 'పారడాక్స్', అలెన్
టీటో కి 'టెన్షన్', వారెన్ కి 'ఐరనీ', రాన్సమ్ కి 'టెక్చర్', బ్లాక్ మూర్ కి 'జెశ్చర్',
విలియమ్ ఎంప్సన్ కి 'యాంబిగ్యుటి' కొలబద్దలైనట్లుగా ఈ అన్నిటినీ సంలీన పర
చుకొని 'కవిత్వ భాష'ను తను కవిత్వ కొలమానంగా అందిస్తున్నాడు. బాబా కు
హృదయపూర్వక స్వాగతం.

– ఆర్. సీతారాం

# కవిత్వ భాష – పుస్తకంపై ప్రముఖుల అభిప్రాయాలు

**వెంకట కృష్ణ. జి.**

బాబా పూర్తి పేరు విని ఆసక్తి లో పడ్డాను నేను. కవిత్వానికి సంబంధించిన ఒక కార్యక్రమంలో పలమనేరు లో బాలాజీ కలిపాడు మమ్మల్ని. ఆ తర్వాత కొన్ని నెలలకే తన మొదటి కవిత్వ సంపుటి ఆకుపచ్చని తడిగీతం చదివాను. ఆ తర్వాత వారి తండ్రి గారి గురించి తెలిసింది. తండ్రి వారసత్వాన్ని కొనసాగిస్తున్న కుమారుడు, బాబా.

కవి సంగమం మాధ్యమంగా, బ్లాగు ద్వారానూ బాబా త్వరగా యెదిగిన పేరు. ఆ మేరకు కృషి కూడా చేసాడు. ఆ కృషి లో భాగంగా వచ్చిన పుస్తకమే కవిత్వభాష. కవిత్వం లో కవిత్వం మీద కవిత్వం రాయడం చాలా మంది మంచి కవులు చేస్తారు. కవిత్వం గురించి విశ్లేషణో, పరిశీలనో, పరామర్శనో, సమీక్షలో విమర్శకులు చేస్తారు. కవిత్వం గురించిన శిల్పవిశేషాలు విమర్శకుల్లో కూడా చాలా తక్కువ మంది (తెలుగు లో లక్ష్మి నర్సయ్య ప్రముఖంగా) చేసారు. అయితే బాబా కవిత్వం శిల్పాన్ని కవిత్వభాష గా కవిసంగమంలో వ్యాసాలు రాసి పుస్తకంగా తెచ్చాడు.

ఆధునిక తెలుగు సాహిత్యం ఐరోపా భావజాలంతో పూర్తిగా ప్రభావితమైంది. మనం తెలుగు లో కవిత్వం రాసినా, వస్తువు తెలుగు నేలదైనా దాని సారాన్నీ, నిర్మాణచట్రాన్ని నిర్ణయించేది మాత్రం యూరోపియన్ కళా వ్యాకరణమే. తెలుగు భాష లో కవిత్వం రాసేవాళ్లు సంస్కృత వృత్తాల ఛందస్సు నడ్డియిరగ్గొట్టి (తెలిసో తెలియకో) కవిత్వం రాస్తున్నవాళ్లే. అయితే వాళ్లంతా తెలియకనే, ఇంగ్లీషు టెక్నిక్ లను అనుసరిస్తూ కవిత్వం రాస్తున్నారు. ఆ విషయాన్ని బాబా బాగా వివరించారు యీ పుస్తకం లో.

ఇమాజరీ, పెర్సనాఫికేషన్, మెటఫర్, మెటానమీ, సినక్డికి, అల్యూజన్, అలిగొరీ లాంటి కవిత్వపు టెక్నిక్ లు యెలా వుంటాయో సోదాహరణలుగా వివరించారు బాబా. మనం అలంకారాలనేవి ఇంగ్లీషు లో ట్రోప్స్ అంటారు. పైన పేర్కొన్నవన్నీ ట్రోప్స్. మంచి తెలుగు కవి యెవడి కవిత్వం లో నైనా యీ ట్రోప్స్ సహజంగా వచ్చే అవకాశం ఉంది.ఇవేమిటో తెలీకుండానే చాలా మంది కవులు కవిత్వం రాసే వుంటారు. ఈ పుస్తకం లో వాటిని చదివినప్పుడు వాటి గురించిన యెరుక యింకొంచెం స్పష్టమవుతుంది.

కవిత్వ పాఠకులకూ, కవులకూ యీ పుస్తకం వుపయోగపడుతుంది. పాఠకులు తాము చదువుతున్న కవిత్వం లో కవి వాడిన టెక్నిక్ యేమిటో తెలుసుకోవచ్చు. అలాగే కవులు తాము రాసిన, రాస్తున్న కవిత్వంలో టెక్నిక్ ను పరిశీలించుకొని, మెరుగుపరుచుకోవచ్చు.

బాబా యీ పుస్తకం లో చెప్పిన చాలా విషయాలు తాను తెలుసుకుంటూ అప్పటికప్పుడే పాఠకులతోనూ పంచుకున్నాడని అనిపిస్తుంది. అది ఆయన వుత్సాహాన్ని తెలియజేస్తుంది. అలాగే ఆయన నేర్చుకునేతనాన్నీ సూచిస్తుంది. మంచి కవిత్వం రాయడమంటే యేమిటో కొన్ని నిర్వచనాలు కూడా బాబా యీ పుస్తకం లో ప్రస్తావించారు. అందులో కవులు యే భావజాలం కూ ప్రభావితమై వుండకూడదని ఒకటికి రెండు సార్లు చెబుతాడు. ఆ విషయం బాబా యిష్టపడే ఇస్మాయిల్ కవికే తప్పలేదు. ఆయన పకృతి కవిత్వం పేరుతో జపనీస్ హైకూ భావజాలం కల్గివున్నాడు. మెత్తగా కూచొని ధ్యానం చేసుకునే భావజాలం కల్గివుండొచ్చూ, ఈ వ్యవస్థ అస్తవ్యస్తంగా వుంది యిది మారితే బాగుండు అనే భావజాలం వుండొద్దనీ బాబా అనుకొని వుండకపోవచ్చు గానీ, బాబా గారి మీద ప్రకృతి కవుల మితవాదప్రభావమే దానికి కారణమైవుంటుంది.

బాబా యీ పుస్తకం లో, "పోష్టు మాడర్నిజానికి స్పష్టమైన నిర్వచనం లేకపోయినా, 1960ల నుంచి వచ్చిన కవిత్వలక్షణాలే పోష్టు మాడర్నిజం లక్షణాలుగా స్వీకరించవచ్చు" అని ప్రకటించి, దిగంబర కవులనీ పీడితుల పక్షంలో నిలిచిన కవులనీ, వరవరరావు శివారెడ్డి లాంటివాళ్లని కూడా పోష్టు మాడర్నిజం లో కలిపేసాడు. అంతో యింతో మంచి పుస్తకం లో, ప్రముఖ విమర్శకులతో మాటలు రాయించిన పుస్తకం లో యిలాంటిది లేకుంటే బాగుండేది.

వెరసి బాబా వుత్సాహంగా యీ పుస్తకం లో చెప్పిన టెక్నిక్ లను ఆచరిస్తూ కవిత్వం తోపాటు ముందుకెళ్లాలని ఆకాంక్షిస్తూ...

**యాకూబ్**

కవిసంగమంలో ఏడాదిన్నర పాటు 'కవిత్వ స్వరం'శీర్షికగా వెలువరించిన ఈ కవిత్వ నిర్మాణ వ్యాసాలను గుదిగుచ్చి, 'కవిత్వభాష'పుస్తకంగా వెలువరించారు బొల్లోజు బాబా గారు.

విలువైన ఈ పుస్తకం కవిత్వ అభిమానుల దప్పిక తీరుస్తుంది. కవిత్వ నిర్మాణంలోని అనేక సందేహాలకు జవాబులు ఇస్తుంది. కవిత్వ సంబంధ అనేక అంశాలను

విడమరిచి చూపుతుంది. ప్రతి ఒక్క కవి చదివతీరాల్సిన పుస్తకం. వెంటఉంచుకోవాల్సిన పుస్తకం.

కవిసంగమం కు, కవులకు అంకితం చేసిన అపురూపమైన పుస్తకం ఇది.

జయహోలు మీకు Bolloju Baba

### పాపినేని శివశంకర్

ఈ పుస్తకంలో వెస్ట్రన్ అలంకారాలు తీసుకొని తెలుగు కవిత్వానికి అన్వయించటం బాగుంది. ఆధునిక, అక్కడక్కడా ప్రాచీన ఉదాహరణలు తీసుకొని అపరిచయంగా ఉండే వాటిని పరిచయం చేయటం నచ్చింది.

### పాయల మురళి కృష్ణ

కవిత్వ భాష అర్థాంతర స్ఫూర్తి నిస్తుందని బాబా చెప్పినా, ఈ పుస్తకం తరహా పుస్తకాలని ఆధునిక అలంకార శాస్త్ర పుస్తకాలనొచ్చని రెంటాల వారు చెప్పినా, పాఠకులు ఈ పుస్తకాన్ని చదివితే వారికొక సాధికారత వస్తుందని సీతారాం గారు చెప్పినా, మనమూ మనదైన అనుభవాన్ని పొందాల్సిందే.... -

### పుప్పాల శ్రీరామ్

కవిత్వం రాయడానికి ఈ పుస్తకం చదవాల్సిన పనిలేదేమోగాని మంచి కవిత్వం రాయడానికి మాత్రం తప్పక ఈ పుస్తకాన్ని చదవాలి

# సామాజికానుభూతి కవి బాబా

మాకినీడి సూర్య భాస్కర్

ఏ హడావుడీ లేకుండా కవిత్వం రాయడం, సభల్లో వినిపించడం, సాంఘిక మాధ్యాల్లో ప్రసారం చేయండం, పుస్తకాలుగా తీసుకురావడం - అంతా నిశ్శబ్దంగా చేసేసే కవి బొల్లోజు బాబా. కవిత్వం కంటే ముందుగా ఒక ఉద్యమ నేపథ్యాన్ని పుస్తకంగా తీసుకు వచ్చిన ఈయన కవిత్వంలో ఏ ఉద్యమ భావాలూ లేకపోవడం ఆశ్చర్యం కలిగించే విషయం. 2007లో “యానాం విమోచ నోద్యమం' ప్రచురించిన బాబా, 2009లో తన మొదటి కవితాసంపుటి 'ఆకుపచ్చని తడిగీతం' ప్రచురించారు. దీనికి శిలపరశెట్టి సాహితీ ప్రత్యేక పురస్కారం (2010), పాలకొల్లు కళాలయ సాంస్కృతిక సంస్థ పురస్కారం లభించాయి.

తర్వాత మళ్ళీ 2012లో "ఫ్రెంచి పాలనలో యానాం" అన్న చారిత్రక గంథాన్ని రాశాకా 2016లో రవీంద్రుని స్ట్రే బర్డ్స్ ను “స్వేచ్ఛా విహంగాలుగా అనువదించారు. కొంత కవిత్వం ఇ-బుక్స్‌గా లభ్యం అవుతోంది. ఎడారి అత్తరులు” పేర సూఫీకవుల గీతాల అనువాదాలను ప్రచురించారు. పాబ్లో నెరుడా పద్యాలను, హాలుని గాథాసప్తశతిలోని కొన్ని గాథలను అనువాదం చేశారు. 2016లోనే (వెలుతురు తెర) పేర మరో వచనకవితా సంపుటి తెచ్చారు. దీనికి ఇస్మాయిల్ స్మారక పురస్మారం (2017) లభించింది.

ఈ మొత్తం సృజనలో బాబా స్వతంత్ర కవితాసంపుటాలు రెండు - ఆకుపచ్చని తడి గీతం, వెలుతురు తెర. ఈయన గీతాలకు విశేషణాలుగా అమరిన పదాలు ఆకుపచ్చని తడిదనం. ఆకుపచ్చ తాజాదనానికి చిహ్నం. కవిత్వాన్ని ఎప్పుడు ఎందుకు రాసినా, దానికొక సార్వకాలీనతను చేర్చినపుడు అది దేశకాలస్థితులకు అతీతంగా తాజాగా ఉంటుంది. ఎవరు ఎప్పుడు చదివినా, అప్పుడే ఆ సమయ సందర్భాలకు సరిపోయేవిధంగానే అనిపిస్తుంది. ఇదీ కవిత్వపు తాజాదనం. ఇక తడిదనం, చెప్పేదేదైనా, ఆలోచనను హృదయంలోకి ఇంకించుకున్న పిదప దాన్ని

మానవీయతగా మార్చి, ఒక మెత్తని స్వరంతో సున్నితంగా కూర్చడం వల్ల వస్తుంది. తడి దైన తాజాకవిత్వాన్ని చదివిన పాఠకుడి హృదయాన్ని తట్టే ఆలోచనలు రేకెత్తించడమే, అతని హృదయ పటలాన్ని 'వెలుతురు తెరగా మార్చడం.

బాబా కవిత్వాన్ని విహంగవీక్షణం చేస్తే దానిలో సామాజిక అనుభవ, అనుభూతి పాయలు రెండూ సమ్మిళితమై ఉన్నాయని ఇట్టే తెలిసే విషయం. సామాజిక రుగ్మతలను, అసమానతలను అనుభవం వరకే తీసుకున్న కవి ఆవేశంతో రక్తాన్ని చిందిస్తే, అనుభూతించుకున్న కవి దానికి మానవీయతా తాత్విక కోణాన్ని అద్ది, ఆలోచింపజేస్తాడు. కేవల సిద్ధాంత రాద్ధాంతాలను చెప్పడం కోసం రాసే కవిత్వం ఎప్పుడూ గొప్పది కానేరదు. కాని అయ్యిందంటే అర్థం, దానిలో అంతకు మించి ఏదో ఉందనే. అదే అనుభూతినుంచి జాల్వారిన ఆలోచనామృతం. ఈ అంశం అంతర్లీనంగానైనా ఉంటేనే, ఎముకలు కుళ్ళబొడిచే, రక్తం చిందించే రాత కవిత్వం అవుతుంది.

ఈ నేపథ్యంలో ఆలోచిస్తే బాబా కవిత్వంలో “'సామాజికానుభూతి” కనబడుతుంది. సామాజికానుభూతిలో అనుభవం అంతర్లీనంగా ఉంటూ, కవిత్వం మనసును దోచే రీతిలో ఉంటుంది. అనుభవానుభూతుల నిష్పత్తులు వైయక్తికం కావచ్చు. పొందిన సామాజిక అనుభవాన్ని తర్కించి, మనసుకు పట్టించి దట్టించి అనుభూతిగా చెందిన విషయాలను కవిత్వీకరిస్తారు బాబా. అందుకే ఆయన కవిత్వం సామాజికానుభూతి కలిగిస్తుందనడం.

కవిత్వం రాయడం ప్రవృత్తే అయినా, ప్రతి కవికీ ఒక వృత్తంటూ ఉంటుంది. మన దేశంలో అయితే తప్పనిసరి. ఇక్కడ రచన వృత్తి అయితే చేతికి చిప్పే మరి! ఇంతకీ వృత్తి ప్రసక్తి ఎందుకంటే, కవి వృత్తి నైజం అతని ప్రవృత్తిలో తప్పకుండా ప్రతిఫలిస్తుంది

కళాశాల అధ్యాపకులైన బాబా వృత్తి పరమైన అంశాలు ఆయన కవిత్వంలో కొల్లలుగా కనబడతాయి. వీని నైష్పత్తిక ప్రమాణాలు, పరిమాణాలు, ప్రభావాలు వైయక్తికమే. బాబా కవిత్వంలో ఈ అంశం కాస్తంత ఎక్కువే. నిజానికి ఈ అంశమే ఆయన కవిత్వంలో సామాజిక అనుభవాంశం. ఈ అనుభవాన్నించి కవిత్వాన్ని అనుభూతిగా మార్చి చెబుతారు బాబా. బోధన వృత్తిగా ఉన్నవారు కవిత్వం చెబితే, అందులో కూడ బోధన మిళితం అవుతూంటుంది. చెప్పడానికి అలవాటుపడ్డ ప్రాణం, ఏదో ప్రవచిస్తే కాని, కనీసం బోధిస్తేకానీ కుదుటపడదు. అలాంటప్పుడది సిద్ధాంత రాద్ధాంత ఉద్ఘాటనమే అవుతుంది. ఈ అకవిత్వపు అంశ లేకుండా ఉండాలంటే

బోధకుడైన కవి ఎంతో మెలకువతో కవిత్వం అల్లాల్సి ఉంటుంది. ఈ ఎరుక నరనరానా ఉన్న కవి బాబా.

బాబా కవిత్వానికి, కవితాతత్వానికి సంబంధించిన ఈ నేపథ్యాన్నంతా రెండే కవితల విశ్లేషణతో వివరించడానికి పూనుకుంటున్నాను. ఆ రెండు కవితలూ, వేరేవి ఎందుకు? టైటిల్ కవితలనే తీసుకుంటాను. "ఆకుపచ్చని తడి గీతం" –

'మేఘాలూ నేలా
రాత్రి చుంబించుకొన్నట్లున్నాయి
తెల్లవార్లూ వాన కురుసూనే ఉంది' – ఇలా మొదలవుతుంది కవిత.

రాత్రి పడ్డ వాన గురించి కవి తన అనుభూతులను పంచుకుంటున్నారు. తెల్లవార్లూ వాన కవి నిద్దట్లో కూడ కురుసూనే ఉంది లేకుంటే, తెల్లవార్లూ కురిసిన వైనం మెలకువ వచ్చేసరికి ద్యోతకం కాకపోను. తెల్లవార్లూ కవి నిద్రపోలేదు. వానను కలగన్నారు. ఆ కలనుంచి మేలుకొన్న కవికి కలిగిన అనుభవం––

'నల్లని మంచుగడ్డ కరిగిపోయింది
నిశ్చల తరువుల్లోకి ప్రాతః కాలం
తడితడిగా ప్రవేశించింది.
వంద గుమ్మాలతో వెదురు పొద
స్వాగతం పలికింది.'

కవి మేలుకొనే సరికి రాత్రి పోయి పగలు వస్తోంది. రాత్రి పోయిందనడాన్ని ఒక భావచిత్రంలో పొందికగా ఒదిగించారు.

వంద మామూలు మాటలు చెప్పలేని భావాన్ని ఒక్క భావచిత్రం వంద రీతుల్లో ఐకాంతికం చేయగలదు. భావాన్ని కవిత్వంలా మెరిపించగలదు. రాత్రిని "నల్లని మంచుగడ్డ అనడమే గొప్ప భావుకత. ఆ మంచు గడ్డ ఎప్పుడూ శాశ్వతమైంది కాదు. మంచుగడ్డ అనడంలోనే కవి ఆ భావాన్ని విశదం చేస్తున్నారు. దాని నైజం కరగడమే. వేడికి కరగడమే; నిశ్చల తరువుల్లోంచి తడితడిగా పవేశిస్తూన్న 'ప్రభాత కిరణాల లేలేత వెచ్చదనానికి అది కరగడం మొదలైంది. రాత్రి గతిస్తూ, పగటిని స్వాగతిస్తోంది. ఇదే విషయం– ఎన్ని రకాలుగా చెబుతారో!

'సూర్య కిరణాల కిలకిలారావానికి
లిట్మస్ పేపరులా ఆకాశం రంగు మారింది'

రంగు మారిన ఆకాశాన్ని లిట్మస్ పరీక్షకు గురిచేస్తున్నారు కదా, సూర్య కిరణాలతో పాటూ కవిలోని పాఠాల బోధకుడు మేలు కున్నాడనుకుంటున్నారా? బోధకుడే మేలుకుంటే, రాత్రనే అజ్ఞానాన్ని తరిమే విజ్ఞానమనే వెలుతురు 'ప్రసరిస్తోందని, మనలోని అజ్ఞానపు చీకట్లను తొలగించుకోవాలంటే చదువనే దీపాన్ని వెలిగించుకోవలని... ఏదేదో ఖచ్చితంగా బోధించి ఉందును. కాని అటువంటిదేమీ లేదు. సూర్య కిరణాలతో పాటూ కవిలోని కవి మాత్రమే మేలుకున్నాడని చెబుతున్నాయి ఈ కవిత్వ పాదాలు.

తొలి కిరణ స్పర్శ పక్షులు మేలుకుంటాయి. కిలకిలారావాలు చేస్తాయి. పక్షుల ఆ కిలకిలల్ని సూర్యకిరణాలకు ఆపాదించడమే కవిత్వాంశ.  ఒకే చోట తీరుబడిగా కూర్చుని కిలకిలారావాలు చేస్తాయా పక్షులు!? చెట్టుమీంచి చెట్టుకి, కొమ్మమీంచి కొమ్మకి ఎగురుతూ పాడతాయి. ఎగిరేటప్పుడు వాటి రంగురంగుల ఈకలున్న రెక్కలు విప్పారుకుంటాయి. ఎగిరే ఆ రంగులు, సూర్య కిరణాలతో ప్రతిఫలించి తెల్లవారడంతో పాటూ ఆకాశం రంగు కూడ మారుతోంది. ఈ రంగు మారడాన్ని లిట్మస్ పేపర్ మార్చినట్టుగా ఉందంటున్నారు. ఇక్కడ పాఠం మొదలుపెట్టాడా కవి? పాఠ్యగతమైన అంశమే కావచ్చు; కాని దాన్నెంత ఎరుకతో కవిత్వం చేస్తున్నారో గమనించాలి.

నీలిరంగును ఎరుపుగాను, ఎరుపు రంగును నీలంగాను మారుస్తుంది లిట్మస్ పేపరు. నిజమే, ఇదొక శాస్త్రీయ దృగ్విషయమె. కానీ, ఈ పోలికతో ఇక్కడ కవి ఏం చెబుతున్నాడు? పాఠమా? ఆకాశం సహజమైన రంగు నీలం. ఇంకా చెప్పాలంటే లేత నీలం. ఈ రంగును రంగురంగుల ఈకల పక్షి రెక్కలు మారుస్తున్నాయి. ఏ రంగుకు మారుస్తున్నాయో లిట్మస్ పేపరు ప్రమేయంతో వివరిస్తున్నారు లిట్మస్ నీలం రంగును ఎరుపుగా మారుస్తుంది కదా! అంటే ఆకాశం ఎర్రగా మారిందని చెబుతున్నారన్న మాట. ఉదయించే సూర్య కిరణాలకు ఆకాశం ఎరగానే కదా మారుతుంది. ఈ రెండు పాదాల్లో సూర్యోదయాన్ని అద్భుతంగా బొమ్మ కట్టించారు కవి.

ఇదే విషయాన్ని శాస్త్ర పరంగా ఇంకా వివరించుకోవచ్చు. లిట్మస్ పేపర్‌ను ఆమ్లత్వం నీలంగా మారుస్తుంది. క్షారత్వం ఎరుపుగా మారుస్తుంది. వాతావరణంలో ఆమ్లత్వం ఎక్కువ కావడం మంచిది కాదు. ఆమ్ల వర్షాలకు కారణమవుతుంది.
ఎరగా మారిన ఆకాశం అంటే, ఆమ్లత్వం లేని ఆహ్లాదకరమైన ఆకాశమని వ్యంజన. ఇదీ కవిత్వం. ఈ రెండు పాదాల్లో ఇంత విషయం చెప్పారు.

'తీగమొక్కలు జారిపోయిన పట్టును
మళ్ళా వెతుక్కొంటున్నాయి
తడినేలపై పడి పరావర్తనం చెందిన
లేత కిరణాలు, ఆకుల క్రింద దాక్కొన్న
చీకటిని తరిమేస్తున్నాయి'

తెల్లారాలంటే నల్లని మంచుగడ్డ కరగాలి కదా! దీపం వెలుగుతున్నదే, పరిసరాలను వెలిగిస్తున్నదే ... కాని దాని క్రింద నీడని మాత్రం వెలిగించలేదు. కాని సూర్య కిరణాలు ఏం చేస్తున్నాయి? ఆకుల క్రింద దాక్కొన్న చీకటిని కూడా తరిమేస్తున్నాయి. ఎలా? మంచుతో తడిసిన నెలపై పడి పరావర్తనం చెందడంద్వారా! పరావర్తనమనే దృగ్విషయం ఫక్తు సైన్స్ విషయమే. కాని, ఎంతో నేర్పుతో దాన్ని కవిత్వాంశంగా మార్చేసారు. ఇలాంటి చోట్లే కవి నేర్పరితనం కనబడేది.

'చెట్ల ధూళి వానగుంటలో చేరి
ఆకుల అందాలను చూస్తూ విస్తుపోతోంది"

గాలికి ఎగిరొచ్చిన దుమ్మూ ధూళీ ఆకుల్ని కప్పేస్తాయి. ఇంచక్కని లేత ఆకుపచ్చ రంగులో ఉన్న చిన్న చిన్న ఆకులు కూడ మట్టి కొట్టుకుపోయి వాటి సహజమైన మెరుపును కోల్పోతాయి. అటువంటి సమయంలో కరిగిన తెల్లవార్లూ కురిసిన వర్షం, నేలమీద పల్లాల్లోచేరి వానగుంటలయ్యింది. వర్షంతో పాటు ఆకుల్ని చుట్టిన పొరగా ఏర్పడ్డ మట్టి రేణువులు, ఆ వానగుంటల్లోకి చేరాయి. వాటికి ఆకుల అందాలు విందు చేశాయి. కడిగిన ముత్యంలా, శుభ్రపడిన ఆకుల అందాల్ని చూస్తూ ఆ మట్టి రేణువులు విస్తు పోతున్నాయి ... ఏవైతే ఆకుల అందాల్ని పాడు చేశాయో ఆ మట్టి రేణువులే! వర్షం కురిసి ప్రకృతి శుభపడిందని ఈ రెండుపాదాల్లో పాఠకుడు విస్తుపోయేలా తెలిపారు కవి.

‘మబ్బు అంచుల జరీ మెరుపులతో
పోటీ పడే ఈకల కోసమై
ఓ పక్షి శ్రద్ధగా ప్రీనింగ్ చేసుకొంటోంది”

కవి అధ్యాపకుడే, అందునా జంతుశాస్త్ర అధ్యాపకుడన్న విషయాన్ని ఈ పాదాలు చెప్పకనే చెబుతున్నాయి. పక్షి ముక్కుతో తన రెక్కల ఈకలను శుభ్రం చేసుకోడమే ప్రీనింగ్. మబ్బు వెండంచు జరీ మెరుపులతో పోటీ పడే ఈకల కోసం పక్షి తాపత్రయ పడుతోంది. ఆ పక్షి రెక్కలే ఆకాశాన్ని అరుణరాగ రంజితం చేశాయి. దానికి మెరుపు కూడ కలిగించే ప్రయత్నం చేస్తున్నాయి పక్షులు.

‘తలంటుకొన్న యవ్వనిలా శోభిస్తున్న
పొగడచెట్టు గాలికిరణాలలో
పత్రాలను ఆరబెట్టుకొంటూంది”

సూర్య కిరణాలు తడిసిన చెట్లను వెచ్చబరుస్తూ ఆరబెడుతున్న విషయాన్ని ఈ పాదాల్లో సౌందర్యవంతంగా చెప్పారు కవి.

రాత్రి వర్షంలో తడిసిన పొగడచెట్టు, పత్రాలను “'తలంటుకొన్న యవ్వనిలా ” ఆరబెట్టుకొంటోంది, గాలికిరణాలతో! గాలి, కిరణాలూ – రెండూ తడిని పోగొట్టి ఆరబెట్టేవే. తడిగా, చిత్తడిగా ఉన్న పరిసరాలు చిరాకు కలిగిస్తాయి. పొడిగా, పుప్పొడిగా ఉన్న పరిసరాలు చైతన్యం కలిగిస్తాయి, వెల్లివిరుస్తాయి. రాత్రి వర్షంతో శుభ్రపడిన ప్రకృతి, నులివెచ్చని కిరణాల తాకిడితో ఆరి చైతన్యవంతం కూడ అవుతోంది.

‘ఉదయపు గొంతులోంచి
ఆకుపచ్చని తడిగీతం
రెక్కలు కట్టి ఎగురుతూంది.
మేఘాలవతల వరకూ
సౌందర్యం పరుచుకొంది”

ఉదయ ప్రకృతి శుభ్రపడి, చైతన్యవంతమై గొంతు సారించి ఆకుపచ్చని తడి గీతం ఆలాపిస్తోంది. ఆ గీతం విన్న సమస్త ప్రాణి కోటీ మేల్కొంటూ అదే చైతన్యాన్ని తనలోనూ పొదువుకుంటోంది.

‘తటాకం అంతవరకూ భద్రంగా
దాచుకొన్న తామరదుంపకు
కొత్త చిగుళ్ళు లేస్తున్నాయి
నేల ఆలపించే ప్రాచీన గీతాన్ని చిత్రించటానికై”

కొత్త చిగుళ్ళు సృష్టి కొనసాగింపుకు ప్రతీక. తామరదుంపకు చిగుళ్ళంటే, ఉత్పాదకతకు పర్యాయం. తటాకం సమాజం. మేలుకున్న మనిషి... సమాజం, నిద్రతో 'సేదదీరి, జడత్వాన్ని కడిగేసుకుని, శుభ్రపడిన మనసుతో దైనందిన ఉత్పాదక కార్యకలాపల్లోకి వెళోంది. ఇదీ మొత్తం కవితకు అర్థం. మనిషీ సమాజమూ నిత్య చైతన్యశీలమై ఉండాలి. నిర్దేశిత కార్యకలాపాల్లో ఉత్సాహంగా, ఉల్లాసంగా పాల్గొంటూ, మనిషి తోటి మనిషికీ, మొత్తంగా సమాజానికి తన సహాయ సహకారాలు అందించాలి. అప్పుడే జీవనం సాఫీగా సాగుతుంది.

పైకి సుప్రభాతాన్ని వర్ణించే కవితగా ఉన్నా తరచి ఆలోచిస్తే ఇన్ని భావాలూ, ఇంతటి నిగూఢమైన సందేశమూ ఈ కవితలో ఉన్నాయి. నేల ఆలపించే ప్రాచీన గీతం, వ్యవసాయం. నిద్ర లేస్తూనే రైతు తన కార్యకలాపమైన వ్యవసాయా సంబంధిత పనుల్లోకి జొరబడతాడు. అలాగే, సమాజంలో ఏ వృత్తిలో ఉన్నవారైనా, తమ పనుల్లోకి వెళ్ళి, సమాజానికి చేదోడు వాదోడు కావాలి.

ఇదంతా కవి తన నేర్పరితనంతో సాధించిందే. పదాల ఎంపిక, పదబంధాల కూర్పు, భావచిత్రాల పేర్పు - ఇత్యాది కవితాంశాలన్నీ పోటీపడి భావాన్ని ఉదాత్తం చేసేవిగా కవితనల్లి, అంతర్లీనంగా సందేశాన్ని కూడ అందించారు బాబా. కవిత ముగిస్తూ-

‘తడిసిన సీతాకోక చిలుక
కవిత్వంపై వాలి రెక్కలల్లార్చింది” అంటారు.

పువ్వు పువ్వూ తిరిగి మధురమైన తేనెను కూడబెట్టే సీతాకోక చిలుక శ్రామికుడికి ప్రతీక. అతని శ్రామిక శక్తితోనే సమాజం సజావుగా సాగుతుంది. ముగిస్తూ ఈ విషయాన్ని కూడ చెప్పి, కవితకు పరమార్థం కూడ విడమరచారు కవి బొల్లోజు బాబా — కవిత్వం పై రెక్కలల్లార్చారు.

ఇక 'వెలుతురు తెర' -

పెరుగుతున్న టెక్నాలజీని, అవసరానికి వాడుకోడం తప్పులేదు. కాని, అదేపనిగా అందులోనే మునిగిపోతే, ఎంతో విలువైన సమయం ఎందుకూ కాకుండా పోతుంది. దానితో పాటు మానవ సంబంధాలూ దెబ్బ తింటాయి. ఉదాహరణకు నట్టింట్లో తిష్ట వేసిన ఇడియట్ బాక్సునే తీసుకుంటే, ఇంటిల్లిపాదినీ ఎపిసోడ్స్ ఎపిసోడ్స్‌గా ఛానెలీకరించేసింది. ఇంట్లో సభ్యులు ఎందరుంటే అందరూ అన్ని టి.వి. కార్యక్రమాలు ఇష్టపడతారు. దాంతో, ఒకరితో ఒకరు రిమోట్ కోసం తగవులాడుకోడం, తిట్టుకోడంగా తయారవుతోంది.

ఇడియట్ బాక్సును మించిన టెక్నాలజీ మొబైల్. దీన్ని టి.వి.లా సంఘటితంగా చూడాల్సిన పని కూడ లేదు. ఎవరికి వారే వాళ్ళకిష్టమైనవి చూడొచ్చు. దాంతో ఇంట్లోని సభ్యుల మధ్య కనీసపు మాటలు కూడ మృగ్యం అయిపోయాయి. దీనికి తోడు అనుసంధానంగా అంతర్జాల మాయాజాలం ఒకటొచ్చి పడింది. దాంతో-

"చెట్టు నీడలో కూర్చొన్న
విద్యార్థుల గుంపు
వెలుతురు తెరలో దూకి
వైఫై సముద్రంలో తేలుతుంది"

ఒకే చోట కూర్చున్నా పక్కవాడెవడో పట్టించుకోకుండా, ఎవడికి వాడే తల వంచుకుని ఏక బిజీ. ఏం చూస్తాడో తెలీదు; ఛాటింగ్, షూటింగ్, మెస్సేజింగ్ వంటి అనేకానేక పనుల్లో పడి కొట్టుకుపోడమే. తేలడమంటూ ఉండదు. ప్రతివాడూ తనదైన ఒక సంకుచిత ప్రపంచాన్ని సృష్టించుకుని అందులో కూరుకుపోడమే! వాళ్ళ తీరెలా ఉంటుందంటే-

'దారాన్ని స్రవించుకొని
తాళ్ళతో పేనుకొంటూ తనచుట్టూ తానే
గూడు నిర్మించుకునే పురుగులా
పతి విద్యార్థీ తనచుట్టూ
ఓ మౌన పంజరాన్ని బిగేసుకుంటాడు'

పురుగుకు గూడు కట్టుకోడం జీవితావసరం. పురుగుకంటె కనిష్టం మనిషి. తాను చుట్టూ కట్టుకునే గూడువల్ల తనకే ఎలాంటి ప్రయోజనమూ లేని పరిస్థితి. అందరూ ఎవడికి వాడే తమ తమ లోకంలో పడి చుట్టూ ఉన్న లోకాన్ని పట్టించుకోకుండా మునిగి పోయిన తరుణంలో... వైపై లింక్ తెగితే – "ఓహ్! షిట్..."

అప్పుడు ఎవడికి వాడు తలెత్తుతాడు. అప్పటివరకు మునిగిపోయిన తమ లోకంలోంచి అసలు లోకంలోకి వస్తాడు. ఎలాగంటే–

'గూడులోంచి సీతాకోక చిలుక
మెత్త మెత్తగా బయటపడినట్లుగా
ఒక్కో విద్యార్థి మాటల ప్రపంచంలోకి
మెల మెల్లగా మేల్కొంటాడు
కాసేపటికి కాంపస్ అంతా
రంగు రంగుల మాటల చిలుకలు
రెక్కలల్లార్చుకొంటూ ఎగురుతో!"

వృత్తి పరమైన ఇమేజరీతో మొత్తం సాగిన ఈ కవిత వస్తువు కూడ వృత్తిపరమైందే కావడం విశిష్టం. కవి తాను రోజంతా గడిపే విద్యార్థి సమూహం – సమాజంలో భాగమే. వారు పోతున్న వింత పోకడలకు వగచి రాసినదీ కవిత. అదే పనిగా సెల్లుతో గడపకుండా, చుట్టూ ఉన్న తోటి విద్యార్థులతో మాట్లాడుతూ సత్సంబంధాలు నెలకొల్పుకోవలసిందిగా సందేశమిచ్చారు కవి.

ఈ విధంగా, బొల్లోజు బాబా కవిత్వంలో అనుభూతి పాలు ఎక్కువైనా, పూర్తిగా వైయక్తికం కాకుండా, సమాజాన్ని పట్టించుకుంటూ సాగుతుంది. అందుకే సామాజిక అనుభూతి కవి బాబా.

మాకినీడి సూర్య భాస్కర్
అక్టోబర్ 2018

# అలా మొదలై, చాలా దూరం వెళ్ళే బాబా కథన కవిత్వం!

అఫ్సర్




(మూడో కన్నీటి చుక్క పుస్తకానికి రాసిన ముందుమాట)

వొక సంపుటి వెలువడిన తరవాత కవి ముందు మహాద్వారమేదో తెరుచుకుంటుంది. ఆ ద్వారాన్ని దాటుకొని అతను యెటు వైపు అడుగేస్తాడా అని లోకం కనీసం పది కళ్ళతో యెదురుచూస్తుంది. అందులో కొన్ని కళ్ళు పచ్చగా అసూయతో- కొన్ని కనిపించీ, యింకొన్ని కనిపించని- చూస్తూ వుంటాయి. చాలా కష్టం! చాలా అయిష్టంగా కూడా వుంటుంది. అట్లా అని తెరుచుకున్న తలుపుని మూసేసి వెనక్కి వెళ్లలేడు కవి. ముందుకే వెళ్ళాలి. ముఖ్యంగా చాలా కవిత్వ పుస్తకాలు వెలువడుతున్న కాలంలో తనదే అయిన దారీ, చూపూ వుంటే తప్ప అట్లా ముందుకు వెళ్ళడం సాధ్యం కాదు. అవేమీ లేకుండానే కొంతమంది ముందుకు వెళ్తున్నామన్న భ్రమలో బతికేస్తూ వుంటారు. ఆ భ్రమని పాఠకులు బ్రేక్ చేసి, వాస్తవంలోకి ఈడ్చి కొడ్తారు, నిశ్శబ్దమైన నిరాకరణతో-

నన్ను నేను కూడదీసుకునే ప్రయత్నంలో ఇద్దరు కవుల్ని ఈ మధ్య మార్చి మార్చి చదువుతున్నాను. మార్చి మార్చి చదవడం అంటే కాసేపు ఈ కవి పేజీలు కొన్ని, ఇంకాసేపు ఆ కవి పేజీలు కొన్ని- ఇద్దరినీ వొకేసారి చదువుతున్నా. ఆ ఇద్దరు: వొకరు మన కవి బాబాజీ. మరొకరు: వాల్ట్ విట్మన్.

1

బాబా రెండో కవిత్వ పుస్తకం అంది, చాలా కాలమే అయింది. ఈ లోపు నా జీవితంలో వూహించని విషాదం ఎదురైంది. అమ్మ పోయింది. కవిత్వం చదివే మనసూ లేదు. ఇక నాలుగు మాటలు రాసే చేతులేవో పడిపోయినట్టుగా అనిపించింది. కానీ, బాబా కవిత్వం మధ్యలో చదువుతూనే వున్నాను. చదువుతూ చదువుతూ ఆగిపోతున్నాను. ఆగిపోయిన చోట యేదో వెతుక్కుంటూ వున్నా. అట్లా వెతుక్కుంటున్నప్పుడు మరీ ముఖ్యంగా వొక కవిత దగ్గిర కాస్త యెక్కువ సేపు నిలిచి వున్నాను.

ఆ కవిత శీర్షిక: ఒక కవిని కలిశాను

రేపతను తన ఇంటిలో ఉండకపోవచ్చు
రేపతను తన దేహంలో ఉండకపోవచ్చు
రేపతను తన ఆత్మలో ఉండకపోవచ్చు
కానీ తన పేరులో సజీవంగా ఉంటాడు
ఇన్ని సంవత్సరాల జీవితాన్నీ
తన పేరులో దాచుకొన్నాడు
అక్షరాలుగా, వాక్యాలుగా, కవిత్వంగా….

మరణాలూ, జననాలూ, ఉత్సవాలూ, నిరుత్సాహాలూ మామూలు మనిషికీ వుంటాయి. వాటిని గుర్తు పెట్టుకోడానికో, మరచిపోడానికో అతనూ యేదో చేస్తాడు. బహుశా, వొక స్నేహితుడి దగ్గిరకెళ్లి భోరున ఏడుస్తాడు లేదంటే కడుపారా నవ్వుకుంటాడు. గుంభనగా వుండే మనిషి అయితే లోలోపలే వుండిపోయి, బయటికి రాలేక తనలో తాను పోరాడుతూ వుండిపోతాడు.

కానీ, కవి మామూలు మనిషి కాదు. కవి దగ్గిర కొన్ని పదాలుంటాయి. వాటిని వాక్యాలుగా అల్లే శక్తి వుంటుంది. ఆ శక్తి కొన్ని సార్లు కవిని ఆదుకుంటుంది లేదా కవి మనసుతో ఆడుకుంటుంది. ఆ పదాలతో కవి నిజంగానే తన ఏడుపూ, సంతోషమూ చెప్పచ్చు. లేదంటే, పదాలకు రంగులద్ది మోసం చేయచ్చు. Replacement జరగాలి. అది యెట్లా అయినా జరగచ్చు. అది యెట్లాంటి Replacement?

బాబా అంటున్నాడు:

రేపతను తన ఇంటిలో ఉండకపోవచ్చు
రేపతను తన దేహంలో ఉండకపోవచ్చు
రేపతను తన ఆత్మలో ఉండకపోవచ్చు

మూడు రకాల Replacement- ఇల్లు, దేహం, ఆత్మ! అది తేలిక కాదు. కవికే కాదు, మామూలు మనిషికి కూడా తేలిక కాదు.

2

కొంత దూరం నడిచాక కవికి భాష విధించే ఖైదు భారమైపోతుంది.

అంటే, తను వాడుతున్న భాష కటకటాలయం అవుతుంది. ఆ కొద్ది దూరం తరవాత కవి వెతుకులాట అంతా భాష గురించే. భాషని శుభ్రం చేసుకోవాలన్న పట్టుదల పెరుగుతుంది. అప్పుడు ఆ కవి యే భాష వైపు కదులుతాడన్నది అతని దృక్పథాన్ని బట్టి వుంటుంది. నా మటుకు నేను colloquial అంటే రోజువారీ జీవితం వైపు మళ్లే కవిత్వం మీద వొక రకమైన పక్షపాతం. ఎందుకంటే, సాహిత్య భాషకి ఎదురుగా సాధారణ భాషని నిలబెట్టడం పెద్ద యుద్ధం కాబట్టి!

బాబా మొదట బుద్ధిజీవి. అతనికి స్థానిక చరిత్రలూ, సంస్కృతుల మీద వున్న ఆసక్తీ, పరిశోధనా అనుభవం చాలా మటుకు తన కవిత్వ వ్యక్తిత్వాన్ని కూడా ప్రభావితం చేస్తూ వుంటాయి. అట్లాగే, కవిత్వ విమర్శ మీద గత కొంతకాలంగా నిక్కచ్చిగా గొంతు విప్పి, పరిభాష వెతుక్కుంటున్న poet-critic బాబా.

యిక్కడ ఆ రెండు కాళ్లే అనేక పడవల మీదకి వెళ్ళి, నదిని దాటుకొని రావాలని ప్రయత్నించడం మనం ఈ కొంతకాలంగా చూస్తున్నాం. స్థానిక చరిత్రల మీద పనిచేస్తున్న శోధకుడికి వెంటనే నచ్చే మరో సాహిత్య శిల్ప ధోరణి: narration. Narrative poetry మనకేమీ కొత్త కాదు. అయితే, అత్యాధునిక సందర్భంలో ఈ విధమైన నిర్మాణం వెంట ముఖ్యంగా రెండు ప్రయోజనాలున్నాయి. వొకటి: సంప్రదాయ కవిత్వ శైలిని నిరాకరించడం; రెండు- కవిత్వంలో వొదగని సాంస్కృతిక లక్షణాలను స్వీకరించడం. ఈ రెండు పనులూ చక్కగా చక్కదిద్దుతున్నాడు బాబా.

ముఖ్యంగా- ఈ కొత్త కవిత్వ సంపుటిలో బాబా Narrative poetry కి సంబంధించిన అనేక కోణాలని మనకి పరిచయం చేస్తున్నాడు. బహుశా, ఈ సంపుటి ప్రధానంగా తలపెట్టిన task అదే! పైన చెప్పిన కవితలో ఇతర అంశాలు అనేకం వున్నా, అందులోని narration మనల్ని కట్టిపడేస్తుంది.

కనీసం మూడు రకాల narrative పద్ధతుల్ని బాబా వాడుతున్నాడు. నేరుగా కథనం చేయడం ఇందులో ఎక్కువగా కనిపిస్తున్న పద్ధతి.

ఉదాహరణకు:

జీవించటమే…….అనే కవిత చూడండి:

ఓ రోజు హఠాత్తుగా ఒకదారి తన గమ్యాన్ని మరచిపోయింది. చాలా బెంగ పట్టుకొంది దానికి, గమ్యం లేని జీవితమేమిటని. తన గమ్యాన్ని వెతుక్కొంటూ ప్రయాణం కట్టిందా దారి. కనిపించిన ప్రతి ఒక్కరిని అడుగుతోంది.

యిలా మొదలై ఈ కథ చాలా దూరం వెళ్తుంది. చివరికొచ్చేసరికి బాబా అసలు కథ చెప్తాడు. ఇది నేరుగా కథ చెప్పినట్టే వుండి, కొన్ని జీవన దృశ్యాలను ఆవిష్కరించే ప్రతీకల మీదుగా తుది మజిలీ చేరుకుంటుంది.

ఫ్రాగ్మెంట్స్ అనే శీర్షిక కింద రాసిన శకలాల్లో కూడా కథనాత్మకతే కనిపిస్తుంది. అయితే, ఈ కథనాత్మకత యింకొంచెం గాఢంగా రూపం దిద్దుకుంటుంది.

అందమైన సీతాకోకలు
గాల్లో తేలిగ్గా అలా ఎగిరే దృశ్యం
హాయిగా అనిపించేది
ఒకరోజు
రైల్వే ట్రాక్ పై చెత్త ఏరుకొంటున్న
మురికిబట్టల సీతాకోకను
చూసే వరకూ.....

ఈ కవిత నిజానికి శకలం కాదు. కొద్ది వాక్యాల్లోనే వొక దీర్ఘ కథకి కావలసిన సామగ్రి నింపుకున్న నిర్మాణ చాతుర్యం ఇందులో వుంది. ప్రతి కవీ కొన్ని పాత్రల చుట్టూ తన కథే చెప్తాడు. అయితే, బాబా కవితల్లో పాత్రలకు ఆ ఆత్మకథాత్మకతని మించిన లక్షణాలు కనిపిస్తాయి. ఈ విధంగా సమకాలీన కవిత్వంలో కవులు చేస్తున్న ప్రయోగాలకు భిన్నమైన ధోరణిలో వెళ్తున్నాడు బాబా.

3

ఆశ్చర్యం యేమిటంటే, క్రమంగా తెలుగు కవిత్వంలో కవిత్వాన్ని మాత్రమే విశ్లేషించే సాధనాలు లేవు. ఎంతోమంది కవిత్వ విమర్శకులు ఆధునిక కవిత్వ ప్రారంభ దశ నుంచీ వస్తున్నప్పటికీ ఇప్పటికీ కవిత్వ విమర్శ సాధనాలను సృష్టించుకోలేకపోయాం. చేకూరి రామారావు లాంటి వారు భాష శాస్త్రం కోణం నుంచి చేసిన ప్రయత్నాలు ఆ తరవాత అంతగా అనుసరించిన వాళ్ళు కూడా లేరు. ఆ రకంగా చూస్తే, కవిత్వ విమర్శ పరిభాష మనకింకా ఏర్పడలేదు. అదొకటి ఏర్పడాల్సి వుందన్న ఆలోచన కూడా నెమ్మదిగా పోతోంది.

బాబాలో కవీ, విమర్శకుడూ ఇద్దరూ పుష్కలంగా వున్నారు. వాళ్ళ ప్రపంచాలు అంత భిన్నమైనవేమీ కాదు. అయితే, వాళ్ళిద్దరి మధ్యా సరిగా వంతెన కట్టే విశ్లేషణ ఏదో జరగాల్సిన సందర్భం దగ్గిర పడిందని ఈ కొత్త కవిత్వ సంపుటి

చదువుతున్నప్పుడు అర్థమైంది. కవిగా తన దారి ఏమిటో వెతుక్కోడానికి బాబా కవిత్వ విమర్శలోకి వచ్చాడనీ నాకు గట్టిగానే అనిపిస్తుంది.

సృజన అనే కవితలో బాబా అంటాడు:

అంతకు ముందు ఏవి లేవో
వాటిని కొందరు
గొప్ప కాంక్షతో, దయతో
అన్వేషించి
అక్షరాల్లో మరోప్రపంచాల్ని
శిలల్లో భంగిమల్ని
రంగుల్లో ప్రవహించే దృశ్యాల్ని
ఆవిష్కరిస్తూంటారు

ఇది కవిత్వంలో పొదిగిన తన ఆత్మకథ. ఇది బాబా కవిత్వ విమర్శకి కూడా వర్తించే అంశమే. బాబా వొక గొప్ప కాంక్షతో కవిత్వంలోకీ, కవిత్వ విమర్శలోకీ బయలుదేరాడు. వొక సామాజిక శాస్త్రజ్ఞుడిగా అతనికి అన్వేషణా, ఆవిష్కరణ అనే రెండు concepts కూడా తోడవుతున్నాయి. అంతమంది వొక చోట కలిసే బహుళత్వం తెలుగు కవిత్వానికి గొప్ప బహుమతి.

అఫ్సర్
నవంబర్ 27, 2019

# కాడైపోతున్న వ్యవస్థరాల్చిన "మూడో కన్నీటిచుక్క"

కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి

ఒక కవిని అంచనా వేయాలంటే జీవితంలో ఆ కవి తోడిపోసిన జీవ చైతన్య వాక్యాలను బట్టి, గీటురాయిపై కెక్కించి నాణ్యతను చెప్పాల్సి వుంటుంది. కవికి వస్తువుతో పాటు దృశ్యం వీటితోపాటు అనుభవం, అనుభూతినందిస్తుంది. సమాజంలో విస్తరించి ఉంటున్న మౌనగానాన్ని, మౌన సందేశాన్ని ఒడిసిపట్టలేని కవి, వస్తువు మూలాల్ని స్పర్శించలేడు. కవి బహిర్ యాత్రతో పాటు అంతర్ యాత్రను చేయాల్సివుంటుంది. ంకవి కాళ్ళతోనే కాదు, కళ్ళతోనూ పయనిస్తూ, చెవులతోనే కాదు హృదయంతోను వింటూ, నిదర్శనాన్వితమైన విశాల దృష్టితో స్వశక్తితో పదబంధాలను కూర్చుకున్నప్పుడే, ఆ కవి తనదైన ముద్రతో కనిపిస్తాడు, సాహిత్యలోకంలో రాణిస్తాడు. ఆ కవి ఒక నవ్యచైతన్య కేతనాలను ఎగురవేయగలడు.

కవిత్వం రాయడమంటే సమాజాన్ని చదవడమేననే దృష్టి, దృక్పథంతో జ్వలిస్తూ, అక్షరాలకు ఆయుస్సు పోయడమే. కాలం ఒడిలో కన్ను తెరిచిన కవిని కాలప్రవాహపు ఒరిపిడే ఆయన కవిత్వానికి మార్మికతను తాత్త్వికతను అద్దుతుంది. కవి ఆత్మశోధనలోంచి వెలువడిన భావధార పాఠకుణ్ణి తేలిగ్గా ఓన్ చేసుకుంటుంది. పై లక్షణాలను, లక్ష్యాలుగా, మార్గాలుగా చేసుకుంటూ వో సామాజిక శాస్త్రజ్ఞుడిగా, పరిశోధనాత్మకమైన కవిత్వాన్ని 'మూడో కన్నీటిచుక్క' గా వెలువరించిన కవి, విమర్శకుడు బొల్లోజు బాబా.

ఈయన కవిత్వంలో సరళమైన భాష లోతైన భావాలు పాఠకుణ్ణి వెచ్చవెచ్చని ఆలోచనా కదలికల్లోకి నెడతాయి. తొలికవిత "ఒక దుఃఖానికి కొంచెం ముందు··· తో రైతు బాధ, వ్యధ, జీవితంలో జరుగబోయే పరిణామం ఎంత చక్కగా చెప్పాడో చూడండి.

'అప్పటికింకా అతను
చెట్టుకొమ్మకు పిడికెడు మట్టై వేలాడలేదు" అంటారు. పిడికెడు మట్టై వేలాడడం అంటే శవమైపోవడమే కదా! రైతు "ఎండిన పంటను ఓదారుస్తున్నాడు" అంటే మండే గుండెలను తమాయించుకోడానికి యత్నించడమే.

"ఇసుక నిండిన హృదయం" అంటే డ్రై అయిపోయిన గుండెలే కదా! కవిత్వాన్ని వచనంగా జారిపోనీయకుండా ప్రతి వాక్యానికి కవిత్వాంశను అద్దాడు

"అప్పటికింకా అతని భార్యలో
సగభాగం ఖననం చేయబడలేదు
కళాయి పోయిన అద్దంలో
చూసుకొంటూ నుదిటిపై
సూర్యబింబమంత కుంకుమ దిద్దుకొంటోంది"

హిందు ధర్మంలో భార్యలో కొన్ని చిహ్నాలు భర్తవిగా గోచరిస్తాయి. కొన్ని ఆనవాళ్ళు ఈమెకు భర్త ఉన్నాడు అనే విషయం ప్రపంచానికి చెప్పకనే చెప్తుంటాయి. "అందుకనే కవి సంప్రదాయ సూత్రాన్ని పట్టుకొని "అప్పటికింకా అతని భార్యలో సగభాగం ఖననం చేయబడలేదు" అనగలిగాడు.

"కళాయి పోయిన అద్దం" రైతు పేదరికాన్ని పట్టిస్తుంది. రైతు పేదరికంలోకి దిగిపోయాడు అనకుండా వివర్ణమైన ఒక వస్తువును పాఠకుని ముందుకు తెచ్చి రైతు పేదరికాన్ని అర్ధమయ్యేలా చేశాడు. అభివ్యక్తిలో మార్మికతను చొప్పించి రాయడం ఈ కవి ప్రత్యేకత. రైతుల ఆత్మహత్యల గూర్చి అద్భుతంగా ఈ కవిత చెప్పబడింది.

" నాలుగు స్తంభాలు" అనే కవితలో దేశవిధ్వంశకర శక్తుల్ని గూర్తి ఎంతో తేలిగ్గా "సీరియస్ నెస్" ఉన్నట్లు కాకుండా "క్యాజువల్" గా మనం సాధారణ మాటలు మాట్లాడుకొన్నట్లుగా చెప్పాడు.

"మొన్నో నలుగురు వ్యక్తులు
కొండపై రాత్రి విందు చేసుకొన్నాకా
ఉదయానికల్లా కొండ మాయమైందట
ఆ నలుగురే నదీ విహార యాత్ర జరిపిన మర్నాటికల్లా
నదీ, నదీ గర్భపు ఇసుకా అదృశ్యమయ్యాయని
ఆశ్చర్యంగా చెప్పుకొన్నారు

ఈ కవితలో కనిపించే ఆ నలుగురు ఎవరు? ప్రకృత సహజ సంపదను దోచుకొనే మహానుభావులే కదా! కొండమీద వారు విందు చేసుకున్నారు అంటే కొండలో దాగున్న ఖనిజ సంపదను దోచుకొనే పన్నాగంతోనే ఆ నల్గురు అక్కడ

చేరారని అర్థం. అట్లే నదిని, నదీ జలాలను, పంట చేలను దోచుకొని ధ్వంసం చేయడమే వారి ప్రధాన వ్యాసంగం. కవిత ముగింపు ఎంత అద్భుతంగా అల్లాడో చూడండి.

"ఇంతలో
'అలా జరగటానికి వేల్లేదు' అంటూ
రోడ్డుపై ఒకడు గొణుక్కుంటూ
గాల్లో ఏవో రాతలు వ్రాసుకొంటూ
అడ్డొచ్చిన నన్ను తోసుకొని సాగిపోయాడు
ఎలా జరగడానికి వీల్లేదటా?
అని ఆలోచించాను"

అంటూ సామాజిక విధ్వంశక మూలాలను మొదట కనిపెట్టేది మేధావులైన కవులు అని చెప్తాడో కవి. తరువాత ఈ అంశం ప్రజల్లోకి వెడుతుంది.

"అవునవును/ నాకూ అన్పిస్తోంది/ ఖచ్చితంగా అలా జరగటానికి వీల్లేదు" అంటూ జనం గొంతు కలపడాన్ని చివర చెప్తాడు కవి. జనంలో చైతన్యాన్ని రగిల్చేది నిజమైన కవిత్వంగా ఈ కవి భావిస్తాడు.

"నాన్నతనం" అనే కవితలో కొత్తకోణంలో నాన్నను ఆవిష్కరించాడు కవి. అందరూ అమ్మను, అమ్మతనాన్ని పుంఖాను పుంఖాలుగా రాశారు. ఈ కవి నాన్న కాపురాన్ని ఎట్లా ఈదుతాడో, ఏ విధంగా కుటుంబానికి సేవ చేస్తాడో గొప్పగా ఆవిష్కరించాడీ కవి. నాన్నని మనమేవిధంగా గుర్తించవచ్చునో చెప్తూ–

"పార్కులో రెండు చేతుల్తో పీచు మిఠాయో
పల్లీల పొట్లాలో తీసుకెల్తూ కనిపించవచ్చు.....
"ఏ పేవ్ మెంటు మీదనో
స్కూలు బేగ్గో, షూసో కుట్టిస్తూ కంటపడొచ్చు....

పార్కు బెంచీపై కూర్చొని మిత్రులతో
కొడుకు సంపాదన, కోడలి మంచితనం
మనవల అల్లరిని కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తూ
కనిపిస్తుంది.... నాన్నతనం" అంటారు.

నాన్న యౌవనంలో ఉన్నప్పటినుంచి వృద్ధాప్యంలోకి వచ్చిన దాకా ఆయన దినచర్యలను పూసగుచ్చినట్లు వర్ణిస్తాడు కవి.

"చిట్టికురువి" కవిత పర్యావరణ పరిరక్షణ మీద రాసిన కవిత. పచ్చదనం అంతరించిపోవడం, పిట్టలు రాలిపోవడం, దీనికి రాణమైన వస్తువులను ఉదహరించడం ద్వారా చెప్పాడు కవి. చివర పసిపాప హృదయం ఎంత ప్రేమలాలిత్యంగా అమాయకత్వంలో పొదవుకున్న మంచితనాన్ని పట్టిస్తుంది.

"ఒక చిన్నారి పిట్ట
నిలువ నీడలేక, దాహం తాళలేక
నేల కూలింది/ మానవుడు తయారుచేసిన
గొడ్డళ్ళన్నీ పిట్ట చుట్టూ చేరి
దీనంగా చూస్తున్నాయి…

రంపాలన్నీ
ఆ పిట్టకొరకు
కన్నీరు కారుస్తున్నాయి
బుల్ డోజర్లన్నీ పిట్టను బతికించమని
తొండాలెత్తి ప్రార్థిస్తున్నాయి
అయినా మనిషి జాడ లేదు"

అంటూ మనిషి ఆయుధాలు సైతం కనికరం చూపుతున్నా పిట్టయెడల మనిషికి ఇసుమంత బాధలేదు.
పసిపాప

"మెల్లగా నడుచుకొంటూ వచ్చి
"చిట్టి కురివీ" నిన్నెవరు కొట్టారమ్మా"
అంటూ పిట్టను చేతిలోకి తీసుకుంది
వేళ్ల కొనలలోంచి జలపాతాల్ని పుట్టించింది
దాహం తీర్చుకొన్న పిట్ట
పాపచుట్టూ కాసేపు తిరిగి ఎటో ఎగిరిపోయింది"

అంటూ పాప సహృదయతను ప్రేమను ఎత్తిచూపుతాడు కవి. ఇందులో మరో అంశం, గొడ్డళ్ళు, రంపాలు బుల్ డోజర్లు మానవుని చేతిలో ఆయుధాలు. వాటికి కూడా హృదయమున్నట్లు, స్పందించినట్లు చెప్పటం కవి చాతుర్యం.

కాని మనిషికి హృదయంవున్నా ప్రకృతిమీద ప్రేమ లేదు, పశు పక్ష్యాదులమీద జాలి లేదు.

"మూడో కన్నీటిచుక్క" లో మొత్తం 78 కవితలున్నాయి. ప్రతి కవిత అనుభవాలను, అనుభూతులను ఆరవోసాయి. ట్రన్స్ పరెంటు చీకటిలా కనిపించినా, లోనవిషయం లోతుగా పాఠకుణ్ణి ఆకర్షిస్తుంది. సామాన్య స్పృహకు అతీతమైన చైతన్య స్థాయి కవిత్వంలో కనిపిస్తుంది. కవి కవిత్వంలో ఇంకిపోయి బయటకు వచ్చినట్లు సామాజిక తపన, అనుభూతి, లోకానుశీలన పుష్కలంగా కనిపిస్తుంటాయి. "మూడో కన్నీటిచుక్క" అందరూ చదువదగిన పుస్తకంగా భావిస్తూ కవిని అభినందిస్తున్నాను.

కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# కవిత్వం మూడో కన్నీటి చుక్క

డా. కాళ్ళకూరి శైలజ

కవికి దుఃఖం రావాలి. కాదు, కావాలి!
వైయక్తిక, సామాజిక, జీవన చిత్రం రకరకాల చెదపురుగుల బారినపడి, కొంచెం కొంచెంగా ఛిద్రమైపోతుంటే, ముందస్తుగా పట్టుకోగలవాడు నిస్సందేహంగా కవే.

మరి కవిత్వం చదవడానికి..?
మనసులో సహానుభూతి అనే జల ఉండాలి.
కాస్త రొక్కం కడితే చాలు, గంటలకొద్దీ వినోదం, కడవల కొద్దీ అవసరం లేని కన్నీళ్ళు, అస్థిరతను ఆవిష్కరించే కపటం, మన ఇంట్లోకే సప్లై చేసే రోజుల్లో . ఒక కవితనో, కవితల పుస్తకాన్నో చదవగల మెత్తని గుండె ఎవరెవరికి ఉంది? అలాంటి వారంతా రండి. రారండి.

సుతిమెత్తని, చదివించే పంక్తులను రాసి, "ఇదిగో కొన్నాళ్ళ నా ఆవేదన మూటి అంటూ, బల్లమీద పెట్టగల ధైర్యం ఎవరికుంది? బొల్లోజు బాబాకి తప్ప?

"ఒక దుఃఖం" ... అది సంఘటన కాదండోయ్! ఒక దుఃఖం.... అది సంభవించడానికి ముందున్న వాతావరణాన్ని- రైతు ఇంట భార్య దిద్దుకునే కుంకుమబొట్టులోనూ, ఆ పెరటి దండెంపై ఆరేసిన వెలిసిన చీరగాను, సాక్ష్యంగా ఉన్న వృక్షంలోనూ చూడగలగడం కవి చేసే సత్య దర్శనం.

ఈ కవికి తన కుటుంబంలో, తనలో, తన చుట్టూ ప్రతిరోజు ఎదురయ్యే ప్రతి వ్యక్తిలో, ప్రతి గుండెలో ఉన్న వైరుధ్యాలను చూడడం తెలుసు. వాటిని ప్రేమతో నిమరడం తెలుసు.

మరో కవి స్నేహహస్తాన్ని పావురం కన్నా మెత్తగా, నీరెండ కన్న వెచ్చగా స్పృశించిన సాహార్ధత ఈ కవికే సొంతమైన ప్రత్యేక లక్షణం. ఈయన అస్తిత్వం అంతా జీవం లేనట్టుగా తోచే "సజీవ చైతన్యం" తో సంభాషించగల అనురాగమే. ఆ రాగాలాపనకు మనం చెవి ఒగ్గక తప్పుతుందా? గులాబీ మొక్క లైబ్రరీలో పేజీలు తస్మరించబడిన వెల్తురు వాక్యం, ఇసకలో దొరికిన గవ్వ....ఇలా ఎన్నో

వలస పక్షులు, వట్టిపోయిన ఆవు, పాత ఫోటోలో రూపం...ఇలా ఎక్కడెక్కడో వెతికి మరీ, కవితా వస్తువులను లేత చివుళ్ళ లాంటి కవితలుగా మలచి మనకు బహూకరిస్తారు.

ఏ స్పర్శేంద్రియాలను మనం అబద్ధాల చీకటితో, జో కొడుతున్నామో, (కన్ను, చెవి,ముక్కు… అవి లుప్తమైన వారి అతీంద్రియ అనుభవాలను గుదిగుచ్చి, సత్యం-పేమ- దైవంగా మన ముందే Tangible గా ఆవిష్కరిస్తారు.

అద్దంలోనో, ప్రేమాస్పద నయనాలలోనో తప్ప చూసుకోనక్కర్లేని ముఖాన్ని….. ఎన్నో సెల్ఫీలు గా చెక్కుకుంటున్న ఈ తరం, “పరాయీకరణ పరాకాష్టను మన చేతిలోనే ఆరబోసి చూపిస్తారు. పైగా పరాయీకరణ అంటే మరో దేశ సంస్కృతి దాకా పోనక్షర్లేదు, “నీ నుంచి నువ్వ విడిపోవ డమే కాదూ…?” అంటూ మెత్తగా సూచించారు.

తన "నాన్న లా మారిపోయిన ఈ నాన్న ఎన్నింటి గురించి వాపోతున్నారో ?ఏళ్ళు గడిచిన కొలదీ అవే జాగ్రత్తలు చెప్తూ, ఆ మృదువైన సందేహమే వెలిబుచ్చుతున్నారు. “గుబులు గుండె గల తల్లిలా ఎన్ని బెంగ దీపాలను వెలిగిస్తున్నారో?

అంతలో అకస్మాత్తుగా బాధ్యత గల స్నేహితుని వలే 'కొంచెం కొంచెంగా ఆత్మను చంపేసుకుని, హృదయాన్ని అమ్ముకుంటున్నావేమో?” హన్నా! అని నిలదీసి కళ్ళెర్ర చేస్తారు కూడా.

అదృశ్యమైన పిట్ట పాటనీ, దైనందిన జీవితాన్ని శాసించే బడా వ్యాపార సంస్థల బోర్డు మీటింగ్‌లని తెచ్చి మన ముందుంచే నికార్సైన పాత్రికేయుడీయన. Mark Twain ఎప్పుడో చెప్పాడు: Sanity and Happiness are Impossible Combination… అని.

సమ్యక్ దృష్టి గలవారికి ఏ మతంలోనూ, ఏ ఇజంలోనూ ఇమడ నంత విశాలమైన PERSONA ఉంటుంది.

ఎపుడైనా ఒక సంఘటన మన అస్తిత్వాన్ని ప్రశ్నించినప్పుడు, ఓడిపోయిన భావన వస్తుంది. నాణేనికి రెండు వైపులున్నట్టు, వైరుధ్యాలు చీకట్లో నీడల్లా ఆవరిస్తాయి. అవి…..జననం, మరణం… వైద్యం, వైఫల్యం, ఆశ, నిస్పృహ…. వెలుగు, చీకటి, నిజంగా ఒక JCB తో తవ్వేస్తాయి.

ఒకసారి ఆకాశం ఏడ్చి, తెల్లవారే దాకా వెక్కిళ్ళు పెట్టగా, నిద్రకు నోచుకోని సందర్భాన ఈ పుస్తకం “మూడో కన్నీటి చుక్క” లో మనసు ముంచుకోవచ్చు.

మనలను మనం తమాయించుకోవడానికి కవిత్వం ఒక గుడిసె, గుడి గుండెలో, "వదిలించుకోలేని, అవాంఛిత స్వప్నాలు, చెరగని మరకలు" ఉంటే, ఆ "పూడిక తీస్తే బాగుండును" అని ఎవరు అనుకోరు?

అలాంటి సమయంలో, బాబా తానొక స్త్రీ మూర్తిగా మారి ఇన్ సెనిరేటర్ లోకి, "శానిటరీ నాప్కిన్ తో పాటు కొన్ని ఐడియాలను, సంకోచాన్ని వదిలించుకోవాల్సిన సమయం వచ్చిందని ప్రబోధించగలరు.

"మనిషి చేయాల్సింది జీవన గమనంలో పదేపదే పునః సృష్టి" అని కాస్త ధైర్యం ఇవ్వగలరు.

"అలవాటునీ, అస్వతంత్రతనీ కావలించుకుని, అధైర్యంలో తమలో తాము ముడుచుకుపోయి పడుకున్నారు." అంటూ అలనాడు, "అమృతం కురిసిన రాత్రి" లోకి, '"అమరత్వం'లోకి తిలక్ తీసుకు వెళ్ళలేదూ??!!! అచ్చం అలాగే కవితల పుస్తకంలో ఒక గద్యం పెట్టిన బాబా, 'దారిని, ఆ దారి మరిచిపోగల గమ్యాన్ని, ఒక పెద్ద హోర్డింగ్ పైన, నిలువెత్తు ప్రకటనలా వ్రాసి పెట్టారు. గమ్యం ఎక్కడో తెలియక పోయినా, కంటకాలు ఎన్నో ఉన్నా గమనంలో మెలకువగా ఉండమని హెచ్చరిం చడం ఇది.

కీమోథెరపీ వలన రాలిన తలవెంట్రుకల చుట్టను ఎలా చూపిస్తారో, అదే సెన్సిటివిటీతో, ఒక పాత్రికేయురాలు హత్యకు గురి అయినప్పుడు, "ధిక్కార స్వరంతో మరిగిన రక్తం బహూకరించిన వర్ధంతి ఇదీ అంటూ ఆ మరణాన్ని జాతికి అంకితం ఇస్తారు కవి.

మనసులో క్షమాపణలు చెప్పుకుంటూనే 'నెమలీకలు అమ్మేవాని" దగ్గర అవి కొనుక్కున్నా, "జరుగుబాటు లేక, తలగడనే గర్భంగా చూపి బిచ్చమెత్తుకోవడానికి సిద్ధమయే మహిళ పక్షాన నిలబడ్డా, ఎంపతీ అనే స్పృహ లేని 'గాజు సీసాలో ఉత్త మెదళ్ళ" స్పెసిమన్ లను చూపించినా, MCQ లఘుసమాధానాలకు "బిక్కచిక్కిన ప్రశ్న రగల్చలేని అవగాహన కోసం తాను మధనపడినా బాబా కవిత్వం ఒక రోజు, ఒక చోట కాదు, ప్రతి రోజూ, విశ్వమంతా కలయతిరిగే సూర్య కిరణంలా వెలుగును ప్రసరిస్తూనే, ఎరుకను చురకలా వేస్తూ..... పెట్రోలింగ్ చేస్తుంది.

వస్తు వినిమయ ప్రపంచంలో...... "ఇలలో ఏది కొనాలో, నిద్రలో ఏం కల కనాలో" కూడా శాసించే రిమోట్ కంట్రోల్‌కి లోబడి వ్యవస్థ చెప్పినవన్నీ... వినీ, చూసి, తిని , పూసుకుని , చివరికి మన అనారోగ్యాన్ని కూడా వాళ్ళిచ్చే "కార్డు పరిమితికి సరిపడా వైద్యం చేయించుకునే సమయంలో, బాబా మంద్రంగా శంఖారావం ఇలా మన చెవిలోకి ఊదుతున్నారు....

"ఈ ప్రపంచం నిన్ను ఎలా చూడాలనుకుంటున్నారో
అలా వేషం కట్టి ఆత్మలోకంలో అమ్ముడు పోకు!
ఏవి నీకు ఉండకూడదని ఆశిస్తోందో
అదేనీ అస్తిత్వం వాటిని కోల్పోకు
కర్ణుడు కవచకుండలాలను కోల్పోయినట్టు
ఇంకొకరి అభిప్రాయంగా ఉండే కన్నా
నువ్వే ఓ సిద్ధాంతంలా మారు"

ఔను సుమా....కర్ణుడు ఎప్పుడు దానకర్ణుడు గానే మిగిలిపోయాడు. ఆ టైటిల్ కోసం అతడు సింహాసనాన్ని పెద్దన్న హోదాను, చివరకు ప్రాణాన్ని పణం పెట్టాల్సి వచ్చేసింది. వ్యవస్థ ఎప్పుడూ నిన్ను ఏదో వదులుకోమని అంటుంది. అది నిజానికి నీ సహజ సంపద అని కవి సూచిస్తున్నాడు.

ఈ కవికి తన కుటుంబంలో, తనలో, తన చుట్టూ ప్రతిరోజు ఎదురయ్యే ప్రతి వ్యక్తిలో, ప్రతి గుండెలో ఉన్న వైరుధ్యాలను చూడడం తెలుసు. వాటిని ప్రేమతో నిమరడం తెలుసు. తర్వాత ఒక గొప్ప న్యాయమూర్తిలా సత్యోపదేశం చేయడమూ తెలుసు. అందుకే ఈయన.....

"సరైన పదం కోసం చీకట్లో తడుముకుంటూ ఉంటే
చేతికి సూర్యుని ముక్క తగిలిందొట!
ఎప్పటికైనా పద్యమే ఉదయ కాంతి"
అని ఛాతి ఉప్పొంగగా ప్రకటిస్తాడు.

సాధారణంగా, ఆకాశానికి గుంజలు అంటూ ఉంటాం. అది పరిపాటి. కానీ, ఆకాశము, గుంజలు రెండూ ఊహ రూపాలే. ఆ పోలిక కన్నా బాబా 'కాంక్రీటొ గా ఇలా చెప్తారు...

గోదావరి నదిలో బోటు యాక్సిడెంట్ సమయానికి నది లోకి దూకి, కుల, మత వర్గాలకతీతంగా, కనబడిన ప్రతి మానవ దేహాన్ని నీటిలోంచి ఒడ్డుకు చేర్చి, ప్రాణదానం చేసిన గజ ఈతగాళ్ల గురించి ప్రస్తావిస్తూ.....

"మానవజాతి నౌకాయానానికి
ఏ చరిత్ర గుర్తించని, కనిపించని
తెడ్డు వీళ్ళు
మనుషులుగా మనం
పూర్తిగా వైఫల్యం చెంద లేదనదానికి
మిగిలిన ఒకే ఒక సాక్ష్యం వీళ్ళు..."

అవును తెడ్డు కనిపించవు కానీ, పడవకు నీటిమీద అవే కదా పాదాలు?! తన కృతజ్ఞతల జోతలు, గురువులందరికీ, పేరుపేరునా సమర్పించుకున్న ఆదర్శ విద్యార్థి వీరు. .....ఇంకా....... "ఫ్రేగ్ మెంట్స్" అంటూ వ్రాసారు.... అవి శకలాలు కావు, కవితా కలశాలు.

"విద్యామద్యం ఇక్కడ
MRP ధరలకే అమ్మబడును
ఉరేసుకోవడానికి పర్మిట్ రూమ్
సదుపాయం కూడా కలదు"

ఇది కార్పొరేట్ కళాశాల హాస్టళ్ల అసలు రూపమే.

"అభిమాన నటుడి ఫ్లెక్సీలు
హోరెత్తించే స్పీకర్లు
తూలిపోతూ
స్టెప్పులు వేస్తూ టీనేజీ పిల్లలు
దుఃఖం పొంగుకొస్తుంది"

తల్లితండ్రులుగా, ఉపాధ్యాయులుగా బాబా కన్నీళ్ల సముద్రపు ఉప్పు, మన కళ్ళలోనూ ఊరుతోంది.

ఓదార్చేదెవరు? ఎలా???

'ఏంతో స్వచ్ఛంగా
బోసినవ్వులతో ఇక్కడికి వస్తాం
మురికి, మురికిగా మారి,
ఏడుస్తూ నిష్క్రమిస్తాం"

ఈ స్థితి బాబా కవితలు చదవని వారికి. చదివినవారికి మాత్రం కాదు. ఈ కవితలు చదివితే హృదయ ప్రక్షాళన జరిగి తీరుతుంది. ఆత్మ పవిత్ర స్నానం చేస్తుంది.
"జీవించి ఉండడంలోని సౌందర్యం కొద్దికొద్దిగా అర్థం అవుతోందిట!! అనారోగ్యం నుండి కోలుకున్న బుడతడికి.... అరుగుపై కూర్చుని స్నేహితులు సైకిల్ తొక్కుతూ ఆడుకుంటూ ఉంటే, చూస్తూ ఉండగా... ఎంత గొప్ప చిత్రం మన ముందు ఆవిష్కృతం అవుతోందో!! గమనిస్తే అప్రయత్నంగా కళ్ళు చెమ్మగిల్లేంత ---.
పార్కులో రిటైర్ అయిన వృద్ధుడు తనతో తాను ఆడుకునే చదరంగపు బోర్డు దగ్గర, వేయబోయే తదుపరి ఎత్తు కూడా ఇలాంటి చిత్రాన్నే మన కళ్ళ ముందు నిలబెడుతుంది.
వ్యక్తిగతంగా నేను మాత్రం ఒక వాక్యం వద్ద ఆగిపోయాను...

చాలాసేపు పమిట కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ...... ఇది నాకు మరీ దగ్గరగా ఉన్నది.

జీవించడం అంటే ప్రేమించిన
ఒక్కొక్కరిని కోల్పోవడం కాదూ?
ఒక్క చావు వంద చావులను బతికిస్తుంది" అంటారు.

నన్ను వదిలి మరలిరాని లోకాలకు వెళ్లిపోయిన ఆత్మీయులందరికీ జ్ఞాపికగా నేను ఒక్కొక్క రోజును భరిస్తూ గడుపుతున్నాను, అర్థవంతమో, కాదో ...తెలిసీ తెలియని విధంగా...
ఇంతకూ,.... ఎక్కడా??????.......
ఈ మూడో కన్నీటి చుక్క ప్రభవించిన జన్మస్థానం? అది స్రవించిన బాట ఏది?? సాధించిన పరమార్థం ఏదీ ??

బాబా కవితలను వరుస క్రమంలో చదువుకుంటాను నేను. అదే బివివి ప్రసాద్ గారి కవితలు అయితే రాండమ్‌గా పాడుకుంటాను నా ప్రశ్నకు సమాధానం, ఆఖరు కవితలో చిట్టచివరి పంక్తిలో దొరికింది...

"ఏ రెండు కన్నీటి చుక్కలు ఒకేలా ఉండవు
వాటిని చూసినప్పుడు జారిన
మూడో కన్నీటి చుక్క కవిత్వం"

ఈ కవి, ఈయన కవిత్వం, సమాజానికి ఆక్సిజన్ ఇచ్చే మొక్క ఒక వ్యక్తి బాధలను తుడిచే చేతి రుమాలు, ఒంటరి మనసుకు నేనున్నాననే చూపుడు వేలు.

కవి గారూ, మీకు ధన్యవాదాలు...

డా. కాళ్ళకూరి శైలజ
మార్చి 2020

# బొల్లోజు బాబా 'మూడో కన్నీటి చుక్క' సమీక్ష

Abdul Rajahussain

కళ్ళు రెండే...ఏడిస్తే మొదట రాలేవి రెండు కన్నీటి చుక్కలే... ఈ మూడో కన్నీటి చుక్క ఎక్కడిది? ఇదే ---.ఈ జువాలజీ మేస్టారు చెప్పదలుచుకున్న అసలు విషయం.

ఈ జువాలజీ మేస్టారు కప్పల్ని,బొద్దింకల్ని, వాన పాముల్ని డిసెక్షన్ చేసి ఏ పార్టు ఎక్కడుందో పిల్లలకు చూపించినట్లే, తన కవిత్వంతో ఈ సమాజాన్ని డిసెక్షన్ చేసి రుగ్మతల్ని డిటెక్ట్ చేస్తున్నాడు కవి బొల్లోజు బాబా.

బొల్లోజు బాబా నాకు చాలా కాలంగా తెలుసు. సాహిత్య కార్యక్రమాల్లో అప్పుడప్పుడు కలుసుకోవడమేకానీ,ఎప్పుడూ సాహిత్య చర్చ చేయలేదు. కారణం ఇటువంటి సందర్భమేదీ రాలేదు. అయితే ఆయన కవిత్వంచదువుతూ వుంటాను, కానీ ఎప్పుడూ ఆయన కవిత్వంపై ఏదీ రాసినట్లు గుర్తులేదు. దాదాపు రాయలేదనే చెప్పాలి. దానికిప్రత్యేక కారణమంటూ ఏదీ లేదు. అలాంటి సందర్భం కానీ, ఆ సమయం కానీ రాకపోవడమే···!!

> బొల్లోజు బాబా జీవితాన్ని దగ్గరగా చూశాడు. స్పృశించాడు. అనుభవించాడు. అనుభవాన్ని అక్షరాల కవిత్వం చేశాడు

ఇదిగో ఇప్పుడు " మూడో కన్నీటి చుక్క " (డిసెంబర్ 2019 ) పేరుతో బొల్లోజు బాబా తాజా కవితా సంపుటిచదివాక ఇక రాయలేకుండా వుండలేకపోతున్నాను. కారణం ఆయన కవిత్వం అలాంటిది మరి. ఓ సారిచదివాక మళ్ళీ మళ్ళీ చదవాలనిపించి చదివాను. ఇన్ని సార్లు చదివాక కూడా ఏమీ రాయక పోతే . అది నా లోపం అవుతుంది. మంచి కవిత్వానికి అన్యాయం చేసినట్లవుతుంది.

బొల్లోజు బాబా..కేరాఫ్ యానాం.! నిజానికి కాకినాడలో నివాసం. అయితే ఆయన సాహిత్య ప్రస్థానమంతా యానాం తోనే ముడిపడి వుంది. ఎంతగా అంటే.. "యానాం విమోచనోద్యమం" (2007) గురించి ఓ పరిశోధక గ్రంథం రాసినంతగా..! "ఆకుపచ్చని తడి గీతం" (2009) పేరుతో గుండె తడిచేసే తొలి కవితా సంపుటి వెలువరించాడు. ఆ తర్వాత "వెలుతురు తెర" (2016 ) ద్వితీయ సంపుటిగా వచ్చింది. మళ్ళీ మూడేళ్ళకు గానీ ---. ముచ్చటగా మూడోసంపుటి "మూడో కన్నీటి చుక్క " (2019) వెలువడింది.

కవిత్వంలో కొంచెం 'స్లో ' అయినా ---. కళిత్వంలో 'ఫ్లో ' మాత్రం మిస్ కానివ్వడు.

ఈలోగా అనువాదాలు. 2016లో రవీంద్ర కవీంద్రుని ' స్ట్రే బర్డ్స్' ను 'స్వేచ్ఛా విహంగాలు' పేరుతో తెలుగులో అనువదించాడు.

అలాగే సూఫీకవుల కవిత్వాన్ని "ఎడారి అత్తరు" గా తెనుగీకరించాడు. ప్యాబ్లో నెరూడా. ఇరవై ప్రేమ కవితల్ని తెలుగు సేత చేశాడు.

అలాగే రవీంద్రుని " క్రీసెంట్ మూన్, "గాథా సప్తశతి " వంటి అనువాదాలు చేశాడు.అంటే. సొంత కవిత్వం కంటే అనువాదాలే ఎక్కువన్నమాట. అయితే అనువాదాల్లో కూడా తన మార్క్ ను మిస్ కాకుండా జాగ్రత్త పడటం వల్ల, అనువాదాలన్నీ దాదాపు సొంత రచనల్లాగే కనబడతాయి.

నిజానికి జంతుశాస్త్ర మేస్టార్లకి హృదయం వుండదంటారు. కానీ బొల్లోజు బాబా ఇందుకు మినహాయింపు. వృత్తి జువాలజీ బోధన..ప్రవృత్తి కవిత్వ రచన.. పొంతన లేని వైవిధ్యాల మధ్య తనదైన ఉనికిని చాటుకుంటున్నాడు బొల్లోజు బాబా.

**సమాజమే కాన్వాస్ గా….!!**

మూడో కన్నీటి చుక్క కవిత్వానికి సమాజాన్ని కాన్వాస్ గా తీసుకున్నాడు. ఇంతకు ముందే చెప్పినట్లు సమాజాన్నిచీల్చి చెండాడి (డిసెక్షన్) నిజాల్ని వెలికి తీశాడు. నిజం ఎంత నిష్టూరమైనా వెల్లడించడంలో వెనకాడలేదు. కాకపోతే టముకు కొట్టినట్లు కాక చాపకింద నీరులా నిశ్శబ్దంగానే దుర్మార్గాల భాండాల్ని బద్దలు చేశాడు. అవసరమనుకున్నచోట నేలకేసి కొట్టాడు. ఏది చేసినా, ఎలా చేసినా సత్యాన్ని ఆవిష్కరించి పాఠకుడి ముందు పెడతాడు. ఆపై తీర్పు పాఠకులదే అంటాడు బొల్లోజు బాబా.

**విద్యుల్లత ఈయన కవిత్వం…**

బొల్లోజు కవిత్వం చదువుతుంటే ఒక్కోసారి ఆశ్చర్యం కలుగుతుంది.ఉన్నట్టుండి నల్లని మబ్బును చీల్చుకుంటూ ఓ మెరుపు మెరిసినట్లు.... సమాజంలో జరుగుతున్న అన్యాయాలపై కొరడా ఝుళిపించి నపుడు మనకు తెలీకుండానే మన మస్తిష్కంలో ఓ విద్యుల్లత తళుక్కున మెరుస్తుంది. పాఠకుడు ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా ..మెరుపు అనుభవాన్ని మిస్ అవుతాడు. అందుకే బొల్లోజు కవిత్వన్ని చదివేటపుడు బుర్ర దగ్గర పెట్టుకోవాలి.కవిత్వ మెరుపుల్ని ఒడిసిపట్టుకోవాలి. అనుభవించాలి.

ఉదాహరణకు ఈ కింది కవిత చూడండి.

భూమంటే విద్యుత్ కాంతుల్లో
బెల్లీ డాన్స్ చేసే ఆటకత్తె..వాడికి

భూమంటే..నొసటన దిద్దుకునే
ఆకు పచ్చని విభూతి పండు ...వీడికి

యుద్ధానంతరం
భూమికి వీరిద్దరూ
ఓ ఆరడుగుల బాధ్యత…!!" ( భూసేకరణ )

చూడ్డానికి ఈ కవిత చిన్నదే.... కానీ వ్యక్తీకరణలో ఎంతో గొప్పది.

ఈ మధ్య సెజ్ ల పేరుతో,రాజధాని పేరుతో, ప్రాజెక్టుల పేరుతో ప్రభుత్వం భూసేకరణ చేయడం చూస్తూనే వున్నాం. రాజ్యం ఎప్పుడూ ఉన్నోడి పక్షమే వహిస్తుంది. లేనోడ్ని పీల్చి పిప్పిచేసి, రోడ్డుపైవిసిరేయడం మామూలే. కార్పొరేట్లను బాగు చేయడానికి ,రైతుల భూముల్ని సేకరించి "సెజ్" ల పేర ధారాదత్తం చేయడం కొత్తేమీ కాదు. కాకినాడలో వుంటున్న బొల్లోజు బాబా కు "కాకినాడ సెజ్" కోసం ప్రభుత్వం చేసిన భూసేకరణ తతంగం తెలియంది కాదు.సెజ్ లలో పరిశ్రమలు పెట్టి ఇంతకు మరింత సంపాదిస్తాడు కార్పొరేట్. తనకు అన్నంపెట్టే నేలతల్లిని బలవంతంగా లాక్కొని కార్పొరేట్ కు కట్టబెడుతుంది ప్రభుత్వం. పరిహారం పేరుతో తూతూ మాత్రంగా రైతు కంట తడి తుడిచేట్లు నటిస్తుంది ప్రభుత్వం.

ఒకరికి (కార్పొరేట్ కు) భూమి విద్యుత్ కాంతుల్లో బెల్లీ డాన్స్ చేసే ఓ ఆటకత్తె...మరొకరికి ( రైతుకు) భూమంటే నుదుటన దిద్దుకునే ఆకుపచ్చని విభూతి పండు ....భేదమల్లా చూసే చూపులోనే కాదు...అనుభవంలో,ఆస్వాదనలో కూడా.!

నిజానికి ఒకడికి చెలగాటం..ఇంకొకడికి ప్రాణ సంకటం. భూసేకరణ యుద్ధం జరిగాక..జయాపజయాల్ని పక్కనబెడితే... వీరిద్దరికీ కావలసింది మాత్రం "ఓ ఆరడుగుల నేల". ఓ ఆరడుగుల బాధ్యత మాత్రమే.

బొల్లోజు కవిత్వం గురించి ఇంకేం చెప్పాలి. ఈ ఒక్క కవిత చాలదా..! అన్నమంతా పట్టి చూడాలా? ఒక్క మెతుకు చాలదా అది ఉడికిందో లేదో తెలుసుకోడానికి. అలాగే బొల్లోజు కవిత్వం పండిందో లేదో తెలుసుకోడానికి ఈ ఒక్క కవిత చాలదా? ఇంకా ఏం కావాలి?

క్షతగాత్ర నదీ.!.!

నది ప్రవాహ శీలి.జీవనది నిరంతరం ప్రవహించే జీవధార.కానీ మానవుడి స్వార్థం నదుల్నే ఎండబెడుతోంది. నదులు జీవం కోల్పోతున్నాయి. ఎండిన కన్నీటి చారికలా తమ గుర్తుల్ని వదిలేసి కనుమరుగవుతున్నాయి.

ఎడారి నగరాల నిర్మాణాల కోసం
నదిలోని ఇసుకను
యూనిట్లు యూనిట్లుగా తరలిస్తున్నారు.

ఇసుక నుండి కావలసినంత తైలం (సొమ్ము) పిండుకుంటున్నారు. ఇదంతా మనకు తెలిసిన బహిరంగ రహస్యమే. ఈ దుర్మార్గాన్ని "క్షతగాత్రనది " గా అభివర్ణించాడు బొల్లోజు బాబా. ఈ కవిత ముగింపులో అద్భుతమైన ప్రతిభను చూపాడు కవి.

"అపుడెపుడో మేసిన వెన్నెల్ని
చందమామ రజనుగా రోడ్డుపై కార్చుకుంటూ
క్షతగాత్ర నది
ట్రక్కులు ట్రక్కులుగా ప్రవహిస్తోంది
నగరం వైపు ..."

నిజానికి ఎన్నెల మేసి ఏరులు, నదులు, నెమరేయాలి. కానీ ఇసుకాసురుల వల్ల నదీ గర్భాలు ఒట్టి పోతున్నాయి. ప్రవాహాలకు ఆటంకం కలిగి ఎండోపోతున్నాయి. ఇప్పుడు నదుల్లో నీళ్ళు లేవు. నీళ్ళల్లో వెన్నెల లేదు.ఉన్నదల్లా ఇసుక. ఆ ఇసుకను లారీలకు లారీలు నింపి నగరాలవైపుకు ... తరలించుకు పోతున్నారు. నీళ్ళున్నప్పుడు మేసిన వెన్నెల్ని చందమామ రజనుగా కార్చుకుంటూ

క్షతగాత్ర నది ట్రక్కులు ట్రక్కులుగా నగరం వైపుకు ప్రవహిస్తోందంటాడు కవి. ఎంత అద్భుతమైన భావన.!

మనుషులూ..జీవితం..!!

మనుషుల్ని, జీవితాన్ని ఇంతగా అర్థం చేసుకున్న కవిని నేనిప్పుడు చూశాను. జీవితాన్ని వైభోగంగా కాక అనుభవంగా మలుచుకున్న వాళ్ళు మాత్రమే నిజమైన జీవితాన్ని అర్థం చేసుకుంటారు. బొల్లోజు బాబా జీవితాన్ని దగ్గరగా చూశాడు. స్పృశించాడు. అనుభవించాడు. అనుభవాన్ని అక్షరాల కవిత్వం చేశాడు ..!

జీవితం ముందుకే తప్ప వెనక్కు
ప్రవహించదన్న సంగతిని
ఏ స్వప్నమో నేర్పుతుందిలే “(పాఠం )

సర్దుకు పోవడమంటే
చచ్చిపోకుండా వుండటం అంతే
చరిత్రలో
మనిషేనాడూ సర్దుకు పోలేదు “(ఉదయకాంతి )

జీవిత పర్యంతమూ
పరిమళించీ పరిమళించీ
పూదోటగా విస్తరించడానికే
నువ్విక్కడకొచ్చావు “(పూలతోట )

జీవించడం అంటే
ప్రేమించిన ఒక్కొక్కరినీ కోల్పోవడం కాదూ..!” (Alone but together)

జీవితం
అప్పుడప్పుడు కాస్సేపాగి
తన సెల్ఫీ తానే తీసుకొంటోంది
ఒక్కో ఫోటో
రక్తమూ కన్నీళ్ళు నింపుకున్న
కవిత్వమై చరిత్రలో ఇంకిపోతోంది “..(సెల్ఫీ )

గొర్రెల మధ్య గొర్రెలా
నక్కల మధ్య నక్కలా బతకడం
చాలా సులువు
మనిషిలా
బతకాలనుకోవడం కన్నా !".

ఏ కవికైనా అనుభవం నేర్పే పాఠాలే కవిత్వం గా తన్నుకొని బయటకు వస్తాయనడానికి ఇంతకంటే రుజువులు అవసరమా?

ఈ సంపుటిలో చాలా కవితలు Narrative గా సాగుతాయి. సాధారణంగా Narration ను కథల్లో,నవలల్లో చూస్తాం. కవిత్వంలో అరుదుగా కనిపిస్తుంది. అయితే ఇప్పుడు రాస్తున్న వారిలో చాలామంది Narration పట్ల మొగ్గుచూపుతున్నారు. అయితే ఈ నరేషన్లో కవిత్వం లేకపోతే తేలిపోతుంది. శుద్ధ వచనంలా మిగిలిపోతుంది.

ఈ విషయంలో బొల్లోజు బాబా చాలా జాగ్రత్తపడ్డాడు. "Message in train, నన్ను క్షమించవూ, ప్రయాణం, ఒక..పురా..ప్రకాశం, Alone but together, ఒక apocalypse అనంతరం, ఏం పని వుంటుంది నీకు? తదతర కవితల్లో Narration ను చూడొచ్చు.

ఈ కవికి మానవ బంబంధాల పట్ల గౌరవం వుంది.ఈ కింది ఫ్రాగ్మెంట్ చూడండి .

సామాన్లు సర్దుతుంటే
పాత ఫోను కనిపించింది
ఆన్ అయింది చిత్రంగా
కాంటాక్ట్స్ లో అమ్మ నంబరు
అలాగే వుంది ".

ఈ సృష్టిలో అనంతమైంది అమ్మ ప్రేమ ఒక్కటే.అలాంటి అమ్మను నిర్లక్ష్యం చేస్తున్నాం. మనం ఎంత నిర్లక్ష్యం చేసినా అమ్మ ప్రేమ మాత్రం అలాగే వుంటుంది అనడానికిది నిదర్శనం.

ఈ విషయాన్ని ఎంత గుంభనంగా చెప్పాడో బొల్లోజు బాబా చూశారుగా. ఇలాంటి వ్యక్తీకరణలే కవి స్థాయిని పెంచుతాయి.

"గురుదేవులకు వందనాలు" కవితలో గురు శిష్య సంబంధాన్ని గొప్పగా చెప్పాడు.

"స్కూలు అంటేనే గురువులు
గురువులంటే నిన్నూ నన్నూ
గురిచూసి సంధించే విలుకాళ్ళు"

గురువులను విలుకాళ్ళుగా భావించడం బహుశా ఇదే తొలిసారి అనుకుంటా..

" స్త్రీ " అనే కవితలో చివరి స్టాంజా కంట తడిపెట్టిస్తుంది.

తన స్వప్నాల్ని బతికించుకోడానికి
ఓ కుర్రాడు నేత్రాల్ని అమ్ముకొని అంధత్వాన్ని,
హృదయాన్ని అమ్ముకొని అల్పత్వాన్ని
కొనుక్కుంటాడు.
నువ్వు ఇదివరకటి లా లేవు అంటుంది ఆమె.
కాలికింద నేల కూలినట్లు
అనిపిస్తుందతనికి..

ఆమె ఒళ్ళో చేరి
వలవలా ఏడ్చేస్తాడు
ఆమె
తన స్తన్యాన్ని అతని
నోటికి అందించి
ఓదారుస్తుంది !

త్యాగానికి ప్రతీక స్త్రీ మూర్తి. స్త్రీ స్తన్యం అమృతమనే దివ్యౌషధాన్నిచ్చే ప్రేమ కడలి.

ఇలాంటిదే మరొకటి.. "గుండె పూడిక ఎవరైనా తీస్తే బావుండు".. వంటి ప్రయోగాలు హృదయానికి హత్తుకొని ఆలోచింపజేస్తాయి.

వ్యక్తిత్వాన్ని గౌరవించే ఈ కవి.."ఇంకొకరి అభిప్రాయంగా వుండే కన్నా.! నువ్వే ఓ సిద్ధాంతంలా మారు " అంటాడు.

"ఇప్పుడీ దేశానికేమైంది? ఎవరిని వధశాలలకు పంపటానికి ఇది కుట్రలు పన్నుతోంది?" వంటి పదునైన పద ప్రయోగాలతో వర్తమాన పరిస్థితుల్ని కళ్ళముందు నిలిపాడు!

ఒకటా..రెండా? ఎన్నని చెప్పేది.మీరే చదివి తెలుసుకుంటే మరింత రస స్ఫూర్తి కలుగుతుంది.

చివరగా...ఈ మూడో కన్నీటి చుక్క ఏమిటో చెప్పి ముగిస్తాను.

ఏ రెండు
కన్నీటి చుక్కలు ఒకేలా వుండవు
వాటిని చూసినపుడు
జారిన మూడో కన్నీటి చుక్క
కవిత్వం !!

ఇప్పుడర్థమైందిగా..సమాజాన్ని చూసి,అనుభవించి రాసిన కవిత్వమే..! "మూడో కన్నీటి చుక్క!"

ఈ కన్నీటి చుక్క చాలా చిక్కనైనది..మంచి రంగు కలది..రుచికరమైంది. రుచి చూడటం ఇక మీ వంతు.!!

Abdul Rajahussain

# "మూడో కన్నీటి చుక్క" పై నా సమీక్ష

అవధానుల మణిబాబు

(శ్రీ బొల్లోజు బాబా "పాతూరి మాణిక్యమ్మ సాహిత్య పురస్కారం" అందుకోనున్న సందర్భంగా)

కవిత, వ్యాసం, అనువాదం, చారిత్రక అంశం .... ఏదైనా సాధికారంగా వ్రాసి, ధైర్యంగా ప్రకటించి ప్రశంసలను, విమర్శలను సమానంగా స్వీకరించి; సమకాలీన తెలుగు సాహిత్య రంగంలో తనదైన ముద్రను ప్రముఖంగా ప్రకటించుకున్న బొల్లోజుబాబా మూడవ కవితా సంపుటి "మూడో కన్నీటి చుక్క".

75కవితల సంపుటానికి ఈ బయాలజీ మాష్టారు ఈ పేరే శీర్షికగా పెట్టారంటే కన్నీటి గురించి ఇప్పటివరకూ నేర్చుకోనిది ఏదో తెలుసుకోవాలనిపించింది. ఒక కన్నీటి చుక్క అనేక ప్రోటీన్ల సముదాయమని; అందులో మూడు పొరలుంటాయని; కారణాన్ని బట్టి Basal tears, Reflex tears & Emotional tears గా విభజిస్తారని తెలిసింది. శరీరంలోని అన్ని ఘన, ద్రవ, వాయువుల గురించీ అన్నేసి విషయాలు పోగేసుకున్న మన పాఠ్యపుస్తకాల్లో ఈ కన్నీటికి కాస్తయినా చోటు లేకపోయిందే అనిపించింది. ఇంత 'విషయం' ఉంది కాబట్టే, వాటి విలువ తెలిసిన బాబాకు కవితావస్తువే కాదు, కావ్యానికి శీర్షిక కూడా అయింది.

బాబా కవితలను చదివేప్పుడు గతంలో ఓ కవితలో ఆయనే అన్నట్టు మెదడుతో తూకం వేస్తూ హృదయంతో మూల్యాంకనం చేసుకోవాలి. దాదాపు కవితలన్నీ స్వయంగా తాను అనుభవించిన సన్నివేశాలను లేదా ఆ సన్నివేశంలో/పాత్రలో తాను ప్రవేశించినడు కలిగిన అనుభూతులను కవితలుగా మలచినవే; ఎవరి అభిప్రాయాలను ఆధారం చేసుకునో అల్లినవి కావు. పూర్తి ఎరుకతో, నమ్మికతో వ్రాసిన కవితలు. ఓ చోట "భయ్యా, నేనన్నీ గమనిస్తూనే ఉన్నాను" అని ఒప్పుకున్నారు కూడా.

> చాలా కవితల్లో కవి ఎన్నో ప్రశ్నలను సంధిస్తారు. అంటే అవి ప్రశ్నాపత్రంలా వాక్యం చివర "?" తో ఉండవు. అంతర్గతంగా తమలో ప్రశ్నలను దాచుకుంటాయి. వాటికీ సమాధానాలు మనకే విడిచి పెడతారు,

బాబా కవిత్వ నిర్మాణ రహస్యమంతా నాకు 'వేడుక' కవితలో కనిపిస్తుంది. పసివాడు లోకాన్ని చూసి పొందే బాధ చూడలేక *"ఓ దేవత వాడి నేత్రాలపై బీజాక్షరాలను లిఖించి కన్నీటి బిందువులను కవిత్వంగా మార్చే వరమిచ్చింది"* .

అప్పటినుండీ ఇలా లోకం మరిన్ని దృశ్యాలను అతని కళ్ళల్లోకి వంపి కవిత్వాన్ని పిండుకుంటోంది. అంటే పైన చెప్పుకున్న విభజనలో Emotional Tears అన్నమాట.

ఇమేజరీ, పెర్సోనిఫికేషన్,అల్యూజన్,ఎక్కువగా అల్లిగోరి (అన్యాపదేశంగా మరేదో చెప్పడం), అడపాదడపా అస్పష్టత ... వెతికేకొద్దీ కావలసినన్ని. "కవిత్వ భాష" లో వీటన్నిటికీ ప్రసిద్ధ కవుల కవితా పంక్తులను ఉదాహరణలిచ్చి వివరించిన బాబా, ప్రతి అధ్యాయానికీ కావలసినన్ని ఉదాహరణలను ఈ సంపుటిగా మన ముందుంచారు. Side headings పెట్టి రాస్తే వ్యాసం కాస్తా వ్యాస రూప ప్రశ్నకు జవాబుగా మారుతుంది అందుకే, అక్కడక్కడా... ఒక్కొక్కటి.

- మొదటి కవిత శీర్షిక "ఒక దు:ఖానికి కొంచెం ముందు" . కవిత వ్రాసినది ఎప్పుడో అయినా సాహిత్యలోకం ఈ కవితను నిజంగానే ఇపుడు మనం ఎదుర్కొంటున్న "ఓ పెను ప్రాపంచిక దు:ఖానికి" ముందు చదివింది.

ఒక స్థితిని వర్ణించడానికి పరిసరాలను కాక పరికరాలను ఎలా వాడుకోవాలో కవికి తెలుసు అందుకే, *"కళాయి పోయిన అద్దంలో చూసుకుంటూ నుదిటిపై సూర్య బింబమంత కుంకుమ దిద్దుకుంటోంది"* అంటారు. కళాయిపోయిన అద్దం కవి చెప్పకుండా దాచిన చాలా సంగతులు చెప్పేస్తుంది. నేరుగా చెప్పేసి ఇదే కవిత్వం అనడంరాని కవి, బాబా. ఆత్మహత్యకు ఎంచుకున్న పద్ధతి ఏదైనా తరువాత దశ -మట్టిగా మారడమే. కానీ చెట్టుకు ఉరి పోసుకుని చనిపోయిన రైతు గురించి ఆ మాట సూటిగా చెప్పలేదు - "అప్పటికింకా అతను చెట్టు కొమ్మకు పిడికెడు మట్టై వేలాడలేదు" — అంటారు.

- *"నాన్నతనాన్ని బజార్లో ఎక్కడున్నా ఇట్టే గుర్తు పట్టేయవచ్చు*
  *సైజులు సరిపోకపోతే మారుస్తారు కదూ — అంటో బట్టల షాపులో"*- ఎంత సాధారణ సన్నివేశం. కవితగా చదివినపుడు ఎంత ఆర్ద్రమైపోయిందో హృదయం. కవిత చివరలో ఇంత చేసినా కేవలం వాటి ఫోన్లో ఒక కాంటాక్ట్ గానే మిగిలి పోతాం అని కాస్త బాధపెట్టి; తరువాత కవితలో "ఫోన్ చెయ్యడం మానుకున్న (ఓ) బబ్లూ గాడిని గురించి వాళ్ళ నాన్నకు గుర్తుచేస్తారు".

ఈ రెండు కవితలూ వ్రాసేటపుడు, పుస్తకంలో వేసేటపుడూ ఈ connectivity ని కవి ఆలోచించలేదు. తండ్రిగానూ అంతే. ఎవరూ భవిషత్తులో బాగా చూసుకుంటారా? లేదా? అనే విషయాన్ని ఆలోచించి పెంచం.

- పాపాయిని ఎత్తుకుంటే తోసేసిందిట, వాళ్ళమ్మకి ఇచ్చేస్తే సొట్ట బుగ్గలతో బోసినోటితో నవ్వుతోందిట –

    ఒక్కసారి అనిపించింది
    తిరస్కరించిన తరువాత
    ద్వేషించనక్కరలేదని
    చక్కగా ప్రేమించుకోవచ్చనీ!" —

పొరలుగా పొరలుగా ఒలుచుకోవాలే గానీ ఇది అన్ని బంధాలకీ వర్తిస్తుంది, కదూ! జీవితంలో అధిక భాగం మనం ఈ సూత్రం మరిచి తిరస్కరించిన వారిని ద్వేషిస్తూ గడిపేస్తాం. ఈ విద్య బాగా తెలిసిన వారు బాబా. అందుకే fb లో రాజపూజ్య, అవమానాలకు (రెండోవి సంఖ్యలో తక్కువే అయినా పట్టించుకోకుండా ఉండలేనివి) అతీతంగా అందరినీ ప్రేమిస్తూ సాగిపోతున్నారు. *"పట్టుబడిన ఎలుకలను ఊరవతల విడిచినట్లు నిన్ను బాధించిన వ్యక్తులను మరిచిపో"* అంటారు మరో కవితలో.

కొంచెం తీవ్రంగా చెప్పనట్టు అనిపించినా కాదనలేని శాశ్వత సత్యం – *"యుద్ధానంతరం భూమికి మనం ఓ ఆరడుగుల బాధ్యత"* ని గుర్తు చేస్తారు.

- అమ్మాయి తన పాతగౌనులను పంచి వచ్చిందిట, మర్నాడు ఆమె ఎప్పుడో నాటిన గులాబీ మొక్క కు ఓ పువ్వు పూసిందిట. అంటే — *"బహుశా ఎక్కడో ఎవరో ఓ పాప తనకు సరిగ్గా సరిపోయిన గౌనును చూసుకుని మురిసి పోయినప్పటి ఆనందం కావచ్చు, ఆ గులాబీ".* చి న్నపుడు law of conservation of energy చెప్పారు మా ఫిజిక్స్ మాస్టారు, బహుశా ఇదీ అలాంటిదేనేమో. లేదా బాబా నమ్మే బటర్ ఫ్లై థియరీ కావచ్చు.

- అన్నీ పునరావృతం అవుతాయని నమ్ముతారు, బాబా. తన ప్రతిబింబాన్ని చూసుకోవడానికి నాన్న ఇక్కడిక్కడే తిరుగుతున్నాడంటే ఎవరూ నమ్మటం లేదని, కానీ "రేపెపుడో నేనూ అలా కనిపించినపుడు నమ్ముతారు బహుశా!" అని ముగిస్తారు.

ఆవేశాన్ని అక్షరాలుగా మార్చి సమాజంలోకి పంపి, మార్పు సాధ్యమవుతుందని నమ్మడం మనలో చాలామంది చేసే పని. ఇందులోనూ వాళ్ళ నాన్నగారిని గుర్తు చేసుకుంటూ:

*"సమాజం పట్ల ఆవేశం కలిగినపుడు*

*హిందూ పత్రికకు ఓ ఉత్తరం వ్రాసి పారేసి*
*ప్రపంచం మారి పోతుంది అని కలలు కనేవాడు*
*ఇప్పుడు నేనూ అంతే, ఇంకేం చేయాలో తెలియక"* అంటారు.

ఈ సందర్భంలో సోమసుందర్ మాటలు గుర్తొస్తున్నాయ్ — "సమాజాన్ని కేవలం రచనల ద్వారానే సముద్ధరించగలమన్నది దురాశ. అయితే మనలాగే ఆలోచించే కొద్దిమంది ఆలోచనలకి, ఆశలకీ దీప్తి కలిగిస్తే చాలు. సామాజిక సమస్యలని సామాజికులే పరిష్కరించుకోవాలి. సామాజికులలో కవి భాగస్వామి".

బాబా విషయంలో ఈ పనిని రెండు తరాలూ కొనసాగిస్తున్నాయ్. కవి కాస్త వ్యంగ్యంగా "మేమిద్దరం రక రకాల పాలకుల్ని మార్చాం కూడా" అని చెబుతాడు గానీ గతంలో ఆయనే అన్నట్టు "అన్ని నిర్ణయాలూ ముందే అయిపోయాయి, ఏదో కాలక్షేపానికి జీవించాలి అంతే" .

- మంచి సందేశం, జీవన తాత్త్వికత చాల కవితల్లో పలకరిస్తాయి. "గతాన్నొక గాలిపటంచేసి ఎగరేసి దాని దారం తెంపెయ్యి" — దారం చేతిలో ఉన్నంతసేపూ నువ్వు గాలిపటాన్ని మోస్తున్నట్లే, బరువుండదుగానీ, దానిని పట్టిఉంచడం ఎంత బాధ్యతో? అన్ని సందర్భాలలో తెంచుకుపోవడం సులభం కాదు కదూ!

కవిత్వానికి ఔచిత్యం ప్రధానం. ఈ విషయం తెలిసినవాడీ కవి. అంతా అయిపోయాక ఏమీ చెయ్యలేనప్పుడు కొన్ని ప్రశ్నలు అనవసరం. అందుకే "ఎలాగా అనబోయి అలాగా అన్నాను" అంటారు. బతికుండగా ఎపుడూ గుర్తురానివారు మరణించాక అందరికీ తెగ గుర్తొస్తారు. వారితో బాటు పోయినవారితో సంబంధం ఉన్నవారంతా. అందుకే కవి "ఒక చావు వంద చావుల్ని బతికిస్తుంది" అంటాడు. "జీవించడం అంటే ప్రేమించిన ఒక్కొక్కరినీ కోల్పోవటం కదూ!" అనిముగిస్తాడు.

అలా అని జీవితం అంటే అంతే అనుకుంటామేమోనని మరో కవితలో "చివరి క్షణం వరకూ చెయ్యాల్సిన పనుల్ని చేస్తూండటాన్ని కాలంకూడా తప్పించుకోలేదు" అని చికెన్ షాప్ లో కోడిపుంజు మెడసారించి కూయడాన్ని గుర్తుచేస్తారు.

*"జీవిత పర్యంతమూ*
*పరిమళించీ పరిమళించీ*
*పూదోటగా విస్తరించటానికే*

*నువ్వు ఇక్కడకు వచ్చావు"*

అని దిశా నిర్దేశం చేస్తారు. ఒత్తిడి తట్టుకోలేక విడిచి పెట్టేస్తానంటావేమో – "పాదం బరువుకు ఒరిగిన పచ్చిక మెల్లమెల్లగా ఎలా నిటారుగా తలెత్తుకొంటోందో చూడు" అని ధైర్యం చెప్తారు.

★★★

విహారానికి వెళ్ళినపుడు ఎవరి కాలక్షేపాలువారివి. ఎవరి దృష్టి కోణం వారిది. కోరంగి (తూర్పుగోదావరి జిల్లలో మడ అడవులు) వెళ్ళినపుడు కొందరు చెక్కల వంతెన, జంతువుల ఆనవాళ్ళు, రకరకాల పక్షులు, చెట్లు చూస్తారు. మరికొందరు, పురాతన లైట్ హౌస్, వలయాకార మెట్లు ఎక్కి ఫోటోలు తీసుకుంటారు. ఏ ఒకడో మాత్రమే *"దూరంగా కనిపించే సువిశాల సముద్రాన్నీ, ఒగాల్ని, నగర హర్మ్యాలని, సుదూరంగా కనిపించే ఫాక్టరీ గొట్టాల్నీ శిధిలమైపోయిన ఒకనాటి కోరంగి మహానగరాన్నీ తదేకంగాచూసి మౌనభారంతో మెట్లు దిగుతాడు"* – అలా అందరికీ పట్టనవి చూసి మౌనభారంతో మెట్లు దిగేవాడు కవికాక మరెవరు?

రాత్రి బాస్ చేసిన ఫోన్ రిసీవ్ చేసుకోనప్పుడు *"24/7 సిగ్నల్స్ రిసీవ్ చేసుకోవడానికి నేను సెల్ టవర్నికాను, మనిషిని అందామనుకుని సారీ బాస్"* అన్నానంటారు. వాకాటి పాండురంగారావుగారు ఓసారి కథ గురించి చెబుతూ తాను కాదలచుకున్నదానికీ అయిన దానికీ మధ్య అఖాతాన్ని పూడ్చుకునే ప్రయత్నంలో రచయిత సన్నివేశాలు కల్పిస్తాడు, అంటారు. పై వాక్యాలు ఆ మాటలు గుర్తుచేశాయి. అన్నట్టు బాబాగారి కవితలో కథానాత్మక శైలి గురించి విమర్శకులెందరో చాలా వ్యాసాల్లో చెప్పేశారుగా. మనం మరో విషయానికి వెళ్దాం.

ప్రవేశ నిర్గామాల మధ్య మనం చేసిన ప్రయాణమే జీవితం. మరి మన జీవితాలను ఎలా గడిపేస్తున్నామో చెప్పడానికి ఎక్కువ పదాలు వాడరు, కవి –

*"ఎంతో స్వచ్ఛంగా బోసి నవ్వులతో ఇక్కడికి వస్తాం.*
*మురికి మురికిగా మారి ఏడుస్తూ నిష్క్రమిస్తాం"* అంటారంతే.

చాలా కవితల్లో కవి ఎన్నో ప్రశ్నలను సంధిస్తారు. అంటే అవి ప్రశ్నాపత్రంలా వాక్యం చివర "?" తో ఉండవు. అంతర్గతంగా తమలో ప్రశ్నలను దాచుకుంటాయి.

వాటికీ సమాధానాలు మనకే విడిచి పెడతారు, తాను చెప్పలేక కాదు, మనకేది తడుతుందో అని. ఈ సందర్భంలో ఎందుకో "ఎర్ర సీత" నవలలో గొల్లపూడి మారుతీ రావు చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. "ఆ సమాధానం వెనుక ఒక జీవితం ఉంది. ఓ ఛాలెంజ్ ఉంది. ఓ తెగింపు ఉంది. ఓ పరిష్కారం ఉంది. అంతకు మించి ఓ ముగింపు ఉంది. అయినా, సమాధానం చాలా క్లుప్తమయిందే." ఈ మాటలు బాబా ప్రశ్నలకు (ఆ మాటకొస్తే కవులందరి ప్రశ్నలకు) సరిగ్గా సరిపోతాయ్.

"వలస పక్షుల గానం" కవిత కొంత ఆశర్యపరిచింది. కన్నీటికి మూలం సాధారణంగా దు:ఖమే కదా! దుఃఖ నివృత్తి శ్లోకాలు (కాతత్ర పరివేదనా - ఎందుకు ఏడుస్తున్నావ్) పేరిట చిన్నపుడు కొన్ని శ్లోకాలు చెప్పారు. "ఇదం కాష్టం ఇదం కాష్టం నద్యామ్ వహతి సంగమాం సంయోగాశ్చ వియోగాశ్చ కాతత్ర పరివేదన". ఇవి బాబాగారు చదివుండరనే అనుకుంటున్నాను. వాటి సారాన్ని ఆధునిక కవిత్వ పరిభాషలో అద్భుతంగా చెప్పారు.

ఇక ఫ్రాగ్మెంట్లను సంపుటిలో చేర్చడం బాబా స్టైల్. ఇవి అదనం కాదు, అంతర్భాగం. కావాలని కుదించాలనో, పని గట్టుకుని పెంచాలనో కవి ప్రయత్నించనపుడు కలం కాగితంపై ఎంత మేర పరుగు దీసి ఆగిపోతుందో, కవి అక్కడే ఆపి ప్రచురించారు తప్ప అవి వచనకవితలే. అలాగే, "జీవించటమే ..." అనేది పారాగ్రాఫుల రూపంలో ఒకటిన్నర పేజీ సాగినది కవితేనా? అనే సందేహం వస్తే సమాధానం తన కవిత్వ భాషలో చెప్పారు బాబా. "కవిత్వ ఫార్మేట్లో వ్రాసిందంతా కవిత్వంకానట్లే వచనం రూపంలో వ్రాసిందంతా వచనమూ కాదు, ఈ రెండిటి మధ్యా సరిహద్దు రేఖ గీయటం అంత సులభం కాదు. ఉత్త సమాచారం కాక మరింకేదో అందించేదాన్ని కవిత్వంగా గుర్తించాలి" అని. ఇదిగో అలా "మరింకేదో" అందించడం వలన అది కవితయింది. ఇది కొత్త కూడా కాదు. అద్దేపల్లి 'ఇవ్వాళకి రేపు లేదు', 'దిగంతాల దాకా ఎక్కుపెట్టిన బాణం' వంటి కవితలను కవితా సంపుటాలలోనే ప్రచురించారు.

వచన కవితలో పాదవిభజనకు చెందిన లినియేషన్ గురించి బాబా చెప్పిన విషయాలు ఈ విషయంలో సందేహనివృత్తి చేసినా 'ప్రవచించే వాక్యం' లాంటి కవితలు కొన్నిటిలో (సుదీర్ఘ మైన పాదాలు ఉండవు కానీ) వచనత్వం పాలు ఎక్కువయింది.

బాబా ఎపుడూ నాకో మాట చెబుతారు — "విమర్శలో బాంబులు కురిపించాలి గురూ! అపుడు హోరాహోరీ చర్చ జరుగుతుంది" అని. అయితే, "కవిత్వ భాష" తెలుసుకుని, నేర్చుకుని, అధ్యయనం చేసి పుస్తకంగా వ్రాసిన వాడీ కవి. అందుకే నేనేమి చెప్పగలను? ఒక్క వైరి సమాసాల గురించి తప్ప. అవి వచన కవిత్వంలో ఉండకూడదననుగానీ, అన్ని ఉండకపోతే బావుంటుంది అని నమ్ముతాను.

"బొరియలోకి దూరింది కుర్రపీత - భూమిని మరోసారి ప్రేమించటానికి" అనే బాబా వాక్యంతో మన కబుర్లను ఇక్కడితో ఆపి, కవిత్వాన్ని ప్రేమించడానికి మరోసారి ఈ పుస్తకంలోకి దూరదాం.

అవధానుల మణిబాబు
4 సెప్టెంబరు, 2020

# మనసులను కుదిపే 'మూడో కన్నీటి చుక్క'

జోస్యుల దీక్ష

'చదువరి మనసులో దీపం వెలిగించడమే కవిత్వం చేసే పని' అంటారు ఇస్మాయిల్. శతాబ్దాలుగా కవిత్వ ప్రయోజనం విషయంలో ఉపదేశమా? ఆనందమా? అంటూ ఆలంకారికుల మధ్య వివాదాలు చెలరేగుతూనే ఉన్నాయి. నాకెందుకో ఈ విషయంలో ఇస్మాయిల్ గారి నిర్వచనమే బాగా నచ్చింది. ఆనంద ఉపదేశాల సమ్మేళనం నాకిందులో కనిపించింది. ఇప్పుడు ఈ నిర్వచనానికి అక్షరాలా బొల్లోజు బాబా గారి 'మూడో కన్నీటిచుక్క' కవితా సంపుటి నాకు లక్ష్య గ్రంథంగా అనిపించింది.

ఇటీవల వివిధ జర్నల్స్‌లో వస్తున్న కవిత్వాన్ని పరిశీలిస్తే కొన్ని చదవగానే ఇట్టే అర్థమైపోతున్నాయి. కాని అవి పేలవంగా ఉండి వచనాన్ని విడగొట్టి ముక్కలు చేసి రాసినట్లుగా అనిపిస్తున్నాయి. వాటిలో పెద్దగా కవిత్వంగాని, కవితాశిల్పం గాని కనిపించటం లేదు. మరికొన్ని కవితలు మొదటి నుండి చివరిదాకా ఎన్నిసార్లు చదివినా కనీసం అందులోని వస్తువుని కూడా పట్టుకోలేకపోతున్నాం. అలా రాయటం ఒక ఫేషన్ అనిపిస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో ఈ రెండు లోపాలను అధిగమిస్తూ వచ్చిన కవితా సంపుటే బాబా గారి ఈ మూడో కన్నీటిచుక్క అని నాకనిపించింది.

ఆనంద ఉపదేశాల సమ్మేళనం నాకిందులో కనిపించింది. ఇప్పుడు ఈ నిర్వచనానికి అక్షరాలా బొల్లోజు బాబా గారి 'మూడో కన్నీటిచుక్క' కవితా సంపుటి నాకు లక్ష్య గ్రంథంగా అనిపించింది.

నాకు కవితా సంకలనాలు చదివే అలవాటు కొంచెం తక్కువే. ఒక నవలో, ఒక కథో మనల్ని కూడా తీసుకు వెళ్ళినట్లు ఈ కవితా సంపుటులు తీసుకువెళ్ళవు అని నా ఉద్దేశం. నా ఆలోచన పొరపాటు కావొచ్చు. కొన్నిసార్లు చదవటానికి ప్రయత్నించినా ఎక్కడో ఒకచోట అవి నన్ను ఆపేసేవి. అలాంటిది బాబా గారి ఈ 'మూడో కన్నీటి చుక్క' మొదలుపెట్టాక అది నన్ను కడకంటా లాక్కొనిపోయింది.

ఒక నవలను ఒక పేజీ తరువాత మరొక పేజీ తిప్పుకుంటూ ఎలా చదువుకొంటూ పోతామో ఈ కవితా సంపుటి కూడా అలాగే మనల్ని తీసుకుపోతుంది. ఒక కవిత తరువాత ఇంకోటి, అందులో ఏం చెప్పేరు? ఎలా చెప్పేరు? అన్న ఉత్సుకత పుస్తకం పూర్తయ్యేదాకా మనల్ని ఆగనివ్వదు. కొన్ని కవితలు

కథలు చెప్తున్నట్లు, కొన్ని మనతో మాట్లాడుతున్నట్లు, కొన్ని ప్రశ్నిస్తున్నట్లు ... ఇలా వివిధ ఎమోషన్స్‌ని మన చేత మోయిస్తాయి.

ఒక రైతు ఆత్మహత్య చేసుకోవడానికి ముందు అతని చుట్టూ జరిగే సాధారణ సన్నివేశాల్ని 'ఒక దు:ఖానికి కొంచెం ముందు' అనే కవితలో గుండెలను పిండేటట్లు చాలా ఆర్ద్రంగా ఇలా చిత్రిస్తారు బాబా.

"చేను గట్టుపై కూర్చొని
ఎండిన పంటను
ఓదారుస్తున్నాడు,
ఇసుక నిండిన హృదయంతో
అప్పటికింకా అతని భార్యలో
సగభాగం ఖననం చేయబడలేదు".

అతను ఆత్మహత్య నిర్ణయం తీసుకోవడానికి ముందు వున్న పరిస్థితులను అన్నింటినీ వర్ణించారు. అతని భార్యలో సగభాగం ఖననం చేయబడలేదు ... ఈ పదాలు ఆ బంధం యొక్క బరువును పాఠకుడికి చాలా సులువుగా అర్థమయ్యేట్లు అమర్చారు కదా! కవి యొక్క ఆలోచనల లోతు పాఠకుడికి తెలిసేలా రాయటం చిన్న విషయం కాదు. ఇందులో భార్య కదా అందరికన్నా నష్టపోయేది అని అర్ధమౌవుతుంది.

"అప్పటికింకా ఆ చెట్టుకొమ్మ
ఉరికంబం పాత్రను ధరించలేదు"
అనటంలో సమస్తమైన సృష్టికి ప్రాణం పోసే చెట్టు కూడా ఆరోజు ఉరికంబం పాత్రను పోషించింది అనటం ఒక వైవిధ్యం.

"ఒక కవిని కలిసాను" అనే కవిత సమాజంలో కవియొక్క స్థానాన్ని చెప్పక చెపుతుంది.

"రేపతను తన ఇంటిలో ఉండకపోవచ్చు
రేపతను తన దేహంలో ఉండకపోవచ్చు
రేపతను తన ఆత్మలో ఉండకపోవచ్చు

కాని తన పేరులో సజీవంగా ఉంటారు''

అనటంలో ఒక కవి మాత్రం సంజీవిని వేసుకున్నట్టు సజీవంగా అతని పేరులో, అతని రచనలలో నిలిచి వుంటాడని సాధారణమైన పదాల కూర్పుతో చెపుతారు కవి.

'వేడుక' కవిత ఒక సరికొత్త అనుభూతిని కలిగించింది. ఇందులోని పసివాడు బాబాయేనేమో అనిపించింది.

''పాపం పసివాడు
లోకం ఎదురు పడ్డప్పుడల్లా
శోకంతో కన్నీరు మున్నీరయ్యేవాడు
వాడి బాధ చూడలేక
ఓ దేవత వాడి నేత్రాలపై
బీజాక్షరాలను లిఖించి
కన్నీటి బిందువులను కవిత్వంగా మార్చే వరమిచ్చింది''

మనల్ని బాధపెట్టే ఘటనలు చాలా తారసపడతాయి మనకి. ఆ బాధని కవిత్వంగా మార్చే వరం వున్న వాళ్ళకి మరిన్ని ఎక్కువ దృశ్యాలు హృదయాన్ని తాకుతాయి. అస్తమించే వరకూ ఆ దృశ్యాలకు, ఆ కవిత్వధారకు విశ్రాంతి ఉండదు.

'పిట్టగోడపై వాలిన పిచ్చుక' ...
''పిచ్చుకా !
నిన్నటి దాకా నీవు ప్రయాణించిన మార్గాన్నీ
పడిలేచిన నీ ఆత్మనీ చూడాలని అనిపిస్తోంది''

ఈ కవితలోని ఈ వాక్యాలను చదవగానే నాకు బాల్యపు తీపి గుర్తులను, బాల్యపు సంతోషాలను పోగొట్టుకున్న బాధ కలిగింది. మధుర జ్ఞాపకాలు అంతరించి పోయాయని మనసు చలించింది. గ్లోబలైజేషన్, నాగరికత, టెక్నాలజి అనే ఆయుధాల తో మనమే వాటిని హత్య చేసేము అనిపిస్తుంది. 'నిన్నటిదాకా' అనటంలో ఈరోజు ఆ పిచ్చుక లేదన్న భావం స్ఫురిస్తుంది.

''నాలుగు స్తంభాలు'' .... ఇది చదివితే మనిషి కాళ్ళు,కళ్ళు, మనసు అన్నింటిని ఐరన్‌లెగ్ అనాలేమో అనిపించింది. ఎక్కడ కాలు పెడితే, దేని మీద దృష్టి పెడితే అది

నశించిపోతుంది. ప్రకృతిని మాయం చేసేస్తాడని సాగే ఈ కవిత మొత్తం ఒక కథా కవిత కింద అనిపించింది అంత ఉత్కంఠంగా సాగింది.

'నాన్నతనం' ... అసలు నాన్న గురించి ఎంత బరువైన మాటల్లో ఎన్ని పేజీలు, పుస్తకాలు రాస్తే పూర్తవుతుంది. ఎన్ని రాసినా ఇంకేదో మిగిలిపోతుంది అనిపిస్తుంది. కానీ 'నాన్నతనం' కవితలో మనం రోజూ నడిరోడ్డు మీద చూసే ప్రతి సంఘటనలో ప్రతి మనిషిలో నాన్న ఉన్నాడని చెప్పేరు. ఇకనుంచి నాకు బాధ్యతగా పనిచేసుకున్న ప్రతి మనిషిలో ఒక తండ్రి కనబడతాడు. నాకే కాదు, ఈ కవిత చదివిన ప్రతి ఒక్కరికీ కనబడతారు.

'చక్కగా ప్రేమించుకోక' ... ఇది కూడా బాబా గారి నిశిత పరిశీలనకి ఒక చక్కటి ఉదాహరణ. ఈ విషయం గురించి కూడా రాయవచ్చా? ఇందులో ఇంత మంచి ఆలోచన తీసుకోవచ్చా? అనిపిస్తుంది.

"ఒక్కసారిగా అనిపించింది
తిరస్కరించిన తరువాత
ద్వేషించనక్కరలేదని
చక్కగా ప్రేమించుకోవచ్చనీ! "

తల్లిని వదిలి చిన్న పాపాయి మన దగ్గరకు రావడానికి ఇష్ట పడదు. వచ్చిన తర్వాత ఏడుస్తుంది. అమ్మ దగ్గరకి వెళ్ళగానే మనల్ని నవ్వుతూ పలకరిస్తుంది. దాని గురించే చెప్పేరు. మనం ఎవరినైన తిరస్కరించినా ద్వేషించనవసరం లేదని కొత్త సందేశం మనకి చెప్పేరు.

'ఆ మూడు రోజులు' ... నేటి సమాజంలో అవగాహనతో ఉండాల్సిన ఒక సమస్య. స్త్రీలలో ఋతుక్రమాన్ని ఒక దోషాచారంగా చూడాల్సిన సమయం కాదిది. దాన్ని రహస్యంగా చూడాల్సిన అవసరం లేదు. అది మన బాడీ నేచురల్ సైన్స్. ఈ కవిత ద్వారా ఆడవారికే కాదు, మగవారికి కూడా స్త్రీల సమస్యల పట్ల సానుకూల దృక్పథంతో, ఎలా ఆలోచించాలో అవగాహన కలిగించేలా రాసారు. ఇలాంటి సున్నితమైన విషయాన్ని ఎంచుకొని, గుంభనమైన పదాలతో కవిత నడిపించిన తీరు చాలా ప్రశంసనీయం.

"ఏక వస్త్ర, త్రిరాత్ర అంటూ
సౌందర్యాత్మక భాషలో కప్పెట్టిన
కొన్ని దైహిక రహస్యాల పట్ల
అసున్నితత్వం పొందాల్సిన సమయం వచ్చింది"

ఎంత సున్నితమైన విషయాన్నైనా సరే వినసొంపైన పదాల అమరికతో ఎదుటి వారికి సందేశాత్మకంగా ఇలా చెప్పొచ్చని నాకు తెలిసింది.

"పరిమళించిన ప్రేమ" ... ఈ కవిత ఆహ్లాదాన్ని కలిగించింది చదువుతున్నంత సేపు. ఇంత చక్కని ఆలోచనను ఎక్కడ నుండి తీసుకున్నారో.

"ఒకరోజు
తనకు బిగుతైన గౌనుల్ని బ్యాగులో పెట్టుకొని
స్కూలుకు తీసుకెళ్ళింది ఏదో చారిటీ ప్రోగ్రాం అంటూ
మర్నాడు ఉదయం ఒక గులాబీ
నవ్వుతూ ప్రత్యక్షమైంది ఆ మొక్కకు
చప్పట్లు కొడుతూ ఆనందిస్తోంది మా అమ్మాయి

ఆ దృశ్యాన్ని
బహుశా ఎక్కడో ఎవరో ఓ పాప
తనకు సరిగ్గా సరిపోయిన గౌనును చూసుకొని
మురిసిపోయినట్టి ఆనందం కావచ్చు
ఆ గులాబీ"

"జీవించటమే" ... ఒకరోజు హఠాత్తుగా ఒకదారి తన గమ్యాన్ని మరిచిపోయింది. ఇది కూడా ఒక కథలా ఉత్కంఠగా చెప్పేరు. ముగింపు ఏం ఇస్తారో అని ఉత్సుకత రేకెత్తింది. ఎక్కడో ఏదో వుంది అని అది మన దగ్గర వున్న దానికన్నా గొప్పదని భ్రమపడి వెతుక్కుంటూ కాలం వృధా చెయ్యటం కంటే మనలో ఏముంది, మనం ఏం చెయ్యగలం అని ఆలోచించాలి అని.

"కుంటుకొంటూ పడమరవైపు వెళుతోన్న అతన్ని చూస్తుంటే అర్థమైంది గమ్యం అంటే ఏమిటో ఇంకెప్పుడూ అది గమ్యం కొరకు అన్వేషించలేదు"

"అయితే ఏంటటా"... కొందరు మోసం చేస్తూ అడుక్కుంటున్నారు వాళ్ళని నమ్మి డబ్బులు వెయ్యకూడదు అని మనలో చాలామంది అనుకుంటాం. ఆ విషయాన్ని గురించే చెప్పిన కవిత ఇది. అసలు సిసలుగా జనాన్ని మోసం చేసే వాళ్ళని మనం మళ్ళీ మళ్ళీ నమ్ముతాం అని చెప్పేరు.

జనాల్ని ఎమోషనల్ బ్లాక్‌మెయిల్ చేస్తుంది... తప్పే!
పాయింటు బ్లాంకులో
నీ సంతకాలు పెట్టించుకొందా లేక
ఉపాధి కల్పన పేరుతో నీ భూములు లాక్కొందా?
నీకులాంటి జరుగుబాటు లేనివాళ్ళు
చచ్చిపోవాలా ఏమిటి?

ఇది చదివితే ఆ బిచ్చమెత్తుకునే వాళ్ళు మీద జాలి వేసింది. నిజంగా మోసం చేస్తున్న వాళ్ళని మన తరతరాల సంపదను దోచుకుంటున్న వాళ్ళని తలచుకొంటే మన మీద జాలిపడాలి మనం.

Alone but Together.... ... ఇది చాలా భావోద్వేగమైన కవిత. మనకు దగ్గరైన మనిషి కాలం చేస్తే ఆ మనిషి తాలూకు జ్ఞాపకాలు అన్నీ మనకు గుర్తుకొస్తాయి. ఆ మనిషితో పెనవేసుకున్న అన్ని బంధాలు, బంధుత్వాలు మన కళ్ళముందు మెదులుతాయి. అదే మన కళ్ళకు కట్టినట్టు చెప్పేరు ఈ కవితలో. "*ఒక చావు వంద చావుల్ని బతికిస్తుంది*" అనటంలో ఆత్మీయులు ఒక్కరెవరైనా మరణిస్తే వారితో అనుబంధమున్న వారంతా ఒక్కొక్కరు వరుసగా ఎలా గుర్తు కొస్తారో ఈ కవితలో చెప్తారు బాబా. ఈ కవిత చదవగానే బంధాలు చాలా విలువైనవి... బతికి ఉన్నప్పుడే వాటిని కాపాడుకోవాలి అనిపిస్తుంది.

"ఏం పని ఉంటుంది నీకూ...?" కవితలో ఇంట్లో వుండే ఆడవాళ్ళని పనిలేకుండా ఉంటారని చులకనగా చూస్తారు. కాని కవి ఈ కవితలో ఆమె పనితనాన్ని, ఆమె కష్టాన్ని వ్యంగ్యధోరణిలో వివరిస్తారు. ఆమె గనుక ఒక్కరోజు ఇంటిని పట్టించుకోకపోతే ఇల్లు ఇల్లులా ఉండదనే విషయాన్ని కళ్ళకు కట్టినట్లు వివరిస్తారు.

'అస్తిత్వం' ఈ ప్రపంచం ఏది నీలో వుండకూడదు అని అనుకుంటుందో అదే నువ్వు. అదే నీ వ్యక్తిత్వం దాన్ని వదులుకోకు దాన్నే ప్రేమించు అని ఎంత తేలికైన పదునైన మాటలతో చెప్పారో నిన్ను ఎలా చూడాలని ప్రపంచం అనుకుంటుందో అలా వేషం కట్టి మారిపోకు అని

"ఈ ప్రపంచం
ఏవి నీకు ఉండకూడదని ఆశిస్తుందో
అదే నీ అస్తిత్వం వాటిని కోల్పోకు
కర్ణుడి కవచకుండలాలని కోల్పోయినట్లు
ఇంకొకరి అభిప్రాయంగా ఉండేకన్నా
నువ్వే ఓ సిద్ధాంతంలా మారు" ... అంటారు

ఈ కవిత.. అణిచివేయాలని చూసే సమాజానికి ఎదురు తిరగాలి అనే స్ఫూర్తిని కలిగిస్తుంది. ఇలా ఇందులో వున్న కవితలన్నీ కూడా దు:ఖాన్ని, ఆనందాన్ని కలిగించాయి. కొన్ని ప్రశ్నించాయి. కొన్ని బాధ్యతని గుర్తు చేసాయి. కొన్ని కొత్త భావాలకు అక్షర రూపాన్ని ఎలా ఇవ్వాలో నేర్పాయి.

బాబా ఈ సంపుటి చివర కొన్ని మెరుపుల్లాంటి ఫ్రాగ్మెంట్స్‌ని ఇచ్చారు. మూడో కన్నీటిచుక్క అంటే ఏంటో చివ్వరి ఫ్రాగ్మెంట్స్‌లో ఇలా చెబుతారు.

"ఏ రెండు / కన్నీటి చుక్కలు ఒకేలా ఉండవు
వాటిని చూసినపుడు/ జారిన మూడో కన్నీటి చుక్క కవిత్వం"

ఈ సంపుటిలో మేధావి ప్రదర్శన ఎక్కడా కనబడలేదు. సృజన కనబడింది. కొన్ని కొత్త విషయాలు తెలిసాయి. ముఖ్యంగా చేరాల్సిన కవితా వస్తువులు అన్నీ పాఠకుడికి చేరాయి. అవును అలా చేరటమే కవిత్వం యొక్క పరమావధి. కవి యొక్క సాఫల్యత.

జోస్యుల దీక్ష
20 జూన్, 2021

# కవికి కృతజ్ఞతలు

Aravind Jashua

Bolloju Baba గారు ఏదో నన్ను ప్రేమించి తన "మూడో కన్నీటి చుక్క" కవితల పుస్తకం పంపించారు గానీ నిజానికి ఆ పుస్తకం గురించి విశ్లేషించే అర్హత నాకేమీ లేదు. ఆయన కవితలు fb లో పోస్ట్ చేయగానే చదవడం, ఆయన శైలికి, భావవ్యక్తీకరణ లోని నిజాయితీకి అచ్చెరువొందడం, ఆపుకోలేక ఆ కవితలలో ఒకదాన్ని నాకు ఒచ్చిన english లోకి మార్చి రాయడం తప్ప.

నేను జీవితంలో నిజంగా చదివిన కవితల పుస్తకాలు రెండే. 1) శ్రీ శ్రీ మహాప్రస్థానం 2) తిలక్ అమృతం కురిసిన రాత్రి. ఈ రెండూ కాకుండా రష్యన్ కవి పుష్కిన్ కవితలు కొన్ని ఇంగ్లీష్ లో చదివాను అంతే. వీటినే మాటిమాటికీ చదవడం తప్పించి కవితలు పెద్దగా చదివింది లేదు. మహాప్రస్థానం ఇంట్లో ఉండేది కాబట్టి చిన్నప్పుడు చదివినా ఒకటీ రెండు కవితలు తప్పించి మిగతా కవితల్లోని పదాలకి మనకి అర్థాలే తెలియకపోవడం వల్ల, శ్రీ శ్రీ గారి ఆవేశం తో మా నాన్నగారు relate చేసుకున్నట్టుగా నేను relate చేసుకోలేకపోవడం వల్ల అది తిరిగి పుస్తకాల షెల్ఫ్ లోపలికి వెళ్ళిపోయింది. ఇక మిగిలింది అమృతం కురిసిన రాత్రి. దాన్నే సంవత్సరాల తరబడి చదువుతూ, అనుభూతి చెందుతూ వస్తున్నా.

బాబా గారు సమాజంలో జరుతున్న ప్రతీ విషయం గురించీ స్పందించారు. అది ఎంత చిన్న విషయం అయినా అది ఆయన దృష్టి ని దాటిపోలేదు.

మహాప్రస్థానం కంటే అమృతం కురిసిన రాత్రి నన్ను ఆకర్షించడం వెనక రెండు కారణాలు ఉన్నాయనుకుంటున్నా. 1) నాకు కమ్యూనిజం లాంటి విప్లవ భావాలకన్నా ప్రేమ లాంటి సున్నిత భావాలు ఉండడం. 2) అమృతం కురిసిన రాత్రి సరళమైన, సులభమైన మామూలు మాటలలో రాయబడడం. నిజానికి మొదటికారణం కన్నా రెండోదే బలమైనది అనుకుంటా. ఆ సింప్లిసిటీ వల్లే అమృతం కురిసిన రాత్రి ప్రభావం మరింత ఎక్కువగా నా మీద ఉంది. బాబా గారి కవిత్వం పట్ల నాలాంటి మామూలు, కవి రచయితల సంఘాలలో అస్సలు కనిపించని వ్యక్తి కి ఆకర్షణ కలగడానికి కారణం అదే సరళత్వం, అదే సింప్లిసిటీ.

నిజానికి కవిత అనే formatలో ఏదైనా భావాన్ని వ్యక్తీకరించే రోజులు ఇంకా ఉన్నాయా అని అనిపిస్తోంది కొన్నిసార్లు. రొమాంటిసిజానికి రోజులు కావు ఇవి. బాబా గారు అన్నట్టు

*జీవితం అనే పదునైన కత్తి*
*కాలాన్ని -*
*ఆఫీసు, అనుబంధాలు, స్వప్నాలుగా*
*ముక్కలు ముక్కలు చేసి వడ్డించే"* ------ రోజులు ఇవి. ఒక 20 ఏళ్ల క్రితం నేను కవిని అని చెప్పుకుంటే ఎలాఉండేదో తెలియదు కానీ, ఈ రోజుల్లో నేను కవిని అని చెప్పుకుంటే జనం అవసరమా అన్నట్టు చూస్తారని అనిపిస్తుంది. అయినా ప్రస్తుత పరిస్థితుల్లో, ముందుకన్నా మరెక్కువగా మనకి కవుల, రచయితల, చిత్రకారులు, సినిమా దర్శకుల అవసరం ఉంది. మార్కెట్ అనే Molekh మన మెడకు డబ్బు అనే కేరట్ కట్టి గాడిద తన ఇరుసులో తిరుగుతున్నట్టుగా మనల్ని materialism చుట్టూ తిప్పుతూ, అవసరమైతే మత మౌఢ్యాన్నీ, కుల పిచ్చినీ కూడా మనకి inject చేసి మనం మనుషులం అని మర్చిపోయేలా చేస్తున్న ఈ రోజుల్లో, కవుల అవసరం మరింత ఉంది. రచయితల, చిత్రకారులు, గాయకుల, సినిమా దర్శకుల అవసరం మరింత ఉంది. మానవత్వం వైపు (ఒంటరిగా అయినా, వెలివేయబడి అయినా) నించుని గొంతెత్తి నిజాన్ని మానవత్వాన్ని, సరైన జీవిత ప్రాధాన్యతలని చెప్పాల్సిన అవసరం ఉంది. ప్రేమని పంచాల్సిన అవసరం ఉంది. ఒక alternative దృక్కోణం అవసరం ఇప్పుడు మరింతగా ఉంది. అదే బాబా గారి కవితల్లో నాకు కనిపించింది. కవిత్వం విషయంలో పామరుడినైన నన్ను ఆయన కవితలవైపు ఆకర్షించింది. ఎందుకంటే కవులు, కళాకారులు బాబా గారే "సృజన" అనే కవితలో అన్నట్టుగా –

ఏవి
అంతకుముందు లేవో
వాటిని కొందరు
గొప్ప కాంక్షతో, దయతో
అన్వేషించి
అక్షరాల్లో మనోప్రపంచాల్ని,
శిలల్లో భంగిమలని
రంగుల్లో ప్రవహించే దృశ్యాలను
అవిష్కరిస్తుంటారు.

వాటిని కొందరు
గొప్ప విభ్రమతో, లాలసతో
అలా చూస్తూనే ఉండిపోతారు ఏనాటికీ".

అదీ విషయం. సృజనాత్మకత, సృజనశీలుల అవసరం ఉంది. ఇప్పుడు మరింత ఎక్కువగా ఉంది.

★★★

మతం పేరుతో మారణకాండ జరుపుతూ, ఆవు పేరుతో సాటి మనుషుల్ని హత్యకావిస్తున్న ఈ రోజుల్లో- ఆవుని పూజించడం ఈ దేశంలోని హిందువుల సంస్కృతి అన్నది ఎంత నిజమో అది వొట్టిపోతే కబేళా కి పంపించి కొత్త అవుని కొనుక్కోవడం అంతే సహజం అని "కుట్రలు" అనే కవితలో బాబాగారు చెప్పినట్టుగా ధైర్యంగా చెప్పే కవుల అవసరం ఉంది.

"ఇపుడీ దేశానికి ఏమైంది
ఎవరిని వధశాలకు పంపడానికి
ఇన్ని కుట్రలు పన్నుతోంది?"
(కుట్రలు)

అని ఖుల్లంఖుల్లాగా నిజాలుచెప్పగల మానవత్వం గల కవుల, కవితల అవసరం ఉంది.

"భయ్యా! నేనన్నీ గమనిస్తూనే ఉన్నాను" అన్న కవితలో

ఇన్నేళ్ల మా స్నేహంలో
ఇటు పులిహోర బూరెలు అటు
అటు సేమియా బిర్యానీలు
ఇటూ ప్రవహిస్తూనే ఉన్నాయి" అన్న వాక్యంలో మనందరం మన ముస్లిం స్నేహితులని చూసుకుంటాం. కానీ తర్వాత వచ్చే పంక్తులే
"కానీ మొన్న జండాల పండగ రోజున
మైకులో
'వందేమాతర గీతం' వస్తుంటే దాన్ని
కూడబలుక్కుంటూ
వచ్చి రాని ఉచ్చారణలో వణుకుతూ అందరికీ వినబడేలా

అతను పైకి పాడడం చూసాక నా
కు భయం వేసింది"
– ఎలా మనం మన సోదరులని betray చేశామో గుర్తుచేస్తాయి.
★★★

చలం గురించి ఆయన స్నేహితుడు రామ్మూర్తి ఇలా అన్నాడట "chalam is a man with a woman's heart" అని. గొప్ప రచనలు గొప్ప కవితలు రాయాలంటే అమ్మాయిల మనసుకి ఉండే సున్నితత్వం ఉండాలి. స్పందించాలంటే, ఆక్రోశించాలంటే గుండెలో ఇంకా చెమ్మ ఉండాలి. అది ఉంది కాబట్టే బాబా గారు సమాజంలో జరుతున్న ప్రతీ విషయం గురించీ స్పందించారు. అది ఎంత చిన్న విషయం అయినా అది ఆయన దృష్టి ని దాటిపోలేదు. పోలవరం బోటు ప్రమాదం జరిగినప్పుడు ముందూ వెనకా ఆలోచించకుండా గోదావరిలో దూకి అనేకమందిని రక్షించిన చదువూ సంధ్యా లేని అనాగరికులైన గిరిజనుల గురించి ఎవరు వీళ్లంతా? అని మనం ఆలోచించామా? వాళ్ళు ఎవరో బాబా గారు ఇలా చెప్పారు.

"ఐస్ ఏజ్ నుంచి డిజిటల్ ఏజ్ దాకా
మానవజాతి నౌకాయానానికి
ఏ చరిత్రా గుర్తించని
కనిపించని తెడ్లు వీళ్ళు.
మనుషులుగా మనం పూర్తి వైఫల్యం
చెందలేదనడానికి మిగిలున్న
ఒకే ఒక సాక్ష్యం వీళ్ళు"
(ఎవరు వీళ్లంతా).
★★★

ఈ కవితా సంపుటి అంతా కొన్ని అద్భుతమైన expressions తో నిండివుంది. కొన్ని ప్రశ్నించేవి, కొన్ని తీవ్రంగా అనుభూతి చెందించి "wow" అనిపించేవి. పిచ్చుకల గురించి, చెట్లగురించి, కొండల గురించి, పాపల గురించి, నాన్నల గురించి, తనప్రియుడి పేరు పచ్చబొట్టు పొడిపించుకున్న అమాయకురాలైన ప్రేమికురాలిగురించి, చావు గురించి, బతకడంలోని మజా గురించి ,బతుకులో అస్తిత్వం కాపాడుకోవాల్సిన అవసరం గురించీ, అమ్మాయిల ఆ "మూడు రోజుల" గురించీ ఇంకా ఎన్నో. ఈ పుస్తకం గురించి ఇంకా రాయాల్సింది బోల్లంత ఉంది.

మనసుని తట్టే మాటలు ఈ పుస్తకం నిండా ఉన్నాయి. బహుశా గత 25 యేళ్లుగా నేను అమృతం కురిసిన రాత్రి చదువుతున్నట్టే అనేక సంవత్సరాలు "మూడో కన్నీటి చుక్క" చదువుతూనే ఉంటాను. పూర్తిగా నాలో ఇంకేవరకూ.

★★★

వైవిధ్యమే అందం. ఎదుటిమనిషిని judge చేస్తూ ఉన్నంతకాలం, ఎదుటివారికన్న నైతికంగా ఉన్నతులం అని భావిస్తున్నంత కాలం మనం వాళ్ళని ప్రేమించలేం. జీవితాన్ని ఆస్వాదించలేం.

బాబాగారు అన్నట్టుగా -

ఏ రెండు

కన్నీటి చుక్కలూ ఒకేలా ఉండవు.

వాటిని చూసినపుడు

జారిన మూడో కన్నీటి చుక్క

కవిత్వం.

★★★

ఇంతకీ బాబా గారిని నేనెప్పుడూ కలవలేదు. కానీ కలిసినపుడు ఏం మాటాడతాను? నేనేమీ కవినీ critic కాదు కాబట్టి ఆయన తన "ప్రవహించే వాక్యం" లో అన్నట్టుగా "నిర్మాణ వ్యూహాల గురించీ ఇప్పుడు బలంగా వీస్తున్న పరిణామాల" గురించీ అయితే మాట్లాడు కోము for sure. బహుశా "ఒక కవిని కలిశాను" కవితలోలా ఆయన చేతిని నాచేతుల్లోకి తీసుకుంటాను.

"పావురం కన్నా మెత్తగా

నీరెండకన్నా వెచ్చగా

కవిగా బ్రతికిన క్షణాల వాసన వేస్తూ" ఉన్న ఆ చేయిని అదిమి నా కృతజ్ఞతలు తెలియచేస్తాను.

Aravind Jashua

29, Feb 2020

# ప్రవహించే వాక్యం - మూడో కన్నీటి చుక్క

సుంకర గోపాల్

బొల్లోజు బాబా గురించి పరిచయం అక్కర్లేదు. ఆకుపచ్చని తడిగీతం, వెలుతురు తెర ద్వారా కవిత్వానికి పరిచయం. "కవిత్వ భాష" అంటూ చాలా సులభశైలిలో కవితా నిర్మాణ రహస్యాలను చేరవేసారు. ఇప్పుడు మూడో కవితా సంపుటి "మూడో కన్నీటి చుక్క" ద్వారా పలకరిస్తున్నాడు. తన కవిత్వంతో పలవరించమంటున్నాడు. మార్మికంగా చెబుతూనే పాఠకులు అందుకొనే కవిత్వాన్ని సిద్ధం చేశాడు. సున్నితమైన భాష, కవితాపరమైన నిర్మాణం, చెప్పాలనుకొన్నది చెప్పడం ఈ పుస్తకంలో గమనించదగిన విషయాలు. ఫ్రాగ్మెంట్స్ అదనపు ఆకర్షణ.

ఈ పుస్తకంలో రెండో కవిత "కలలు"

"జీవితం అనే పదునైన కత్తి
కాలాన్ని
ఆఫీసు, అనుబంధాలు, స్వప్నాలుగా
ముక్కలు ముక్కలు చేసి వడ్డిస్తుంది
దినాంతాన
స్వప్నాలు మాత్రమే
మన జేబులో మిగిలే
చివరి చిల్లర నాణేలు"

ఎలాంటి వ్యాఖ్యానం అక్కరలేకుండా 8 వాక్యాల్లో స్పష్టంగా 'జీవితం' లో ఏం మిగులుతాయో చెప్పాడు.

'చక్కగా ప్రేమించుకోక' కవిత ముగింపు వాక్యాలు ఎంత బావున్నాయో చూడండి

/ఒక్కసారిగా అనిపించింది
తిరస్కరించిన తరువాత
ద్వేషించక్కర లేదని
చక్కగా ప్రేమించుకోవచ్చనీ/

జీవితం పట్ల ఒక సానుకూల దృక్పథాన్ని చూపుతున్నాడు కవి.

ఇందులో స్త్రీని కేంద్రంగా చేసుకొని కొన్ని కవితలు ఉన్నాయి. "ఏం పని ఉంటుంది నీకూ...." అనే మగవాడి ప్రశ్నకు ఓ రోజు 'స్త్రీ' ఇంటిని పట్టించుకోకుంటే పరిస్థితి ఎలా ఉంటుందో అద్భుతంగా చెప్పాడు.

/ఇల్లు మొత్తం
క్వారీ పక్కన జుత్తు నెరసి
కాంతి నశించిన చెట్టులా ఉంది
అతను ఇంకెప్పుడూ అలా అనలేదు.

కవిత్వంలో సంక్షిప్తతకి బాబా బాగా ప్రాధాన్యం ఇచ్చారు. చాలా గంభీరమైన విషయాల్ని 6 లేదా 8 వాక్యాలలో చెప్పేశారు. అద్భుతమైన వ్యక్తీకరణ బాబా సొంతం.

భూమంటే విద్యుత్ కాంతుల్లో
బెల్లీడాన్స్ చేసే ఆటకత్తె – వాడికి
భూమంటే నొసటన దిద్దుకొనే
ఆకుపచ్చని విభూతిపండు – వీడికి
యుద్ధానంతరం
భూమికి వీరిద్దరూ
ఓ ఆరడుగుల బాధ్యత (భూసేకరణ)

సెజ్ లు, రాజధానులు, ప్రాజెక్టులు, రియల్ ఎస్టేట్ వ్యాపారాల కోసం జరిగే భూసేకరణ దృష్ట్యా ఈ కవిత రాశారు. మొదటి రెండు వాక్యాలు వ్యాపారివి, తరువాత రెండు వాక్యాలు రైతువి, చివరి వాక్యాలు 'భూమి' వి. భూమికి తేడా ఉండదు ఇద్దరిని కలిపేసుకుంటుంది.

ఈ మధ్య 'ఇసుక' బంగారమైన సంగతి మనకు తెలుసు ఇసుకాసురులు నదీగర్భాల్ని ఎలా నాశనం చేస్తున్నారో 'క్షతగాత్ర నది' అనే కవితలో బాబా అద్భుతమైన భావన చేశాడు. నదిని యూనిట్లు యూనిట్లుగా ఎడారి నగర నిర్మాణాల కొరకు తరలిస్తున్నారంటూ...

'మెలికలు తిరిగి, లుంగచుట్టుకొని
తరుచ్ఛాయల్ని తలచుకొంటూ

బుల్ డోజర్ కింద ఆదివాసీ చేసిన
అరణ్యరోదన గుర్తు చేసుకుంటూ
అపుడెపుడో మేసిన వెన్నెల్ని
చందమామ రజనుగా రోడ్డుపై కార్చుకుంటూ
క్షతగాత్ర నది ట్రక్కులు ట్రక్కులుగా
ప్రవహిస్తోంది నగరం వైపు

ఈ చిన్న కవితలో బాబాగారు వాడిన పదాలు నన్ను బాగా ఆకట్టుకున్నాయి. ఎండిన కన్నీటి చారికలానది, ఎడారి నగరాల నిర్మాణం, ఆదివాసీ అరణ్యరోదన, చందమామ రజను. ఈ పదాలు వాడి కవి చిత్రం చూపాడు. దృశ్యం గీచాడు. ఇది కవిత్వం చేసే గొప్పపని. ఆ రహస్యం బాబాకి తెలుసు. అందుకే ఈ పుస్తకంలో కవితలు ఏవీ మనల్ని నిరాశపరచవు.

కవితను అనుభవేకవేద్యం చేస్తూనే కవి చుట్టూ ఉన్న విధ్వంసాన్ని చూపాడు.

'గులకరాయి' కోరంగి మాంగ్రోవ్స్, కవితలు చాలా ప్రత్యేకమైనవి. మారేడు మిల్లి, కోరంగి ప్రదేశాలకు చాలామంది వెళ్ళి ఆస్వాదించి ఫొటోలు దిగి వస్తారు. కానీ బాబా కవి కావడం మూలాన. దాన్ని రికార్డు చేశాడు. 'గులకరాయి' కవితలో మొదటి మూడు లైన్లు నన్ను అబ్బురపరచింది.

'వాచీలో అపుడు సమయం మారేడుమిల్లి' ఈ కవితలో చివరిమాట 'వాచీలో అపుడు సమయం అడవి'. ఎంత మంచి ఊహలో చూడండి. కవిత్వం అది ఇవ్వగలగాలి. బాబా కవిత్వానికి హృదయం ఇచ్చాడు.

పుస్తకం చివరిలో ఉన్న 'ఫ్రాగ్మెంట్స్' ఒక్కొక్కటి ఒక్కో ఆణిముత్యం.

'ఏదో చేప వలలో చిక్కింది
భారంగా ఒడ్డుకీడ్చుకొచ్చారు
అదృశ్య కన్నీళ్ళకు
సంద్రం అనాదిగా ఉప్పుతేరుతూనే ఉంది'

ఇలా ఈ పుస్తకంలో వస్తువైవిధ్యం ఉంది. శిల్పనైపుణ్యం ఉంది. గుండెలతో హత్తుకునే కవిత్వం ఉంది. వెంటాడే దృశ్యాలున్నాయి. ఓ కథలా చెబుతూనే వాస్తవాలను, తన ఫిలాసఫిని బాబా నేరుగా మనల్ని తన వాక్యంలోకి తీసుకెళతాడు.

బాబా గారి కవిత్వంలో నినాదాలు ఉండవు. కథనాత్మక శైలిలో హాయిగా చదువుకుంటూనే మనకు ముల్లుగుచ్చుకుంటూ ఉంటుంది. ముల్లు తీయించుకోవడం ఉంటుంది.

కుట్రలు, భయ్యా! నేను అన్నీ గమనిస్తూనే ఉన్నాను, రక్తహేల, పర్సనల్ లాంటి కవితల్లో తన మార్గాన్ని స్పష్టంగా చెప్పాడు. అనుభూతి కవిత్వంలో సామాజికతను తప్పిపోనివ్వలేదు. తన గొంతును ధైర్యంగా వినిపించాడు. దాపరికాలు లేవు. కవితా నిర్మాణ రహస్యం తనకి తెలుసు. ఎంత క్లుప్తంగా కవిత్వాన్ని బట్వాడా చేయగలడో కవి.

గులకరాయి, కోరంగి మాంగ్రోవ్స్, తదుపరి ఎత్తు వస్తుపరంగా విభిన్నమైన కవితలు

జీవితం అప్పుడపుడూ కాసేపాగి
తన సెల్ఫీ తానే తీసుకుంటుంది
ఒక్కో ఫొటో రక్తమూ, కన్నీళ్ళూ నింపుకున్న కవిత్వమై
చరిత్రలోకి ఇంకిపోతుంది - (సెల్ఫి)

ఈ విధంగా బాబా అన్నట్టు 'గుండెపూడిక' ఎవరైనా తీస్తే బాగున్ను అన్నాడుగానీ గుండెపూడిక తీయగల కవిత్వం రాసిన బాబా అభినందనీయులు.

శ్రీ సుంకర గోపాల్

(కవి సంధ్య రజతోత్సవ june- july 2020 సంచికలో చేసిన సమీక్ష)

## మూడో కన్నీటి చుక్క – పరిచయం

కొండముది సాయికిరణ్

కథన కవిత్వమనేది మన సాహితీ ప్రపంచానికి కొత్తదైన విషయం కాదు. కొన్నేళ్ళ క్రితం 'వృద్ధ జంట' అనే కథన కవిత్వం తన బ్లాగు సాహితీ యానాంలో ప్రచురించారు బొల్లోజు బాబా గారు. దాని మీద వాడివేడైన చర్చ జరిగింది. ఆ చర్చలో ఒక ముఖ్యమైన సారాంశం కవిత్వంలో క్లుప్తత మీద బాబాగారి అభిప్రాయం వేరు.

కాబట్టి, క్లుప్తత పరిధిని దాటి బొల్లోజు బాబా గారి ఈ కవిత్వాన్ని చూస్తే బాగుంటుంది. ఈ పుస్తకంలోని చాలా పద్యాలు కథనకవిత్వం పోకడలోనే సా....గుతాయి. అయినా క్లుప్తత పరిధులు దాటి చూస్తే బాగుంటాయి.

కొన్ని కవిత్వాలు చదివి బాధపడతాం. కొన్ని చదివినందుకు బాధపడతాం. మరి కొన్ని చదవాల్సివచ్చినందుకు బాధపడతాం. కానీ, చదవలేనందుకు బాధపడాల్సిన కవిత్వం బాబాగారి 'మూడో కన్నీటి చుక్క' లో చాలా ఉంది.. విచిత్రం ఏమిటంటే, ఈ పుస్తకం శీర్షిక క్లుప్తంగా ఆయన వ్రాసిన ఒకానొక ఫ్రాగ్మెంట్స్ లోని ఒక అద్భుతమైన పద్యం :

ఏ రెండు
కన్నీటి చుక్కలు ఒకేలా ఉండవు
వాటిని చూసినపుడు
జారిన మూడో కన్నీటి చుక్క
కవిత్వం.

★★★

ఇక, బాబాగారి కవిత్వంలో మరో కోణం సామాజికత. సామాజిక నేపథ్యంలో వ్రాసే కవితల వల్ల సమాజం బాగుపడే అవకాశాలు అంతంత మాత్రమే. ఎందుకంటే, సాహిత్యంతో సమాజాన్ని ఉద్ధరించేయగలమనేది ఓ భ్రమే అన్నది నా అభిప్రాయం. ఈ అభిప్రాయానికి మూలకారణం, సామాజికత పేరుతో ఇప్పుడు వస్తున్న కుల కవిత్వాలు, వాద కవిత్వాలు. ఇవేవీ నినాదాల స్థాయిని దాటకపోవటమే.

కానీ, ఈ పుస్తకంలో నినాదాలు లేకుండా నేరుగా సమాజాన్ని స్పృశించే కొన్ని పద్యాలు ఉన్నాయి. అందుకు మొట్టమొదటి పద్యం ఓ స్పష్టమైన ఉదాహరణ.

ఒక దు:ఖానికి కొంచెం ముందు...
అప్పటికింకా అతను
చెట్టుకొమ్మకు పిడికెడు మట్టై
వేలాడలేదు
చేనుగట్టుపై కూర్చొని

ఎండిన పంటను
ఓదారుస్తున్నాడు, ఇసుక
నిండిన హృదయంతో.//

అప్పటికింకా ఆ చెట్టుకొమ్మ
ఉరికంబం పాత్రను
ధరించలేదు
పక్షిగూడు దిశగా పాకుతున్న
పామును
శ్రద్ధగా చూస్తోంది.

క్లుప్తత మీద ఆయనకున్న అభిప్రాయంతో ఏకీభవించను కాబట్టి, చివరి చరణాన్ని ఉదహరించటంలేదు.

★★★

అలానే రెండో పద్యం 'కలలు'

జీవితం అనే పదునైన కత్తి
కాలాన్ని
ఆఫీసు, అనుబంధాలు, స్వప్నాలుగా
ముక్కలు ముక్కలు చేసి వడ్డిస్తుంది
దినాంతాన
స్వప్నాలు మాత్రమే
మన జేబులో మిగిలే
చివరి చిల్లర నాణేలు

★★★

మనసుకు హత్తుకునే, ఆలోచింప చేసే పద్యాలు బోలెడు ఉన్నాయి ఈ పుస్తకంలో. ఏదేమైనా, బొల్లోజు బాబాగారు ఓ మంచి కవి, మంచి మనసున్న కవి, మానవత్వం ఉన్నకవి, మనిషి కవి, మనిషిని చదివిన కవి. కొనుక్కొని చదవాల్సిన కవిత్వం ఈ మూడో కన్నీటి చుక్క.

ఈ పుస్తకానికి గాను కృతజ్ఞతలు. మంచి పద్యాలు వ్రాసినందుకు మరిన్ని అభినందనలు.

# క్షతగాత్ర నదీ విస్ఫోటనం- బాబా మూడో కన్నీటి చుక్క !

డా.రాధేయ

ఈ రోజు కవిత్వం గురించి ఆలోచిస్తూ ఉంటే ఏదో ఓ కన్నీటిచుక్క టప్పున నా కాగితంపై పడి తడితడి గా మెరిసింది ఉలిక్కిపడి తలెత్తి చూస్తే..అది బొల్లోజు బాబా మూడో కన్నీటి చుక్కే..నని అర్థమైంది.

చూస్తుండగానే ఆ కన్నీటి చుక్కలు ప్రవహించే వాక్యాలు గా మారి పోయాయి. నేస్తమా.. నువ్వు నాతో రాగలవా అని నన్నగింది. సరే పదా అన్నాను .అలా ఆ వాక్యాల వెంటే సాగి పోయిన కవితా ప్రయాణం లో..

ప్రశాంతంగా కాలసముద్రం లో కలిసే
ఒక నది లాంటి కవిని కలిసింది.

ఇంకా ముందు కెళ్ళాను.మార్కెట్ సెంటర్లో ఓ మహా కవిని నాకు పరిచయం చేసింది. ఒకనాటి మహాకవి సెక్యూరిటీగార్డ్ వేషమెత్తి షోరూమ్ కు కాపలా కాస్తున్న విషాదాన్ని నాకు వివరంగా చెప్పింది.

అలా వెళ్తుంటే పిట్ట గోడపై వాలిన ఒంటరి పీచుకను చూపించి,నాగరికతా వేటుకు తెగిపడ్డ ఒక దేహావ శేషంగా పేర్కొంది.

కొన్నినీటి పొరలేవో కాంతికడ్డుపడినప్పటికీ నాన్నతనాన్ని సులభంగానే పోల్చుకోవచ్చు నని చెప్పింది.

గుండె నిండా విరిగిన వాక్యాలతో పాటు ఘనీభవించిన కన్నీరుంది ఎవరైనా గుండె పూడిక తీస్తే బావుణ్ణు.
అంటూ నావైపు సందేహంగా చూసింది.

స్త్రీలు సానిటరీ నాప్కిన్ తో పాటు కొన్ని బిడియాల్నీసంకోచాల్నీవదిలించుకోవాల్సిన సమయమొచ్చింది అంటూ సలహా ఇచ్చింది

ఒక చెవిటి వాడు కోయిల పాటను వినాలనిపిస్తే.. ఒక అంధుడు ప్రేమ ఎలా ఉంటుందో చూడలనిపిస్తే.. ఒక మూగవానికి దేవుడు కనిపిస్తే ఎలా మాట్లాలన్న సందేహం వస్తే .. ఎలా ఉంటుందని ఈమూడు అనుభవాలను నాతోపంచుకుంది.

ఎడారి నగర నిర్మాణాల కోసం తరలించ బడుతోన్న క్షతగాత్ర నది మమ్మల్ని పలకరించింది. వస్తూంటే చట్టరీత్యా నేరమని తెలిసీ సంతలో నెమలీకలు అమ్ముకొనే ఓ వ్యక్తి ఎదురైనాడు.

చిట్టి పాదాలకు చిగుళ్లు ఆనించి
ముని పంటితో ముళ్ళు ను తొలగించిన
అమ్మ జ్ఞాపకం మా కళ్ళముందు మెదిలింది

జీవించటమంటే
ప్రేమించిన ఒక్కొక్కరినీ కోల్పోవటమేనా..
అనుకున్నాం.

కర్ణుడు కవచ కుండాలాలు కోల్పోయినట్లు మన అస్థిత్వాలు కోల్పోకూడదు అంది
సరే నన్నాను

నీకు నువ్వే ఓ పూదోట గా విస్తరింపబడాలి
ప్లాస్టిక్ పూలపై తుమ్మెద వాలుతుందా చెప్పు అని ప్రశ్నించింది.

నేనూ మా నాన్న ఇద్దరం ఒకటే..ఎందుకంటే, మా నాన్నకు మా అక్క భద్రత పట్ల
నాకు నా కూతురు భద్రత..

ఇంద్రధనుస్సు వర్ణన ఒక అంధుడు చేసినట్లుగా ఉంటుంది గతం..

జీవితానికి సరిపడా జ్ఞానాన్నిచిన గురుదేవుళ్లను స్మరించు కుంటూ సాగిపోతూనే ఉంది ప్రవాహం.

నడిచీ నడిచీ అలసట తో నా అడుగులు ఆగిపోయాయి
కన్నీటి చుక్కల్లో తడి తడి జీవితాల్ని

చదివీ చదివీ నా కనురెప్పలు అలిసి పోయినా..
విస్తృతమైన జీవన సత్యాలు,
సామాజిక వాస్తవాలు

తెలుసుకొన్న తృప్తి తో బొల్లోజు బాబా కు హ్యాట్సాఫ్ చెప్పక తప్పదని పించింది. అప్పుడెప్పుడో బియ్యపు గింజ మీద తాజ్ మహల్ ను చెక్కిన ఓ అద్భుత కళా కారుణ్ణి గురించి విన్నాను. ఇప్పుడేమో..బాబా తన మూడో కన్నీటి చుక్కలో సంపూర్ణ జీవన వాస్తవికతను  ఆవిష్కరించాడని పించింది. కవిత్వం టెక్నిక్ ను వంట బట్టించుకున్న వర్తమాన కవి,విశ్లేషకుడు బాబా, కవిత్వనిర్మాణం తెలిసిన శిల్పి

అనువైన చోట్ల ,అపురూప పదచిత్రాలను కూర్చి, ఇస్మాయిల్ ను గుర్తుకు తెచ్చే నేర్పరి.

నాకు బాబా 2010 నుంచీ బాగా పరిచయం ,ఎందుకంటే..2010 లో నేనూ ఆయనా కలిసి ఒకే వేదిక మీద మాధవీ సనారా గారి అవార్డు "సిలపరశెట్టి రాములు స్మారక పురస్కారం" విశాఖ లో "కారా" మాస్టారు గారి చేతుల మీదుగా అందుకున్న సంఘటన నాకు గుర్తుకు వస్తోంది. నేను "అవిశ్రాంతం" కు, బాబా "ఆకుపచ్చని తడి గీతం" కు ఈ పురస్కారాలు అందుకున్నాం.

ఇప్పుడు మూడో కన్నీటి చుక్కలో

అద్భుతమైన జీవిత వాస్తవాల్ని చిత్రించిన బాబా కు నా కృతజ్ఞతలు చాలవు.
అప్పటి నుండీ మా సాహితీ స్నేహం అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంది.

డా.రాధేయ
30 Mar 2020

# గుండె పూడికను తీసేసే మధురాంబువు

Srinivasa Nyayapati

బొల్లోజు బాబాగారితో నాకున్నదల్లా ఈ ముఖపుస్తక పరిచయం. అముఖపరిచయం. అయితేనేం, వారి కవిత్వంతో మంచి పరిచయమే ఉంది, ఈ మాధ్యమంలో. ఈ మూడో కన్నీటి చుక్క నా చెంపమీదుగానూ జారి దొర్లింది. సరళమైన prose poems కుందుర్తి కాలానికే తెలుగులో మొదలయ్యాయి. "నా కవిత్వాన్ని సారళ్య సుందరి వరించింది." అని చెప్పుకోగలిగే కవులు కుందుర్తి తరువాత మనకు మరీ ఎక్కువమంది కనిపించరు. ఇదుగో ఇప్పుడు బొల్లోజు బాబా (తను అలా చెప్పుకోకున్నా) అదే కోవకు చెందిన కవి అని అనుకుంటాను నేను.

ఇస్మాయిల్ తరువాత అంత నిజాయితీగా నిరాడంబరంగా తను జీవించిన జీవితానికీ స్వానుభవాలకూ మాత్రమే అక్షరదర్పణాన్ని అందిచ్చిన కవి బొల్లోజు బాబా. బాబా తనే ఓ చోట చెప్పుకున్నట్టుగా తను జై శ్రీరామ్ అన్నా ఆ నినాదం వినగానే స్ఫురించే ఉద్యమానికి చేయూతనిచ్చేవాడుకాడు. అలాగే లాల్ సలామ్ అన్నా సరే ఒక రంగు జెండాని ఎత్తిపట్టుకొని ఒక పక్షానికే వత్తాసు పలికే రకమూ కాదు. ఏ రాజకీయ దుర్వాసనలూ అంటని మామూలు మనిషన్నమాట. ఈ మామూలు మనుషుల జీవనప్రయాణమే ఒక అసిధారావ్రతం. వీళ్ళు తమ ఆత్మావిష్కరణకోసం చేసే సుదీర్ఘమైన ప్రయాణం, ఈ ప్రపంచం గుండానే, ఈ జీవితంలో దొరికే ఓ పుంజీడు స్మృతులతోనే సాగుతుంది. బాబా దీనికి మినహాయింపు కాదు.

> ఇందులోని ప్రతి కవితా నన్ను స్పృశించినదే అని చెప్పాలి. ఆ స్పర్శ కోసం ఎదురుచూసినవాళ్ళకి బాబా కవిత్వం సహస్రహస్తాలతో వెలుతురు వేళ్ళతో స్వాగతం పలుకుతుంది. నేనీ స్వాగతాన్ని మన్నించి ఆహ్వానిస్తున్నాను. ఎందుకంటే బొల్లోజు బాబా నన్ను మార్చే ప్రయత్నం చెయ్యలేదు, సదా నేను నేనుగా ఉండే కవిత్వాన్నే నాకు ఇచ్చాడు. ఈ గుండె పూడికను తీసేసే మధురాంబువు చాలు నాకు.

బాబా కవిత్వంలో ఉన్నది జీవితంలో ఉన్నది. ఇల్లూ తలితండ్రులూ పిల్లలూ (ముఖ్యంగా పిల్లలు) ఇల్లువదిలి దూరాలు వెళ్ళడం ఒకరికొకరు దూరం కావడం nostalgia అన్నీ. ఇవేకాదు, ఆధునిక నగరజీవితపు డొల్లతనం కించిత్ రాజకీయ చైతన్యమూ కాస్త సామాజిక స్పృహానూ. అయితే బాబా తను రాసినదానిని కవిత్వంగా మలచడానికి ఏ ఒక్క ప్రత్యేకమైన టెక్నిక్కూ వాడకుండా నిర్మలఝరిని తలపించే శైలిలో సున్నితంగా మనం కోల్పోతున్నవి ఎత్తిచూపుతాడు. మనల్నే మనకి పునఃపరిచయం చేస్తాడు. ఆ పరస్పరపరిచయం పూర్తయాక మన వొళ్ళంతా ఏ కవనలేపనం అంటుకుంటుందో కానీ మనం విషాదమధురమైన బాధను అనుభవిస్తాం.

ఇందులోని కవితలు "వలస పోవటం.." చదివి పితావైపుత్రనామాసీత్ అన్నమాట తలుచుకున్నాను."రహస్య ప్రియురాలు" చదివి నేను సముద్రపొడ్డునుంచి తెచ్చుకున్న గవ్వను తడిమి చూసుకున్నాను. "నాన్నతనం" చదివి ఒక కొడుకుగా తండ్రిగా నా ఆత్రుతలూ అనుబంధాలూ ఏమిటా అని అవలోకించుకున్నాను. "గుండె పూడిక" చదివి నా గుండెలో దాన్ని దాచుకున్నాను. "Personal" చదివి హమ్మయ్య నాలాంటివారే ఈ కవి కూడా అని స్థిమితపడ్డాను. "గురుదేవులకు వందనాలు" చదివి నా గురుదేవులకు నమస్కారాలు అర్పించాను. ఇలా చెప్పుకుంటూపోతే ఇందులోని ప్రతి కవితా నన్ను స్పర్శించినదే అని చెప్పాలి. స్పర్శ. ఆ స్పర్శ కోసం ఎదురుచూసినవాళ్ళకి బాబా కవిత్వం సహస్రహస్తాలతో వెలుతురు వేళ్ళతో స్వాగతం పలుకుతుంది. నేనీ స్వాగతాన్ని మన్నించి ఆహ్వానిస్తున్నాను. ఎందుకంటే బొల్లోజు బాబా నన్ను మార్చే ప్రయత్నం చెయ్యలేదు, సదా నేను నేనుగా ఉండే కవిత్వాన్నే నాకు ఇచ్చాడు. ఈ గుండె పూడికను తీసేసే మధురాంబువు చాలు నాకు.

-వాసు-

# ప్యూర్ పొయిట్రి : బాబా మూడో కన్నీటి చుక్క

Iqbal Chand

బొల్లోజు బాబా కవిత్వంలో అర్థమైన చిత్రాలు చిత్రించి మన కళ్ళ ముందు చూపుతారు.
కవిత్వాన్ని చిత్రిక పట్టే రహస్యం బాబాకు బాగా తెలుసు. ఈ రహస్యం రాత్రికి రాత్రి అబ్బిందని నేను అనుకోవడం లేదు. బాబా కవిత్వం అనుభవం నేర్పిన పాఠం. అనుభూతులనించి పిండుకొన్న సారం.
బాబా కవిత్వం లో గందరగోళం లేదు.
ఇస్మాయిల్ గారు అన్నట్లు కవిత్వం లో నిశబ్దం అంటే ఏమిటో బాబా కు బాగా అర్థం అయింది. అందుకే తన భాషలో కొట్టండి, తిట్టండి, గిల్లండిలు కనిపించవు.
ప్రతి చిన్న సంఘటనకూ కదిలిపోయే సున్నిత హృదయం. అతిసున్నిత మైన భావుకత బాబా ప్రత్యేకత.

వర్తమాన తెలుగు కవిత్వంలో బాబా కొంచెం ఎడంగా కనిపిస్తారు. సైన్స్ అధ్యాపకుడు,చరిత్ర పరిశోధకుడు, సాహిత్య విమర్శకుడు అయిన ఈ కవులకు కొంచెం డిఫరెంట్ గా కనిపించడం నాకు సంతోషం.

ఒక కవితను ఎలా లాండ్ చేయాలో బాబా నించి యువ కవులు గమనించాలి.

"దినాంతాన
స్వప్నాలు మాత్రమే
మన జేబులో మిగిలే
చివరి చిల్లర నాణేలు"

వాద వివాదాల రొద లేకుండా మంచి ఈస్తటిక్స్ వున్న కవిత్వం ఇష్టపడే వారికోసం బొల్లోజు బాబా "మూడో కన్నీటి చుక్క"కవిత్వం సంపుటిని తప్పక ఇష్టంగా చదువుతారు.

ఒక మంచి కవి నించి మీరు ఏమి ఆశిస్తారో అంత కంటే అదనంగానే మీరు బాబా కవిత్వం నించి పొందుతారు.

Kavi Yakoob

ఇదేమిటి, ఈ మధ్యకాలంలో వస్తున్న కవితాసంపుటాలు ఒకదానిని మించి ఇంకొకటి మనసును హత్తుకునే స్థాయిలో ఉంటున్నాయి!?

అందులో ఈ బొల్లోజు బాబాను చదువుతుంటే మనసు ఉప్పొంగింది. ఎంత సున్నితంగా పదాలను లోపలికి జొప్పిస్తున్నాడు అన్పిస్తోంది. కవిత్వమర్మం ఎరిగిన అనుభవజ్ఞుడిలా ప్రతి పుటలోనూ కవిత్వాన్ని వారబోసాడు. అందులోంచి బయటికి రావడం కష్టమే.

ఇదివరకటి పుస్తకాలకు భిన్నమైన నడకను ఇందులో సాధించాడు. మార్మికతను అక్షరాలకు తొడిగాడు. సున్నితమైన అంశాలను ఒడుపుగా చెప్పే నిర్మాణాన్ని చిక్కించుకున్నాడు. అలతి అలతిగా చెప్పే పద్ధతి మరొక ప్రత్యేకత. కవిత్వంలో నిండుదనం ఉంది. సుకుమార భాష. ఎలుగెత్తి చాటాల్సిన అంశాన్నైనా ఒడుపుగా, ఒద్దికగా చెప్పడం. ఇవన్నీ కలగలిసి అత్యుత్తమ కవిత్వంగా ఈ కవితాసంపుటిలోని ప్రతి కవితా ఆకట్టుకుంటుంది.

ఇంతకీ అతని కవిత్వమేమిటీ?

ఏ రెండు
కన్నీటి చుక్కలు ఒకేలా ఉండవు
వాటిని చూసినపుడు
జారిన మూడో కన్నీటి చుక్క
కవిత్వం

Telugu Venkatesh

తనను తాను శిల్పంనుంచి శిలగా రూపం మార్చుకొని
అవరోహన దారిలో స్పష్టంగా పరిచయమయ్యాడు బాబా
దుర్గమారణ్యాల తప్పిపోతలు లేవు. గడ్డకట్టిన మంచు లేదు. వణికించే శీతలం లేదు.
సాయంత్రపు నీరెండలు...గోరువెచ్చటి పలకరింపులు..
దప్పికతీర్చే చెలిమ ఈ కన్నీటిచుక్క...
అలా కూర్చొని ఓ కాఫి కప్పుతో బాబా తేట ఆలోచనల్ని...గాలి మంద్రంగా వీస్తున్నంత నిశ్శబ్దంగా మదిలోకి ఆహ్వానించుకోవచ్చు.

Ravindranath Pakki

ఇప్పుడే అతని పుస్తకాన్ని నా చేతుల్లోకి తీసుకున్నాను
పావురం కన్నా మెత్తగా
నీరెండకన్నా వెచ్చగా
కవిగా బ్రతికిన క్షణాల వాసన వేస్తూ
అతని అక్షరాలు...
ఏవి అంతకు ముందు లేవో
వాటిని గొప్ప కాంక్షతో, దయతో
అన్వేషించి
అక్షరాల్లో మనోప్రపంచాల్ని
శిలల్లో భంగిమలని
రంగుల్లో ప్రవహించే దృశ్యాలను ఆవిష్కరిస్తూ అతను...
గొప్ప విభ్రమతో, లాలసతో
అలా చూస్తూనే నేను.

గొప్ప కవిత్వాన్ని కానుక చేసిన
ప్రముఖ కవి బొల్లోజు బాబాకు కృతజ్ఞతలు.

'బహుశా' వేణుగోపాల్

కవిత్వమంటే ఏమిటి? పదాలు అందంగా,ఆకర్షణీయంగా కూర్చడం కవిత్వం కావచ్చు.ఊహల్లో విహరిస్తూ కల్పితాలు సృష్టించడం కవిత్వం కావచ్చు.'పశువులు తొక్కిన నేల కవిత్వమంటారు' శివారెడ్డి. ఒదగని కవిత్వ నిర్వచనాన్ని ఇంత ఒద్దికగా, ఇంతకంటే మెరుగ్గా చెప్పలేం.

మనం రుణపడ్డ ఈ భూమ్మీద చెవి పెట్టి ఉన్నప్పుడు,వినబడే ప్రతి కథ కవితే.ప్రతి పద్యం కవితే.

వాక్యమంటే భూమిలోపల తపస్సు చేసీ చేసీ మొలకై బయటికొచ్చిన విత్తనంలా ఉండాలి.

ఏ రెండు
కన్నీటి చుక్కలూ ఒకలా ఉండవు.
వాటిని చూసినప్పుడు
జారిన మూడో కన్నీటి చుక్క
కవిత్వం.

లిప్తపాటు మెరిసిమాయమయ్యే దీపశిఖ వెలుగుల్లో అనంత ప్రకాశం బొల్లోజు బాబాగారి కవిత్వం. కవిత్వానికి ప్రాణం పోసేది తాత్వికత.
ప్రతి కవికి తాత్వికత చాలా అవసరం.

జీవిత పర్యంతమూ
పరిమళించి పరిమళించీ
పూదోటగా విస్తరించడానికే
నువ్విక్కడికొచ్చావు.

కొన్ని జీవితాన్ని వెలిగించే తలపోతలుండాలి. ఈ కవి జీవితం వైపు లోతుగా అవలోకనం చేసాడు.సారభూతమైన వాక్యాల్ని అందించాడు.

**ర్యాలి ప్రసాద్**

ఒక జీవిత కాలపు వాగ్దానం.
సున్నిత స్వభావంతో నిండి కర్కశ సమాజాన్ని ప్రక్షాళన చేసే కవిత్వం ' మూడో కన్నీటి చుక్క " ఈ కాలం కవిత్వం. దీనిలో కొన్ని కవితలు ఆలోచింపచేస్తాయి. కొన్ని ఆవేశపరుస్తాయి. కొన్ని గుండెను పట్టుకుని పీడిస్తాయి. మనసును వీడనని మొండికేస్తాయి.
థేంక్యూ గురూ. మంచి కవిత్వం అందించినందుకు.

---- అఫ్సర్

## బాబా కవిత్వంలోని జీవనది అదే!

జీవనది లోపలికి  ప్రవహించడం అనే అనుభవం ఎలా వుంటుందో అనుభవించి పలవరించాలంటే ఈ పుస్తకంలోకి అడుగు పెట్టాలి మీరు! అయితే, ఏ కొంతైనా తడవడానికి మీరు సిద్ధంగా వుంటేనే ఈ జీవనది మిమ్మల్ని తనలోకి స్వీకరిస్తుంది. బొల్లోజు బాబా "ఆకుపచ్చ తడిగీతం" ఇప్పుడు రెండో సారి చదువుతున్నప్పుడు వొక కవిని కేవలం కవిగా కాకుండా poet as a self గా చూడడం ఎలానో అర్థమవుతోంది, మనకి తెలీదు కానీ కవిత్వం కూడా వొక privacy statement.  దాని Intensity ని ఇప్పటివరకూ వేరే వేరే రూపాల్లో చెప్పడానికి నిరాకరిస్తూ, లేదా సంకోచిస్తూ వచ్చిన విషయాల్ని  చెప్పడం కోసమే self అనే తన సందుకని తెరుస్తూ వెళ్తాడు. బాబా కవిత్వంలోని జీవనది అదే! జీవితం ఆయన్ని ఎంతగా తడిపిందో అదంతా అక్షరాల్లో పిండే శక్తి ఆయనకి వుంది. వొక సాయంత్రం మీరు ఆ నది పక్కన నడుస్తూ వెళుతున్నప్పుడు గాలీ, నదీ గుసగుసలాడుకుంటున్నప్పుడు, ఆకాశం దానికి సాక్ష్యంగా నిల్చొని వున్నప్పుడు ఈ కవి విన్నాడని ఇదిగో ఈ కవిత్వంలో తెలుస్తోంది! ----- అఫ్సర్

# గుండె పూడిక ఎవరైనా తీస్తే బాగుణ్ణు

శ్రీరామ్

"అస్తిత్వం అనేది గోనె సంచిలో తీసుకెళ్ళి ఊరిచివర విడిచినా తోకూపుకుంటూ వచ్చి చేరే పిల్లి పిల్ల లాంటిది". బాబా కొత్తపుస్తకంలోని కవితా వాక్యమిది.

బాబా పేరెత్తగానే నాకెందుకో ఇస్మాయిల్ గారూ,శిఖామణిగారు చటుక్కున గుర్తొస్తారు.అదొక అసంకల్పిత చర్య.దానికొ సంకల్పిత కారణముంది. బాబా ఇస్మాయిల్ అవార్డు స్వీకరించినందుకో, బాబా కవిత్వమంటే ఇస్మాయిల్ స్కూలనే సూత్రీకరణం కోసమో కాదు. ఇస్మాయిల్ గారి ఆల్టర్నేట్ నేరేటివ్స్ (alternate narratives) కావాలీ రావాలీ అని సమయం చిక్కినప్పుడల్లా అరచిగీపెట్టే బాబా ఉద్దేశ్యం దాచేస్తే దాగేది కాదు. మరింకే వ్యతిరేకవాదమో (?) తటస్థించినా నా తప్పు కాదు.

అలాగే శిఖామణిగారెందుకు గుర్తొస్తారంటే ఆయన బాబాకు సాహితీ గురువు ;దళితసాహిత్యస్పృహ, సామాజిక సంవేదనల్ని పక్కనబెడితే శిఖామణిగారి కవిత్వంలోని దయ కరుణ,మృదుత్వం ఇత్యాది మానవీయ లక్షణాల ప్రభావం బాబా మీదుంది.

ఆకుపచ్చని తడిగీతం,వెలుతురుతెర కవితా సంపుటాలు కవిగా బాబా సత్తాని ఇప్పటికే నిరూపించాయి. ఇప్పుడు మూడో కన్నీటి చుక్క సంపుటి తెచ్చాడు. బాబా అనుభూతికి ఎక్కువ ప్రాధాన్యతనివ్వడం పట్ల కొత్తగా చర్చేమీ అవసరం లేదు కానీ బాబా లేటెస్టు పుస్తకం మునుపటి పుస్తకాల కన్నా చాలా భిన్నంగా కన్పించింది.
ఏం డిఫరెన్సు కనబడిందో తెలుసునా ?

ఫ్రాగ్మెంట్స్ అలానే వున్నాయి.తనకిష్టమైన పిచ్చుక మీద ఈసారీ మరో కవిత రాశాడు. ప్రకృతిని ఆలంబన చేసుకున్న చాలా కవితలూ ఎప్పటిలానే వున్నాయి.మరి మార్పేమిటంటే.. మూడో కన్నీటి చుక్కలో కేవలం బాబా అభిరుచి కన్నా కొత్త ఆలోచనాభిముఖత ఎక్కువ నచ్చుతుంది. ఇది సాధారణీకరణ చెయ్యడం కాదుగానీ బాబా కవిత్వమీ పుస్తకంలో చాలా సూటిగా స్పష్టంగా వుంది. శైలిలో ఎక్కువ మెలికలు లేవు. మెలికలనగా తన భావచిత్రావిష్కరణలో వుండే వివిధ పొరలూ (layers);

సంక్లిష్టతా ఈ బుక్ లో లేవు. ఉదాహరణకి ఆకుపచ్చని తడిగీతంలో "అంతరించబోతున్న పిచ్చుకలపై" అన్న కవితలో

"నువ్వు వస్తావని గుడిలో శఠగోపమంత
అందంగా పేనిన వరికంకుల కుంచె
ఇంటిస్లాబ్ ఇనుపకొక్కానికి,కాశీ ఆవు ఐదో కాలులా వేలాడుతూ
మమ్ములను వెక్కిరిస్తుంది.
తరువాత 'మీ వంతు' అంటూ భయపెడుతోంది" అంటాడు.

అదే వస్తువు మీద లేటేస్టు కవిత చూడండి

పిచ్చుకా!నిన్నటిదాకా నీవు ప్రయాణించిన మార్గాన్నీ
పడిలేచిన నీ ఆత్మనీ చూడాలనిపిస్తుంది
కొత్త రహస్యాలేమైనా బోధపడుతాయేమో! (పిట్టగోడపై వాలిన పిచ్చుక)

బాబా ఆలోచనాభిముఖ ధోరణి కొత్తదేమీ కాదు. ఆ మాటకొస్తే అతను ప్రతీ వాక్యాన్ని సంవేద్యీకరణంగానే వ్రాస్తాడు. చేతనావంతమైన కవిలానే రాస్తాడు. అయితే ఇప్పుడతని ఆలోచనలోకి వ్యక్తికన్నా, వ్యక్తిగతానుభవం కన్నా తన చుట్టూ జరుగుతున్న కుట్రలకు, అన్యాయాలకు అతను ప్రతిస్పందించడం కనిపించింది. అతని అనుభవంలోకి వచ్చినా రాకున్నా కూడా దాన్ని గురించి ఆలోచించడంలో కవిగా తన కొత్త ఉనికిని గుర్తుచేస్తుంది. 'ఇప్పుడీదేశానికి ఏమైంది' (మూ.క.చు - కుట్రలు) అని నేరుగా అడుగుతాడు

.'అప్రియసత్యాలు చెప్పినందుకు నా దేహాన్ని బూడిద చేశారనే' కొత్త వాక్యహృదయంతో విలవిల్లాడిపోతాడు.దేశ కాలాల గురించి బాబా కన్నీరుమున్నీరైన గొప్ప సోషలిస్టు వాస్తవిక కవిత్వం రాశాడననుగానీ, ఇప్పటిదాకా తనలో తానే వినిపించుకునేట్టుండే శబ్దాలిప్పుడు బయటకి గుసగుసల్లా మాత్రం వినపడవు.

మొదటి పుస్తకంలో బాబా కవిత్వమంతా సమూహంలోంచి బయటపడాలన్న ప్రయత్నంగా కనిపిస్తుంది. ఏకాంతధ్యానం. టీచరుగా తన శిష్యుల "సార్ గారండి" మాటకి పరవశిస్తాడు.

సముద్రం తరపున నీళ్ళు వకాల్తా తీస్కుని
ఎట్లయితే ఆటుపోట్లని సృష్టించలేవో;అలాగే
ఒకరి దప్పిక, ఆకలి నొప్పులను,మరొకరు పూరింపలేరు
అయినాసరే లోకం దృష్టిలో మనిద్దరిదీ ఎప్పటికీ అన్యోన్య దాంపత్యమే
(ఆ.త.గీ – నువ్వు నువ్వే–నేను నేనే) అంటాడు.

ఇతని ఒంటరితనాన్నేమనాలి? వెలుతురు తెర పుస్తకంలోనూ బాబా కవిత్వాన్ని గురించి –– స్వగతం కాదు, ఉపన్యాసం కాదు (ఫ్రాగ్మెంట్స్) అని నిర్వచిస్తాడు. నాకు శ్రీకాంతశర్మగారే గుర్తొచ్చారు. "మానవ జీవితంలో ఎన్నో సున్నితమైనవీ, తళతళమెరిసేవీ, కళ్ళు మిరిమిట్లు గొలిపేవీ,అంతరంగానికి ఒక విస్ఫోటనంలాగ ఎరుక కలిగించేవీ అనుభూతులున్నాయి.వాటికి సాహిత్యంలో ప్రవేశించే హక్కుంది.దీనిని కాదని ఏ రాజకీయాన్ని తెచ్చి కవిత్వంగా నమ్మించజూసినా సహించవలసిన అవసరం ఏ కవికీ లేదు–(అనుభూతి కవిత్వం).

బాబా అదే నమ్మకాన్ని కలిగిన కవి. సౌందర్యోపాసకుడు. ఈ కవితలు చూడండి

కాలానికో, ప్రేమకో వినమ్రంగా నమస్కరించి అస్తిత్వాన్నో ఆత్మనో
ఆనందంగా సమర్పించుకోవడంలో ఎంతటి జీవన సౌందర్యముందీ
(ఆ.త.గీ –– జీవన సౌందర్యం) –– సమర్పించడం దేన్ని పొందడం కోసం ?

★★

ఆమె నీడ నగ్నంగా మారి నన్ను కౌగిలించుకుంది. బిరుతెక్కిన కుచాగ్రాలు గుచ్చుకున్నాయి వృత్తిధర్మం ఎరిగిన వేశ్యలా నన్ను నేను విప్పుకుని అర్పించుకున్నాను (మూ.క.చు –– మోహం)–– ఈ అర్పించడం ఏమిటి ?

★★

వాస్తవాన్నొప్పుకోనిదో, ఒప్పుకునేదో కవి తన సౌందర్యారాధనలోని అనుభూతి దగ్గరే ఆగిపోతున్నడప్పుడు మనకే ఫీలింగ్ కలుగుతుంది ? కవిగానీ, కథకుడుగానీ, ఆ మాటకొస్తే ఏ సాహిత్యకారుడైనా తన అనుభవంతో లింకై వున్న వాస్తవికతకి హేతుబద్ధంగా ప్రతిస్పందించే లక్షణాన్ని బట్టే ఆ కవి ఏ ప్రపంచాకాశానికి కావాల్సిన సూర్యుడో చంద్రుడో తెలుస్తుంది.హేతుబద్ధత సౌందర్యాధనకీ,దాని అనేకానేక భావనలకి,అతీతమైనది కాదు. "సౌందర్యం కేవలం వస్తువుల సహజసిద్ధ లక్షణాల ఫలితం మాత్రమే కాదని, అది మానవుని కార్యాచరణ, మానవుని దృక్కోణం

ఫలితంగా మానవీకరణ చెందడం ద్వారా బహిర్గతమయ్యేదని" (జీ సూర్య సాగర్ – సాహిత్యం సౌందర్యం) చెబుతారు. బాబా జీవనసౌందర్యంలో అతను జీవితం ఎలా ఉందో ఎలా ఉండాలని కోరుకుంటాడో మనకు తెలుస్తుంది. అందుకే "జీవించి ఉండటంలోని సౌందర్యం కొద్ది కొద్దిగా అర్ధమవుతోంది వాడికి" (మూ.క.చు –– ఆట) అని అంటాడొకచోట.

బాబా మొదట్నుంచీ ఏ పక్షం వహించి రాస్తున్నాడన్నదాన్ని నిర్ధారించాల్సొస్తే అదంత తేలిగ్గా తేలే విషయం కాదు. ఒక స్టాండ్ తీస్కున్న నేల కనబడదు. ఎప్పటికప్పుడు ఆల్టర్నేట్ నేరేటివ్స్ (Alternate narratives) కనుక్కోవడంలోనే బాబా నిమగ్నమయ్యాడనిపిస్తుంది. అనిర్దిష్టత (నైరూప్య ప్రేమ కాదు) పట్ల బాబాకి గల సుముఖతే అతని దృక్పథాతీత వ్యక్తీకరణకి ప్రధానకారణం. అతనికి వయక్తికమూ, సామాజికమూ లాంటి రొటీన్ చట్రాల్ని బద్దలుకొట్టాలన్న తీవ్రమైన కాంక్ష ఉంది. లేకపోతే ఈలాంటి కవిత రాయడు. చూడండి–

ఈ ప్రపంచం నిన్నెలా చూడాలనుకుంటుందో  
అలా వేషం కట్టి ఆత్మలోకంలో అమ్ముడుపోకు.  
అబద్ధపు వేషం పదే పదే కట్టి  
నువ్వే ఓ నిలువెత్తు అబద్ధంగా మారిపోకు  
ఈ ప్రపంచం ఏవి నీకు ఉండకూడదని ఆశిస్తుందో  
అదే నీ అస్తిత్వం; వాటిని కోల్పోకు;  
కర్ణుడు కవచకుండలాల్ని కోల్పోయినట్లు (మూ.క.చు – అస్తిత్వం) అంటాడు.

అతనే పర్స్పెక్టివ్ (Perspective) తో రాస్తున్నాడో వెతకాలనిపిస్తుంది కానీ, అతను ఇంకా కవిత్వానికి భౌతికంగా ఆపాదిస్తున్న లక్షణాల్ని వ్యతిరేకిస్తున్నాడు. అందుకే Personal అన్న కవిత రాయగలిగాడు. తనకుతానుగా మతవాదిని, కమ్యూనిస్టుని అని ప్రకటించుకోవడానికి వెనుకాడ్డు. కానీ వాటికిచ్చే కొత్త నిర్వచనాలే కళ్ళను మిరుమిట్లు గొలుపుతాయి.

మనం బొక్కబోర్లా పడిపోయినా లెక్కచేస్తాడా ? లేనే లేదు. బేఫికర్ కవి కదా మరి.

"మతం అంటే

భగవంతునితో నే చేసే  ఏకాంత సంభాషణ
చిడతలు పట్టుకున్న సమూహంలోను
త్రిశూలాలు తిప్పుతున్న బృందాలలోనూ నే లేను -- జై శ్రీరాం

కమ్యూనిజం అంటే
సమాజం పట్ల నాకున్న వ్యక్తిగత బాధ్యత
జండాలు పట్టుకున్న సమూహాలలోను,
తుపాకులు మోస్తున్న బృందాలలోనూ నేను లేను -- లాల్ సలాం" అని రాస్తాడు.

అతని ఏకాంత మత సంభాషణ సంగతి పక్కనపెడితే, ఒక రాజకీయార్థిక సిద్ధాంతమైన కమ్యూనిజం పట్ల అతని వైఖరి ఈ పుస్తకంలో తెలియరావడం సంతోషించదగ్గ పరిణామం. ఎర్ర జండాలపట్ల, తుపాకులుమోసేవారిపట్ల బాబా థాట్ ప్రాసెస్ క్షుణ్ణంగా తెల్సిపోయింది. ఇలా ముందు పుస్తకాల్లో రాయలేదు. ఇప్పటిదాకా ఎందుకిలా రాయలేదని నేనంటే కుదిరే పనేనా ? కాలానుగుణంగా కవి తనకుతాను సాధించే స్పష్టతే తన రచనలో ప్రతిఫలించే గొప్ప లక్షణం కదా!

ఆకుపచ్చని తడిగీతం లో స్ట్రీట్ చీమలు, పోలవరం నిర్వాసితులకోసం, రెండు దేశాలు, ఆసుపత్రిలో చావు లాంటి కవితల్లో బాబా తను నిర్వచించిన సమాజం పట్ల తన వ్యక్తిగత బాధ్యత మాత్రమే కనిపించదు. కవిగా సామాజిక దుస్థితులపట్ల తన అసహనం, కోపం, నిస్సహాయతల్లో తన Intelectual element ఎక్కువగా లేకపోయినప్పటికీ ఒక ద్రవీభూత ప్రతిస్పందనే మనల్ని కదిలిస్తుంది. బాధ్యతని గుర్తించడానికీ, లిప్తకాలంలో ప్రతిస్పందించడానికీ పోటీపెడితే దేనికి మొదటి స్థానమివ్వాలో, ఏ పాఠకుడైనా దేనికిస్తాడో ఆట్టే ఎక్కువ ఆలోచించనక్కరలేదు. అలానే వెలుతురు తెర లో కూడా ఒక కవితలో--

ఆమెనెందుకు తీసుకురాలేదూ ?
ప్లీజ్
రక్తనాళాల్లోకి దొంగలా ప్రవేశించిన
అబార్షన్ పిల్ గోడపై విచ్చుకుంటున్న
చామంతి మొగ్గను చిదిమేసింది (అపుత్రస్య) అని అన్నప్పుడో --

ఎవరో నా చేతిలో పూల రేకులు పెట్టారు
వాడువేసే అడుగు అడుక్కీ పూల రేకులు చల్లాను
ఇంటికొచ్చి చూసుకుంటే నా చేతుల నిండా రక్తం (రక్తం మరకలు)
అంటాడు.

కవి భ్రూణ హత్య జరిగినప్పుడు బాధపడ్డాడు. అనకిష్టమైన పూలని రక్తంతో సమానంగా భావించాడు. బాబాలో భావవాద- సామాజిక వాస్తవికతల మధ్య ఒక దృక్పధ స్థిరత్వం కోసం జరిగిన పెనుగులాట రెండు పుస్తకాల్లో బాగా కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. మూడో కన్నీటి చుక్కలో అతని ఆలోచనల్లో ఒక settled; అనగా స్థిరంగా మాత్రమే రాస్తున్న మానసిక స్థితి కనిపిస్తుంది.

మొదటిపుస్తకం లో నే -- నైట్ షిఫ్ట్ కేబిన్ మేష్టారు అన్న కవితలో - తప్పుకున్న పట్టాల మధ్య పొంచి ఉన్న ప్రమాదాన్ని గుర్తించి తనో నిలువెత్తు ఎర్ర జండాయ్యె -- అని కూడా ప్రస్తావిస్తాడు.

బీసీ అంటే ఎవరు నాన్నా అన్న కవితలోనూ సమజంలోని కులభూయిష్టమైన ఆలోచనలను నిర్దాక్షిణ్యంగా వ్యతిరేకిస్తాడు. పద్మశాలీయుని, విశ్వబ్రాహ్మనుని, కుమ్మరిని, దూదేకుల వారిని, బెస్తవానిని, గీతకార్మికుని గురించిన వేదన వినిపిస్తాడు. అదే కవితలో -- ద్రోణాచార్యుడు ఒక వేలే అడిగాడు కానీ, పారిశ్రామిక విప్లవాచార్యుడు కోరిన వేన వేళ్ళ దేహాల సంతతి అని చెప్పనా ? అని కూడా అడుగుతాడు.

బాబా ముందు రెండు పుస్తకాల్లో ప్రశ్నలకు సమాధానాలివ్వడంలో తడబడ్డాడేమో కానీ, మూడో కన్నీటి చుక్కలో మాత్రం సమాధానాల్లోని విషయానికి (వస్తువుకి) మాత్రం తనదైన స్పష్టత ఇచ్చాడనిపించింది. జై శ్రీరామనీ అన్నాడు; లాల్ సలామనీ అన్నాడు. శిల్పమెంత ఘనమై ఉన్నదో తనదైన సారమూ అంతే స్పష్టంగా ఉంది. కానైతే బాబా కూడా కవిత్వం యొక్క సామాజిక ప్రయోజకత్వానికి వయక్తిక మార్పు కూడా చదువరి హృదయంలో దీపం పెట్టగలదన్న నమ్మకాన్ని వెల్లడిస్తాడు.

“అనుభవాన్ని బుద్ధిలా ఖండఖండాలుగా విశ్లేషించకుండా సమగ్రంగా సంపూర్ణంగా స్వీకరించగలదు ఈ హృదయమనేది” (కవిత్వంలో నిశబ్దం) అన్న ఇస్మాయిల్ గార్ని జ్ఞాపకానికి తెస్తాడు. బాబా ప్రధానంగా హృదయవాది. అతని కవితల్లో దేశం, సమాజం, వర్గం, వైరుధ్యం, రాజకీయం, దాని రాక్షసత్వం కన్నా

ప్రాణాన్ని భయపెట్టే మృత్యువు, జ్ఞాపకాల్ని వెంటాడే స్వప్నార్ద్రతలు, మళ్ళీ మళ్ళీ ఆత్మల (అంతరాత్మ కాదు) ప్రస్తావన ఎక్కువగా ఉంటుంది.

మూడో కన్నీటిచుక్క లో కవితా శిల్పం చాలా బిగుతుగా ఉండి విగ్రహం పుష్టిగా ఉంటుంది. స్కిన్ ట్రేడ్, సోషల్ ఇంజినీరింగ్, దుఃఖ ద్వారం కవితలు ఊపిరి బిగబిస్తాయి. అతని స్వానుభవాన్ని మాత్రమే ఆశ్రయించకుండా కొత్త ఆలోచనలోకి దూకిన బాబా కనిపిస్తాడు.

జీవితం అప్పుడపుడూ కాసేపాగి
తన సెల్ఫీ తానే తీసుకుంటుంది
ఒక్కో ఫోటో
రక్తమూ కన్నీళ్ళూ నింపుకున్న కవిత్వమై
చరిత్రలోకి ఇంకిపోతుంది (సెల్ఫీ) అన్నప్పుడు —

వెలుతుతెర లో "పునర్జన్మించాల్సిన జీవనకాంక్ష ఎంతకీ కలగట్లేదు. ఇక శెలవ్" (కవిత్వం) అన్నదానికన్నా చాలా బాగుంది. అలాగే మూడో కన్నీటి చుక్క పుస్తకంలో --

జీవించడమంటే
ప్రేమించిన ఒక్కొక్కరినీ కోల్పోవడం కదూ ?

(Alone but together). లాంటి మాటలకన్నా --

గౌరీ లంకేష్ వర్ధంతిని పురస్కరించుకుని -- అనామక శవాలతో చప్పగా ప్రవహించే చరిత్రకు ఒక వర్ధంతిని బహూకరించడం మామూలు విషయమా ! అభినందనలు లాంటి మాటలకన్నా -

తిరస్కరించిన తరువాత ద్వేషించనక్కరలేదని చక్కగా ప్రేమించుకోవచ్చన్న ! (చక్కగా ప్రేమించుకోక) మాటలు

జీవిత పర్యంతమూ పరిమళించీ పరిమళించీ పూదోటగా విస్తరించడానికే నువు ఇక్కడికి వచ్చావు (పూలదోట) అన్న భావనలు చాలా బాగుంటాయి. బాబా మీద అంతకుముందు లేని ఇష్టం ఎక్కువగా కలుగుతుంది.

ఈ బుక్లో, స్త్రీల పట్ల బాబా ఆలోచనలు, నాన్న తో తన అనుబంధం, గురుప్రేమ బాగుంటాయి. నాన్నతనాన్ని ఎలా అక్షరబద్ధం చేస్తాడో చూడండి --

నాన్నతనాన్ని బజార్లో ఎక్కడున్నా
ఇట్టే గుర్తుపట్టేయొచ్చు
సైజులు సరిపోకపోతే మారుస్తారు కదూ
అంటో పిల్లల బట్టల షాపులోనో;
స్కూలు విడిచాక వస్తున్న పిల్లల గుంపులోంచి
"డాడీ" అన్న పిలుపు వచ్చిన వైపు అసంకల్పితంగానో
ఎగ్జాం సెంటర్ వద్దనో...
ఎక్కడైనా సరే నాన్నతనం తేలిగ్గానే దొరికిపోతుంది (నాన్నతనం) అంటాడు.

నాన్న గురించి ఎక్కడ ఏం చదివినా ఇది కలిగించే భావ సంచలనం వేరు. అలాగే స్త్రీపట్ల ఆ మూడు రోజులు, ముల్లు తీయించుకోవడం, గాయాల శ్వాస కవితలు ఆలోచనతో పాటు ఉద్వేగాన్ని కలిగిస్తాయి. చాలా మంది మగవాళ్ళం మనమే ఏదో ఉద్ధరిస్తున్నట్టు ఇంట్లో ఆడవాళ్ళతో ఏం పని ఉంటుంది నీకు ? అనేస్తుంటాం. అదే కవితా శీర్షికతో బాబా రాసిన కవిత చద్దివాక ఏ మగవాడూ ఇంకలా అడగడు. నిజం. ఆమె పనిచెయ్యకపోతే ఇల్లెలా ఉంటుందో చివర ఒకేఒక్క మాటలో చెప్తాడు.

ఇల్లు మొత్తం
క్వారీ పక్కన జుత్తు నెరసి
కాంతి నశించిన చెట్టులా ఉంది - అంటాడు. గుండెల్లో ముల్లు దిగిపోతుందంతే.

బాబా పరిచయం అక్కర్లేని కవి. ఈ మూడు పుస్తకాలతో పాటుగా రవీంద్రుని స్ట్రే బర్డ్స్ ని స్వేచ్చా విహంగాలుగా, సూఫీ అత్తరులు, ఇరవై ప్రేమ కవితలు ఒక విషాద గీతం లాంటి అనువాదాలు చేశాడు. చాలా చక్కగా ఉంటాయి. బాబా అనువాదాల ఎఫెక్ట్ నిస్సందేహంగా తన మౌలిక రచనలపై కూడా ఉంది. రెంటినీ పక్క పక్క పెట్టుకుని చూస్తే వాక్య నిగ్రహం పట్ల మనం పడే కొంత అసౌకర్యం తెలుస్తుంది. అతనింకాస్త స్వేచ్చాయుతంగా ఉండొచ్చు.

అతని కవిత్వ భాష పుస్తకం వర్ధమాన కవులందరికీ figures of speech పట్ల మౌలిక జ్ఞాన్నాన్నిస్తుంది. అలంకార శాస్త్రం పట్ల ఒక మంచి అవగాహన తెస్తుంది. అతని చారిత్రక వ్యాసాల్లో ఉండే నిబద్ధత, వాస్తవికప్రేమ కవిత్వం లోకూడా ఉంటే

చాలా బాగుంటుందనేంత చక్కటి చారిత్రక వ్యాసాలు రాస్తాడు. కడప కైఫియత్తులు, బ్రౌన్ కృషి, పాలెగాళ్ళ చరిత్ర, మీద అతని వ్యాసాలు మాణిక్యాల్లాంటివి.

ఒక జువాలజీ లెక్చరర్ ఇవన్నీ చేశాడంటే ఆశ్చర్యమేస్తుంది. అందుకే నాకూ ఒక జ్ఞానోదయమయ్యింది. బాబాని "అన్నా నువ్వెందుకు మార్క్స్ కి వ్యతిరేకం" అనడగదలుచుకోలేదు. తిలక్ ని గురించి రారా గారిలా ఆనంద నిష్యందం, ప్రమత్తతా పర్యవసాయి లాంటి భేదాల్లోంచి తర్కించదలుచుకోను. మూడు పుస్తకాలొచ్చాక మళ్ళీ అలాంటి పిచ్చి ప్రశ్నలు వేయడం వృధా కదా ?

అఫ్సర్ అతని narrative poetry లో ( Also read – Narrative verse, Narratology) సంప్రదాయ కవిత్వ శైలి వ్యతిరేకత, కవిత్వంలో ఒదగని సాంస్కృతిక లక్షణాల్ని బాబా 'చక్కదిద్దుతున్నాడంటారు'.

అదేమో గానీ, బాబా తనకు వీలుగాని ప్రయోగాలు మాత్రం చేయట్లేదు. తన స్వభావాన్ని నేరుగా కథనం చేయడాన్ని మనం హర్షించి తీరాలి. మూడో కన్నీటి చుక్కలో అతనికి తెల్సిన, అనుభవించిన జీవితాన్నే చిత్రించాడు. అంతకు మించి ఆ అనుభవంలోంచి ఇంకొంత కొత్తగా ఆలోచించి మంచి కవితలు రాశాడు. అతనిలో కొత్తదనానికి సామాజిక స్పృహ పురివిప్పి నాట్యం చేసిందని కితాబులు రాయను. అతనొక కొత్త దారి వేసేందుకు చమటోడుస్తున్నాడు. కవినేది నిలబెడుతుందో కాలమే ఎప్పుడూ నిరూపించింది. భయ్యా ! మనల్నందరూ గమనిస్తూనే ఉంటారు. కవిని కలవడాన్నెవరూ అస్సలు మిస్సవరు. బాబానైతే మరీనూ.

మూడో కన్నీటి చుక్క; బాబాలోని అంతర్నేత్రాన్ని చూపిస్తుంది.

మిత్రులారా ఇదందరూ చదివితీరాల్సిన కవిత్వ సంపుటి. బాబా ప్రేమగా హత్తుకోవల్సిన కవి

శ్రీరామ్

FEBRUARY 9, 2020

# తూర్పు గోదావరి జిల్లా చరిత్ర అధ్యయనంలో మెరుపులు మెకంజీ కైఫీయతులు

డా. పి. చిరంజీవిని కుమారి

చరిత్ర అధ్యయనంలో మౌలికమైన అంశం ఆ ప్రాంతపు ప్రజలు తమ చరిత్రను ఏ విధంగా సృష్టించుకున్నారు అనేది. ఏ దేశచరిత్ర అయినా ఆ దేశంలోని ప్రాంతాలు, గ్రామాలు, వాడలలో జనం ఎలా జీవించారు, ఏ విధంగా పాలించబడ్డారు, మరి ఏరకంగా చరిత్రను మలుపు తీసుకుంటూ వచ్చారు అనేది అధ్యయనం చేయడం చరిత్రకారుని విధి.

శ్రీ బొల్లోజు బాబాగారు కవిగా, రచయితగా, కార్యనిర్వహణదక్షుడిగా పేరు పొందటం అందరికీ పరిచయమే. ఇపుడు వారి "మెకంజీ కైఫీయతులు తూర్పుగోదావరి జిల్లా" అను పరిశోధనా గ్రంథం బాబాగారిని ఒక కొత్తకోణంలో, ప్రజా చరిత్ర కారుడిగా ప్రతిష్టించింది. ఆయన దృష్టిలో చరిత్ర గతానికి, వర్తమానానికి జరిగే నిరంతర సంభాషణ. ఇది నిజం. అధునాతన చరిత్ర అధ్యయనంలో శ్రీ డి.డి. కొశాంబి వంటివారు మనిషికి తను చరిత్ర సృష్టిస్తున్నాడని తెలియదు అన్నారు. అయితే మన పూర్వీకులు వారి వేష భాష సంస్కారాలు, వారి జీవితాల్లో వచ్చిన అనుభవాలు వారి పాలనావ్యవస్థలు, నమ్మకాలు, అవి ఏ విధంగా చరిత్రలో మారుకుంటూ వచ్చాయి అనేది తెల్సుకోవడం ఒక ఆసక్తిదాయకమైన విషయమే కాకుండా చరిత్రగమనం ఏ దిశలోకి పోతున్నది అన్న అవగాహన కూడా ఇందులో ఇమిడి ఉంది.

బొల్లోజు బాబా గారి తూర్పుగోదావరి జిల్లా మెకంజీ కైఫీయతులు జనం నుంచి అంటే క్రిందినుంచి వచ్చిన చరిత్ర. మెకంజీ కైఫీయతులలో ప్రాంతీయ, గ్రామ, దేవాలయ ఆస్తుల వివరాలు, దానాలు, పట్టాలు, శాసనాలు మాత్రమే కాకుండా సామాజికమైన జీవన విధానాలు, శ్రామికులకు, పాలకులకు నడిచిన ఆదాన ప్రదానాలు, యుద్ధాలు, తద్వారా జరిగిన భీకరమైన హింసాకాండలు కనబడతాయి. అంతే కాకుండా ఇంతవరకూ వెలుగులోనికి రాని కొన్ని ప్రజాజీవన విశేషాలు కూడా మెరుపు తీగల్లాగ మన ముందుకొస్తాయి.

బోయినపూడి గ్రామ కైఫీయతులో నీలపువారి వృత్తాంతంలో, బోయిన గ్రామాన్ని అభివృద్ధి చేసిన వారిని నీలం అనే జాతిగా పిలవబడడం కనబడుతుంది.

సర్పవరం కైఫీయతులో క్రీ.శ. 1422 లో దేవాలయం ఎదుట నందికి మండప నిర్మాణంలో పనిచేసే జంగాలకు సర్పవరం గ్రామాల్లో 9 పుట్ల భూమిని వృత్తి మాన్యంగా ఇవ్వడం జరిగింది.

జల్లూరు కైఫీయతులో అన్నిలదేవు అనే రాజు ప్రభుత్వంలో భూమి కొలతకు గడ అని స్థిరీకరించడం జరిగింది.

సామర్లకోట కైఫీయతులో కుమార భీమేశ్వరుని ఆలయాన్ని అపవిత్రం చేస్తున్న గెద్దలను, రాబందులను చెదరగొట్టేవారికి ఉందూరు గ్రామం, కాపలా ఉండేవారికి కాపవరం అనే గ్రామం, జంగాలకు జంగాలదొడ్డి అనే గ్రామం ఇవ్వడం తెలుస్తోంది.

పూసపాటి జమిందారు ఆనందగజపతికి పిఠాపురం పాలకులు నీలాద్రి నాయుడు మొదలైన వారికి యుద్ధాలు జరిగినపుడు జరిగిన విశేషం:

కాకినాడ జగన్నాథపురం రేవులో ఆగిన ఫ్రెంచి ఓడనుంచి రెండువందల మంది ఫ్రెంచి సైన్యాన్ని దించి, సామర్లకోటకు నావలమీద తీసుకొనివచ్చి జరిగిన యుద్ధంలో ఆనందగజపతి సామర్లకోటకు వచ్చి ఫ్రెంచివారిని తరిమివేసి ఇంగ్రీషువారి జండాను తిరిగినిలబెట్టారు.

చిన్నిపువ్వు తేనె కైఫీయతలో కోన అడవిలో ఆవులు, ఎడ్లు బలిష్టంగా ఉండి కొమ్ములు ఏ వంకరా లేకుండా ఎలా ఉంటాయో, చిన్నిపువ్వు తేనె ఎలా వస్తుందో వివరించారు.

ఇలాంటి అంశాలు సాధారణ చరిత్రకారునికి అందని విశేషాలు. మెకంజీ కైఫీయతులలో గ్రామ, కుగ్రామ, వాడల, జనుల జీవితాలు, అనుభవం నిక్షిప్తమై యున్న విషయం బొల్లోజు బాబాగారి దృష్టిలోనికి రావడం అసమాన్యమైన పరిశోధకతత్వం.

పురాతన తాళపత్రాలలో భద్రపర్చుకుంటూ వచ్చిన విషయాలు ఆనాటి తూర్పుగోదావరి జిల్లా గ్రామకరణాలు తయారుచేసిన దండకవిలెలనుంచి సంగ్రహించి మెకంజీ సేకరించిన శతాబ్దాలకాలం నాటి ఈ పత్రాలను సమకాలీన భాషలోకి అనువదించి పఠితలకు అందించారు శ్రీ బొల్లోజు బాబా. తూర్పుగోదావరి జిల్లా చరిత్ర-సంస్కృతి సామాజిక విషయాల అధ్యయన సంస్థ అధ్యక్షులు, నేటి ఆంధ్రప్రదేశ్ గౌరవ మంత్రివర్యులు శీ చెల్లుబోయిన శ్రీనివాస వేణుగోపాల కృష్ణగారు, ఈ సంస్థ కార్యవర్గ సభ్యులైన శ్రీ బాబా గారి అద్భుతమైన కృషివలన సంస్థకు గౌరవ ప్రతిష్టను సంపాదించారని అభినందిస్తున్నారు.

తూర్పు గోదావరి జిల్లా మెకంజీ కైఫియతలు అందించడంతో, జిల్లా చరిత్రకు ఒక genuine చరిత్రకారుడు లభించాడని సంస్థ గర్విస్తోంది.

15-10-2020

డా. పి. చిరంజీవినీ కుమారి
కార్యదర్శి
తూర్పుగోదావరి జిల్లా చరిత్ర-సంస్కృతి
సామాజిక విషయాల అధ్యయన నంస్థ
కాకినాడ

# శుభాకాంక్షలు

తల్లావఝ్ఝుల పతంజలి శాస్త్రి

తూర్పు గోదావరి జిల్లా మెకంజీ కైఫీయత్తులు పుస్తకంగా వేస్తున్నాను, మీరు దాని గురించి రెండు మాటలు రాసిపెట్టండని బొల్లోజు బాబాగారు అడిగారు. నేను అపండితుణ్ని గనుక రాయలేనని చెప్పుకొన్నాను. బాబాగారికి మనమాట వినే అలవాటు లేదు గనుక వదిలిపెట్టని కారణంగా వారికీ శుభాకాంక్షలు తెలియచేస్తున్నాను. మీరు నేను రాసినది విడిచిపెట్టి బాబాగారు రాసినది చదువుకోండి. బాబాగారు కవి. కొంతకాలం నుంచీ వారు చరిత్రమీద కలిగిన ఆసక్తివల్ల ఆంధ్రుల చరిత్రకి సంబంధించిన వ్యాసాలు రాస్తున్నారు. యానాం గురించి బాబాగారు రాసిన పుస్తకం అందరికీ తెలిసినదే.

దురదృష్టవశాత్తూ మెకంజీ గోదావరిజిల్లాలలో ఎక్కువకాలం గడపలేదు. అందుచేత రాయలసీమ కైఫీయతులలో అక్కడి సమాచారం ఉన్నంతగా తూ.గో.జిల్లా కైఫీయతుల్లో అంత వివరం కనిపించదు. బాబాగారు మెకంజీ పత్రాలను వాడుక భాషలో తిరగరాసి ప్రచురించారు. అవసరం అనుకొన్నచోట అధోజ్ఞాపికలలో అదనపు సమాచారం ఇస్తున్నారాయన. కానీ చాలాచోట్ల గ్రాంథిక వాక్యాలు కనిపిస్తాయి. అభ్యంతరం కాకపోయినా కైఫీయతుల వంటి చారిత్రిక పత్రాలను గానీ, పుస్తకాలను గానీ వాడుకభాషలోకి తీసుకురావటం వల్ల ప్రాంతీయ మాండలికం నష్టపోతూంది. నుడికారం, భాష, శైలి మనకి దక్కకుండా పోవటం మామూలు నష్టం కాదు.

ఈ కైఫీయతలలో ఎక్కువభాగం 18వ శతాబ్దిలో పెద్దాపురం, పిఠాపురం, సామర్లకోట, విజయనగరం జమీందారుల రాజకీయాలు, యుద్ధాలు వాటిలో ఈస్టిండియా కంపెనీ, ఫ్రెంచివారి జోక్యం తత్ఫలితంగా కోస్తాప్రాంతంలో ఈస్టిండియా కంపెనీ సాధించిన ఆధిపత్యం వివరంగా పొందుపరిచారు. పాఠకులకి

ఈ చరిత్ర ఆసక్తికరంగా ఉంటుంది. పోతే తూర్పుచాళుక్యుల చరిత్ర కొంత వివరించబడింది. ఇది చరిత్రగ్రంథాలలో సులభంగా దొరుకుతుంది.

రాజమహేంద్రవరం చరిత్ర కైఫీయతులో లేకపోవడం నిరుత్సాహంగా ఉంటుంది. అయితే కైఫీయతులు రాసినవారు చరిత్రకారులు కాదు. గ్రామకరణాలు. స్థానిక ఐతిహ్యాలు సేకరించి పూర్వసమాచారం కొంత గ్రహించి పొందుపరిచిన పత్రాలివి. అందుకే కైఫీయతలను యధాతథంగా చరిత్ర పరిశోధనగా అంగీకరించడం, ఎవరికి వచ్చిన విశ్లేషణ వారు చేస్తున్నారు. దురదృష్టవశాత్తూ మన చరిత్ర రచనలోనే అనుసరించిన పద్ధతిలోనే లోపాలున్నాయి. కొన్ని కారణాలవల్ల పాలనావ్యవస్థలు, పాలకులు, కాలం అనే మూడు బిందువుల చుట్టూ మన చరిత్ర నేతపని జరిగింది.

మొదట చరిత్ర రచనకు పూనుకున్న ఆంగ్లపండితులు దిగ్భ్రమ కలిగించే ఈ దేశ సామాజిక సాంస్కృతిక వైవిధ్యాన్ని అర్థం చేసుకోలేదు. ఆ వైవిధ్యాన్ని వాళ్లు సమూలంగా బల్లపరుపు తాపీపని చేసారు. అట్లా జరిగిన అపకారం మనకింత వరకూ అవగతం కాలేదు. వాళ్లకి ఇంగ్లాండులో పరిచయం ఉన్న Manor House నమూనాలో మన చరిత్ర రాయడానికి పూనుకున్నారు. మనం ఆధునికం అని నమ్ముతున్న Colonial Mindset తోనే ఇంకా మన సాంస్కృతిక సాంప్రదాయాల్ని అర్థం చేసుకుంటున్నాం. అనేక ఉపజాతుల, కులాల మూలాలు అర్థం కావాలంటే విస్తృతమైన జీవావరణ వ్యవస్థల అధ్యయనం కావాలి.

బాబాగారు సంస్కృతీకరణ,  Aryanization అనే పదాలు వాడుతున్నారు. వాటికి ఏర్పడ్డ రూఢ్యర్థం సరికాదు. అలాగే హిందూమతాన్ని విదేశీయుల మీద రుద్దడం జరిగిందని కూడా అన్నారాయన. అదికూడా నిజం కాదు. అటువంటివి జరగాలంటే వ్యవస్థీకృతమైన శక్తి ఉండాలి. అంతేకాదు. హిందూ మతం అనే పదం ఎలావాడాలో ముందు మనకి అర్థం కావాలి. అర్థం కావాలంటే, వ్యవసాయ విస్తరణ, ఆలయనిర్మాణాలు, చతుర్థకులజుల పాలన, జైన, బౌద్ధ, ప్రాచీన హిందూ మతానికీ కల్ట్ సెంటర్స్ కీ ఉండిన పేగుసంబంధం తెలియాలి. మనకిష్టమైన అభిప్రాయాలు చారిత్రిక వాస్తవాలనుకోకూడదు. ఇదంతా చాలా సంక్లిష్ట వ్యవహారం. బౌద్ధ ధర్మవ్యాప్తి విచ్ఛిత్తి ఎందుకు జరిగిందో తెలియకుండా వాటి గురించి మాట్లాడుతున్నారు. ఇది చాలామందికి రుచికరమైన వ్యాపకం. శాస్త్ర విషయాలలో అనేకుల అంగీకారం అవసరం లేదు.

చరిత్రరాయడానికి అందులో డిగ్రీలు ఉండితీరాలనే నియమం లేదు. మనకి కొంతమంది ఔత్సాహిక చరిత్ర, పురావస్తు పరిశోధకులు ఉన్నారు. వారు గ్రామగ్రామాలు శ్రమించి తిరుగుతూ కొత్తవిషయాలు తెలియచేస్తున్నారు. కొందరు చరిత్రమీద నిజమైన ఆసక్తి కలిగించడానికి శ్రమపడుతున్నారు. వాళ్లకి Self Promotionగుర్తింపు ధ్యేయం కాదు. అదొక దీక్ష దరిదాపు ఇరవై సంవత్సరాల క్రితం వియన్నానుంచి ఒక జీవశాస్త్రవేత్త ఫోన్ చేశాడు. 'మీకు దగ్గరలో కోటిపల్లి అనే గ్రామంలో, ఆలయ కోనేరులో పెద్ద తాబేలు ఉందని మీరు ఎరుగుదురా' అనడిగాడు. తెలుసునన్నాను. తరువాత ఇద్దరం కలిసి తిరుగుతూ ఆయన తాబేలు మరణించిందని తెలుసుకున్నాం. అతనికి ఒక ప్రత్యేకజాతి తాబేళ్ల మీద ఆసక్తి. అతనింట్లో 1200 రకాల తాబేళ్లుతో ఉంటాడతను.

బహుముఖీనంగా, బహుశాఖీయంగా విస్తరిల్లిన విద్యలలో చరిత్ర, సామాజిక శాస్త్రం, జ్యోతిషం అనేవి ఏ కారణంచేతనో చాలామందికి లోకువ. చరిత్ర, సామాజికశాస్త్ర సంబంధమైన అభిప్రాయాలు వింటుంటే, ఇపుడు విరివిగా లభిస్తున్న బల్లిపాటు ఫలితాల అధ్యయన [గ్రంథాల చేరువలోకి తీసుకువెడతారని అనిపిస్తూంటుంది. ఇటువంటి పరిస్థితి ఏర్పడ్డానికి మన విశ్వవిద్యాలయాలు కారణం అని నా అభిప్రాయం. అంతర్జాల మహాత్యం వల్ల గతంలోవలె కాకుండా, ఎవరి అంతర్జాల కుంపటిని వారే సులభంగా పెట్టుకుంటున్నారు. ప్రతి అయిదో ఆంధ్రుడిలో ఒక చరిత్రకారుడు, సామాజిక శాస్త్రవేత్త, జ్యోతిష్కుడు కలిసిగానీ విడివిడిగా కానీ ఉన్నారని నమ్ముతున్నాను.

బాబాగారి రచన చదవడానికి సుఖంగా ఉంటుంది. దానివల్ల పాఠకులకి కనీసం గోదావరి జిల్లాల చరిత్రమీద మక్కువ ఏర్పడుతుందని ఆశిస్తున్నాను. బాబాగారి కృషి కొనసాగుతూనే ఉంటుందని నమ్మకం.

తల్లావజ్ఝల పతంజలి శాస్త్రి<br>5-10-2020

# తూర్పుగోదావరి జిల్లా - మెకంజీ కైఫియ్యతులు – సమీక్ష

దాట్ల దేవదానం రాజు




చదవాల్సిన పుస్తకాలు ఎదురుగా వేచి చూస్తున్నాయి. వాటిని పక్కనబెట్టి బొల్లోజు బాబా 'తూర్పుగోదావరి జిల్లా - మెకంజీ కైఫియ్యతులు' చేతిలోకి తీసుకొన్నాను. దానికి కారణం మా ప్రాంతం గతం తాలూకు విశేషాల్ని తెలుసుకోవాలనే ఉత్సుకత ఒక్కటే కాదు మా బాబా ఏం రాశారో చూడాలని ఆతురత కూడా ఉంది. చాలా సంవత్సరాల క్రితం దినపత్రికలో ఒక వార్త నన్నెంతో ఆకర్షించింది. రాజస్థాన్ ప్రభుత్వం ఎనభై ఏళ్ళ వయసు ఉన్నవారి దగ్గర్నుంచి ఆయా గ్రామాల విశేషాల్నీ స్థలపురాణాల్నీ తెలుసుకుని గ్రంథస్థం చేస్తే ప్రభుత్వమే ముద్రిస్తుందని ఆ వార్త సారాంశం. ఆ తరం గతిస్తే వారితోనే అవి మురుగుపోతాయని భావించి వారుండగానే నమోదు చేయాలనే మహత్తర ఆలోచన అది. నాకు చాలా ఆనందం అనిపించింది. అది నన్ను యానాం చరిత్ర రాయడానికి పురిగొల్పడం కూడా జరిగింది. అది వేరే సంగతి.

కైఫియ్యతుల ద్వారా అనేక విషయాలు తెలుసుకోవచ్చు. మెకంజీకి ఏం అవసరం ఉండి వీటి పట్ల ఆసక్తి చూపించాడో తెలియదు. సేకరణ పనిని గ్రామకరణాలకు అప్పగించాడు. వారు రాసిందాన్ని జాగ్రత్త చేశాడు. భాషకు సంబంధించి పండితులు కారు వారు. విన్నది విన్నట్టుగా ప్రచలితంలో ఉన్నది ఉన్నట్టుగా వచ్చిన భాషలో రాశారు. రాసేటప్పుడు వారి నమ్మకాలూ విశ్వాసాలూ అందులో చోటు చేసుకోవడం తప్పదు. వాటిని మరలా నేటికాలానికి సరిపడా వాడుకభాషలో మార్చి రాయడం లోనే అసలు ప్రతిభ ఉంటుంది.

> బొల్లోజు బాబా దృష్టి ఎప్పుడూ ఖాళీలను భర్తీ చేసే దాని మీదే ఉంటుంది.
>
> ఇప్పటి వరకు వెలుగు చూడని వీటిని సంస్కరించి రాయడంలో బాబా చేసిన విశేష కృషి ప్రతి పేజీలోనూ చూస్తాం. ఆధారాలను ఎక్కడికక్కడ ఇవ్వడం బావుంది.

బొల్లోజు బాబా తన ముందుమాట లోనే చెప్పారు. పొడవుగా ఉన్న వాక్యాన్ని తను ఎలా విడగొట్టి రాయడం జరిగిందో అసలు వాక్యంతో బాటు తిరగ రాసిన వాక్యం ఉదహరించారు. తన విధానం చెప్పారన్నమాట. జరిగుండొచ్చు భావించొచ్చు అనుకోవచ్చు అంటూ తను రాసింది తన వ్యక్తిగత అభిప్రాయమే తప్ప నిర్ధారణ కాదు అన్నట్టుగానే చెప్పారు. చరిత్రను కొన్ని చోట్ల ఊహించాల్సి ఉంటుందన్నది నిజమే. ఆ ఊహకు కొన్ని ప్రాతిపదికలుండాలనేది ఒక వాస్తవం.

సర్కారు జిల్లాల నుంచి ఫ్రెంచి వారి నిష్క్రమణ చరిత్ర ఆధారంగానే (కైఫియతులు ఆధారం కాదు) చక్కగా చెప్పారు. ఇక గ్రామ కైఫియ్యతులు ద్వారా మనం కొత్తగా తెలుసుకునే అంశాలేమిటో చదివితేనే అర్థం అవుతుంది. స్థల పురాణాలు అంటే కొన్ని కట్టుకథలు వ్యాప్తిలోకి తెచ్చి ఆయా దేవాలయాలకు మహిమలు కలిగించడం ద్వారా భక్తి వ్యాప్తి చేయడానికే అనుకొంటాను. ఇవన్నీ వాస్తవానికి దూరంగానే ఉంటాయి. సరదాగా చదువుకోడానికి ఉపయోగపడ్తాయి.

బొల్లోజు బాబా దృష్టి ఎప్పుడూ ఖాళీలను భర్తీ చేసే దాని మీదే ఉంటుంది. మెకంజీ ఎక్కువ కాలం సీమ ప్రాంతంలో ఉండటం వల్ల అక్కడి కైఫియ్యతులనే ఎక్కువగా సేకరించాడు. తూర్పుగోదావరి జిల్లా కైఫీయతులు చాలా తక్కువగానే లభిస్తున్నాయి. వాటిని శ్రమకోర్చి, అంతర్జాలం, శాసనాలు, గ్రంధాల ద్వారా సేకరించి ఒక చోట గుదిగుచ్చి మనకు అందించారు. ఇప్పటి వరకు వెలుగు చూడని వీటిని సంస్కరించి రాయడంలో బాబా చేసిన విశేష కృషి ప్రతి పేజీలోనూ చూస్తాం. ఆధారాలను ఎక్కడికక్కడ ఇవ్వడం బావుంది.

తర్వాత చరిత్రపరంగా బొల్లోజు బాబా చూపు ఇపుడు దేని మీద పడుతుందో చూడాలి. ఇంత శ్రమనూ కాలాన్నీ వినియోగించి చేసిన కృషి తప్పక మంచి గుర్తింపును తెస్తుందని నమ్ముతున్నాను. కవిగా కవిత్వం, విమర్శకునిగా కవిత్వభాష, చరిత్రకారునిగా చారిత్రక విశేషాల్నీ అందించడం సృజననూ అవగాహనా పరిధినీ పెంచుకుంటూ వెళుతున్న బొల్లోజు బాబాను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

దాట్ల దేవదానం రాజు
1 డిశంబర్ 2020

# మెకంజీ కైఫియ్యతులు - తూర్పుగోదావరి జిల్లా

కోండ్రు రమేష్

★1816లో వ్రాసిన పుస్తకం నిమిత్తం ఇంగ్లీషులో వ్రాసిన మొదటి భారతీయునిగా రాజారామమోహన్ రాయ్ గుర్తింపబడ్డారు...కానీ ఆయన కంటే ముందు 1803లోనే ఇంగ్లీషులో రచనలు చేసిన తెలుగు వ్యక్తి ఎవరు??

★అమరావతి స్థూపాన్ని గుర్తించిన మొదటి యూరోపియన్ ఎవరు??

★దీపాలదిన్నె ప్రాంతం ఏమిటి?అదెక్కడ ఉంది??

★బోయినపూడి గ్రామం ఎలా ఏర్పడింది?నీలం జాతి వారు ఎవరు?వారి జీవన విధానం ఏమిటి??

★చిన్న పువ్వు తేనె అంటే ఏమిటి?పిఠాపురం రాజా వారి సైనికులు దానిని ఏవిధంగా సేకరించేవారు??

★108యుద్ధాలలో గెలిచినందుకు 108శివాలయాలు ప్రతిష్ఠించిన చాళుక్య రాజు ఉదంతం ఏమిటి??

★రాజమండ్రి కోటగుమ్మం ప్రాంతానికి ఆ పేరెలా వచ్చింది??

★రాజమహేంద్రవరం పట్టణాన్ని ఎవరు,ఏ విధముగా నిర్మించినారు??

★రాజమహేంద్రవరం కోట గోల్కొండ నవాబుల వశం కావడానికి కారకులైన సీతాఫిఖానుడు-అవసరాల పెద్దిరాజుల ఉదంతం ఏమిటి??

★కోస్తా ఆంధ్ర ప్రాంతాన్ని ఏ నిజాం నవాబు ఈస్ట్ ఇండియా కంపెనీకి,ఎప్పుడు అమ్మివేశాడు??

★పుల్లరి సుంకం విధించిన రాచవేమారెడ్డిని వీధిలో కత్తితో వధించిందెవరు??

★సర్పవరం,పండూరు,జల్లూరు గ్రామాలకు ఆ పేర్లేలా వచ్చాయి??

★దక్షిణ భారతదేశంలో బంగారు నాణేలు ప్రవేశపెట్టిన రాజు ఎవరు?వాటికి వరహాలు అనే పేరెలా వచ్చింది??

★మంచికొండ పట్టణం ఎవరి పేరు మీద, ఏ సందర్భంలో ఏర్పడింది??

★వెన్నెల రాయుడికి ఆ పేరెలా వచ్చింది? వెన్నెలరాయ గుట్టకి అతనికి గల సంబంధం ఏమిటి??

★భారతదేశంలో గన్ పౌడర్ ను 1526లో బాబర్ ప్రవేశపెట్టినట్లు చెప్పబడినా...అంతకుముందే దానిని భారతదేశంలో వాడింది ఎవరు??

★కోరుకొండ పట్టణం ఏవిధంగా ఏర్పడింది? కోరుకొండ కొండపై నృశింహస్వామి దేవాలయం నిర్మించింది ఎవరు??

★గోదావరికి గుద్రవర అనే ప్రాచీన నామం ఏ ఆలయ స్తంభంపై శాసనరూపంలో ఉంది??

★మనిషి పుర్రెలో వండిన అన్నాన్ని, రక్తంతో కలిపి రాత్రివేళ యుద్ధభూమిలో నైవేద్యం పెట్టే రాజు ఎవరు??

★కుల్లమీనార్ అంటే ఏమిటి?దాని వలన ఏర్పడిన భయనక వాతావరణం ఏమిటి??

★తన ఎదుట పొగ త్రాగితే కత్తి తీసి పరిగెత్తించి కొట్టే గజపతుల రాజు ఎవరు??

★దోమాడ యుద్ధం ఎప్పుడు,ఎవరి మధ్య జరిగింది??

★కిమ్మూరు,గోరంట,గోవాడ,చెల్లూరు గ్రామాలకు ఆ పేర్లేలా వచ్చాయి??

★కోరంగి గ్రామానికి ఆ పేరెలా వచ్చింది? కోరంగికి రామాయణానికీ గల సంబంధం ఏమిటి??

★సీతాంతం గ్రామం సిద్దాంతం గ్రామంగా ఎలా మారింది??

★గుడిపాడు,అంకసానిపాడు గ్రామాలు ఏవిధంగా ఏర్పడ్డాయి??

★ధర్మవేమారెడ్డి కాలంలో జరిగిన పరుసవేది వృత్తాంతం ఏమిటి?

★ద్రాక్షారామ భీమేశ్వరాలయం, సామర్లకోట కుమార భీమేశ్వరాలయలను నిర్మించిన రాజు ఎవరు??

★ద్రాక్షారామం ప్రాచీన నామం ఏమిటి? ద్రాక్షారామంలో దాదాపు వేయి సంవత్సరాల క్రితం నెలకొన్న సామాజిక,ఆర్ధిక,మత,వర్ణవ్యవస్థ పరిస్థితులు ఏమిటి??

★క్రీ.శ ఏ కాలం నాటికి గోదావరి, ద్రాక్షారామపురం అనే పేర్లు వాడుకలోకి వచ్చాయి??

★ఒక అఖండ దీపారాధన కోసం కావాల్సిన నెయ్యి కోసం ఎన్ని గోవులు అవసరం??

★ఆంధ్రదేశంలో బౌద్ధ,జైన మతాలను తీవ్రంగా అణచివేసి,ఉత్తర భారతదేశం నుండి పెద్ద ఎత్తున బ్రాహ్మణులను రప్పించి,హిందూ మతాన్ని ఆంధ్రదేశంలో స్థిరీకరించిన రాజు ఎవరు?ఆనాటి పరిస్థితులు ఏమిటి??

★వరంగల్ సీతాఫ్ ఖాన్,రాజమహేంద్రవరం సీతాఫ్ ఖాన్ ల మధ్య సంబంధం ఏమిటి??

★1759,మే 14 న కోస్తా జిల్లాలను బ్రిటిష్ వారికి ఈనాం గా ఇచ్చిన నిజాం నవాబు ఎవరు??

★సర్కారు జిల్లాలలో ఫ్రెంచివారి నిష్క్రమణ మరియు బ్రిటిష్ వారి ప్రాబల్యం ఏవిధంగా ఏర్పడ్డాయి??
★అనేక శాసనాలలో ప్రస్తావించబడిన ఇనుపఎడ్లు అంటే ఏమిటి??
★ఆలయాలలో గోశాలల నిర్మాణం ప్రారంభించిన రాజు ఎవరు?
★సాని అనే పదం యొక్క పవిత్రత ఏమిటి?దేవాలయాలలో వారు చేసిన పవిత్ర సేవలు ఏమిటి?వారు పొందిన గౌరవాలు ఎట్టివి?కాలక్రమంలో సాని అంటే బూతుగా ఎలా,ఎందుకు మారింది??
★కాలీన్ మెకంజీకి శాసనాలు,కైఫీయత్తులు సేకరణలో తోడ్పడిన సహాయకులు,చిత్రకారులు ఎవరు?వారి కృషి వలన తెలుగు ప్రాంతానికి జరిగిన చారిత్రక మేలు ఏమిటి??

ఇత్యాది విషయాలు తెలుసుకోవాలంటే ఈ పుస్తకం చదవాల్సిందే...❤️❤️

తెలంగాణా ప్రాంతంతో పోలిస్తే ఆంధ్ర ప్రాంతంలో ప్రాచీన చరిత్రపై జరుగుతున్న పరిశోధనలు, రచనలు బహు తక్కువ అనడంలో ఎలాంటి సందేహం లేదు...అయితే ఈ పుస్తకం కోసం రచయిత బొల్లోజు బాబా గారి పరిశోధన, శ్రమ,అవిరాళ కృషి నిజంగా శ్లాఘనీయం...చక్కని వివరాలతో,ఆధారాలతో సరళ శైలిలో వారు ఈ పుస్తకాన్ని తీర్చిదిద్దారు...కేవలం తూర్పుగోదావరి జిల్లా వాసులు మాత్రమే కాకుండా తెలుగువారందరు చదవదగిన పుస్తకం రచించిన రచయిత బొల్లోజు బాబా గారికి...🙏🙏🙏

వీరి కలం నుండి ఇలాంటి రచనలు అనేకం రావాలని ఒక చరిత్ర విద్యార్థిగా నేను ఆశిస్తున్నాను...💐

కోండ్రు రమేష్ 7 ఫిబ్రవరి, 2021

# కైఫీయత్తులు – నా యురేకా మూమెంట్

Narukurti Sridhar

కైఫియత్తు ల గురించి ఎన్నాళ్ళనుంచో వింటున్నా, చదవాలనే ఉద్దేశ్యం మాత్రం ఆ పుస్తకం మీద ఉన్న మా తూర్పు గోదావరి జిల్లా పేరు, మ్యాప్ చూసిన తర్వాతే కలిగింది. రచయిత 'బొల్లోజు బాబా' గారి మీద నాకు కొంత అభిమానం ఉంది. సరళంగా , గాఢమైన భావంతో ఉండే ఆయన కవితలు , అనువాదాలు , ఏ విషయాన్నయినా చదివించ గలిగేలా ఉండే శైలి నాకిష్టం.

కైఫియత్ అనే ఉర్దూ పదానికి ' సంగతులు , విశేషాలు ' అని అర్థం. స్థానికులు వారి గ్రామ చరిత్ర, సరిహద్దులు దేవాలయ భూములు , పాలకుల వివరాలు లాంటివి తాళపత్ర గ్రంథాలపై రాసుకుని భద్రపరుచుకునే వారట. వాటిని 'దండెకవిలెలు' అనేవారు.ముస్లిం పాలనలో వాటిని కైఫియత్ లు అనే పేరుతో వ్యవహరించడం మొదలయ్యింది. చిన్నప్పుడు ' మన పొలం ఎక్కడినుంచి ఎక్కడికో ఎలా తెలుస్తుంది?' అని నేను అడిగిన ప్రశ్నకి మా తాత గారు ఇచ్చిన సమాధానం ఇప్పటికీ నాకు గుర్తు. 'మనకేమి తెలుస్తుందిరా .. కరణం గారు ఎంత చెపితే అంత' అని. ఆ కరణం గారి దగ్గరే ఈ వివరాలు ఉండేవి. బహుశా ఊరుమ్మడి విషయాలు కూడా వారిదగ్గరే ఉండేవేమో.

నా చిన్నప్పుడు మా ఊరిలో ఒక మట్టి కోట ఉండేది. దానిలో అప్పుడప్పుడూ పురావస్తు శాఖ వాళ్ళు తవ్వకాలు చేస్తూ ఉండేవారు. 'దానిని ఎవరు కట్టించి ఉంటారు?' అని బహుశా ఊరిలో సగం మందిని అడిగి ఉంటాను. చాలా మంది 'ఎప్పుడో రాజుల కాలం నాటిది ..మనకేం తెలుస్తుందిరా కరణం గారికే తెలియాలి ' అనేవాళ్ళు. అయితే నాకు ప్రశ్నించే వయసు వచ్చేటప్పటికే కరణం గారు కాలం చేయడం వల్ల నా సందేహం అలాగే ఉండిపోయింది .

ఈస్టిండియా కంపనీ లో సర్వేయర్ గా పనిచేసిన మెకంజీ శాసనాలు,దండెకవిలెలు,ప్రాచీన ఆలయ చిత్రాలు , నాణాలు మొ.గు వాటిని విస్తారంగా సేకరించాడు. అలా సేకరించిన వాటి ద్వారా భారతీయుల చరిత్రను

తెలుసుకోవచ్చని నమ్మాడు. తన దగ్గర పనిచేసే వారిని గ్రామ కరణాలు,పెద్దల దగ్గరికి పంపించి వాటిని సేకరించి ఆ విశేషాలతో వ్రాత ప్రతుల్ని తయారు చేయించాడు. హిందువులకి చరిత్రను రికార్డు చేసుకునే అలవాటు లేదనుకునే బ్రిటిష్ వారు ఆ కైఫీయత్తులు చూసి ఆశ్చర్యపడ్డారట.

నిజానికి తూర్పు గోదావరి జిల్లా కి సంబంధించి పది కైఫీయత్తులు మాత్రమే లభ్యం . ఎక్కువగా రాయలసీమ కి సంబంధించినవే ఉన్నాయి. గొలుసుకట్టు రాతలో ఉన్న వీటిని రచయిత సరళమైన భాషలోకి మార్చి సామాన్య పాఠకులు చదువుకునేలా చేసారు. కైఫియత్తుల లోని విషయాలని యథాతథంగా ఇస్తూ , ఫుట్ నోట్స్ లో మాత్రం చారిత్రక విషయాలతో అనుసంధానించడానికి ప్రయత్నించారు. విజయనగరం, పిఠపురం, రాజమహేంద్రవరం, పెద్దాపురం, సామర్లకోట, కోరుకొండ సంస్థానాల చరిత్ర, వేంగీ చాళుక్యులు, రెడ్డి రాజుల పాలనా కాలం నాటి చారిత్రక విశేషాలు ఈ పుస్తకం ద్వారా తెలుసుకోవచ్చు.

అయితే ఈ కైఫియత్తుల ని చరిత్ర అనుకోవచ్చా? స్థల పురాణ కథలు కూడా చేరిపోవడంతో వీటిని చరిత్ర అని చెప్పలేము కానీ , నమ్మశక్యం కాని విశేషాలని పక్కనబెడితే దీనిలో కచ్చితంగా చరిత్ర ఉందని నాకనిపించింది. ఎందుకంటే మా ఊరి కోట గురించి ఎంతమందిని అడిగినా దొరకని సమాధానం ఈ పుస్తకంలో (కోరుకొండ కైఫియత్తులో ) దొరికింది. మా ఊరి కోటని వేమారెడ్డి నిర్మించాడట . బహుశా అది ఆరు వందల సంవత్సరాల క్రితం కావచ్చు. ఆ తర్వాత చాలా కాలానికి , బహుశా ఈస్టిండియా కంపనీ కాలంలో, మందపాటి రఘునాధ రాజు అనే జమిందారు ఆ కోటలోనే సర్కారు వారితో సంప్రదింపులు జరిపి కోరుకొండ పరగణాని సంపాదించుకున్నాడట . ఆయన కొడుకు తిరుపతిరాజు ఆ కోటని పెద్దది చేసాడట. మా ఊరిపేరు రహితాపురం అని ఉంది. చుట్టుపక్క ఊర్లన్నీ ఇప్పటి పేర్ల తోనే ఉన్నాయి . మా ఊరు మాత్రం కాలక్రమేణా రఘుదేవపురం అయింది. మా చిన్నప్పుడు (ఇప్పటికీ) వాడుకలో రైతాపురం అనేవాళ్ళం. బహుశా అది రహితాపురం నుంచే వచ్చి ఉంటుంది. ఆ కోరుకొండ కైఫియత్తు చదవడం నాకు ఒక 'యురేకా' మూమెంట్. ఉత్సాహం ఆపుకోలేక బాబా గారికి మెసేజ్ చేసాను. ఆయన నాకంటే ఎక్సైట్ అయ్యారు.

ఈ పుస్తకంలో తూర్పు గోదావరి జిల్లా కైఫియత్తులతో బాటు , మెకంజీ జీవిత విశేషాలు, ఆయన సేకరించిన శాసనాలు, పుస్తకం చివర కొన్ని చారిత్రక వివరణలు ఉన్నాయి. అప్పటి తెలుగు వారి జీవన స్థితి గతులు , చరిత్ర మీద ఆసక్తి ఉన్నవారు తప్పక చదవవలసిన పుస్తకం. ఇది చదవడానికి తూర్పు గోదావరి వారే కానవసరం

లేదు. ఒకవేళ తూర్పు గోదావరి వారయితే , నాలా అదృష్టం కలిసొస్తే, మీ ఊరు చరిత్ర కూడా దొరకొచ్చు.

ఈ పుస్తకం రాయడానికి రచయిత సంప్రదించిన పుస్తకాలు, వ్యాసాలు చూస్తే మతిపోతుంది. ఇది కేవలం Rs.200 లకే దొరకడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఏ విదేశీయులో అయితే ఇంత పరిశోధనకి కనీసం వంద డాలర్లు పెట్టి ఉండేవారు. మన దగ్గర ఉందని చెప్పుకోడానికైనా ఈ పుస్తకం కొనుక్కోవచ్చు.

తాజాకలం:

మెకంజీ ఆంధ్ర,కర్ణాటక, తమిళనాడు నుంచి కైఫీయత్తులు సేకరించాడు. కర్ణాటక, తమిళనాడు లలో సేకరించిన వాటిలో కూడా తెలుగులో రాయబడ్డవి ఉన్నాయట. బహుశా ఆంధ్ర దేశం నుంచి వెళ్ళిన తెలుగు వారే ఈ కైఫీయత్తులు రాయడం నేర్పించి ఉంటారని ఒక పరిశోధన ( ఆ విధంగా తెలుగు వాళ్ళని చరిత్ర ని రికార్డు చేయడంలో యూరోప్ వాళ్ళతో పోల్చవచ్చని నా ఇది..)

**చిన్ని పువ్వు తేనె కైఫియతు**

“ సింగల్ మాల్ట్ లో సోడా కలపకూడదు ఆపరా బాబు “

“ ఎవడు చెప్పాడురా కలపకూడదని ? సింగల్ మాల్ట్ అంటే పెద్ద గొప్పా ?”

“ సింగల్ మాల్ట్ అంటే ఒకే డిస్టిలరి నుంచి వచ్చినది అని .. ఒక distinct టేస్ట్ ఉంటుంది .. సోడా కలిపి టేస్ట్ పాడుచేయకూడదు “

“ ఆ ..తెల్లోల్లకి బాగా ఎచ్చులెక్కువ..ఏదో అన్నీ వాళ్ళకే తెలిసినట్లు”

“ వాళ్ళకే కాదు మా తూగోజి వాళ్లకి కూడా .. అది ఎచ్చులు కాదురా బాబు .. finer tastes”

“ అవును మరి మీ తూగోజి వాళ్ళు పెద్ద తెల్ల దొరలు “

“ నీకో విషయం తెలుసా ? మా తూగోజి వాళ్ళకి వందల సంత్సరాల క్రితమే Monofloral Honey గురించి తెలుసు “

“అంటే”

“ ఒకే రకమైన పువ్వుల నుంచి వచ్చిన తేనె ఒక నిర్దిష్టమైన రుచి కలిగి ఉంటుంది అని మా జిల్లా జనాలకి ముందే తెలుసు . పిఠాపురం దగ్గర కోన అడవి అని ఉండేదట . ఆ అడవిలో చిన్ని పువ్వు తేనె అని దొరికేదట. అంటే చిన్ని పువ్వుల (maytenus senegalensis) మకరందంతో తయారయ్యే తేనె. మార్గశిర , కార్తీక మాసంలో దొరికే తేనెలో వరిపువ్వారు (వరిపువ్వుల నుంచి సేకరించబడిన

మకరందం) కలవడం వల్ల చిక్కగా అత్యంత తియ్యగా ఉంటుందని మా ఓళ్లు కనిపెట్టారు. పిఠాపురం రాజుగారు ఆ వరిపువ్వారు కలిసిన తేనెనే తెప్పించుకుని తాగే వాడట. సింగల్ origin కాఫీ, సింగల్ మాల్ట్ విస్కీ  లాగా సింగల్ సోర్సు తేనె అన్నమాట "

తాజా కలం :

ఇది మెకంజీ తూగోజి కైఫీయత్తులు (Bolloju Baba గారు రాసిన పుస్తకం) నుంచి సేకరించిన విశేషం .

# మెకంజీ కైఫియత్తులు - తూర్పుగోదావరి జిల్లా : పరిచయం

Haribabu Maddukuri

ఇప్పుడు మనం వాడే అధునాతన కారు, బైకు ఎలా వచ్చాయి..?? మార్పులు చెందబడ్డ పాతతరం బళ్ళనుంచేగా.

అట్లాగే ప్రతీ పాతికేళ్ళకి కాలగతిలోనూ, జనజీవనంలో సంభవించే మార్పుల్ని గనుక సంఘటనలు, వ్యవహారాల పేరిట జాగ్రత్తగా రికార్డుల్లో భద్రపరిస్తే అవి రాబోయే తరాలకి దిక్సూచిగానూ, వివిధ భావజాలాలకి దర్పణంగానూ నిలిచి పలు అధ్యయనాలకి పనికొస్తాయ్, మనదైన ఒరవడిని ముందుకు తీసుకెళ్లగల్గుతాయి.. స్థానిక విషయాలైనా, సాంకేతిక అంశాలైనా వాటి చరిత్ర, నేపథ్యం తెల్సుకోవడం వల్లే నవీనస్రవంతికి పరిపూర్ణత చేకూరుతుందని నా నమ్మకం.. కానీ మనకి చరిత్ర సృష్టించి జబ్బలు చరుచుకోవడం మీదున్న శ్రద్ధ వాటిని భద్రపరచుకోవడం మీద ఉండదనేది కాదనలేని వాస్తవం.. దానిక్కారణం ముందునించీ 'కరణం గారు ఎంత కొలిస్తే అంత' అని మనకేం పట్టనట్టు ఉండటం.. 😊

మనదేశంలో బ్రిటీషర్లు బలపడుతున్న బలహీనరోజుల్లో ఇండియాకి పొట్ట చేత్తో పట్టుకునొచ్చిన ఇంగ్లీష్ దొరల్లో కొంతమంది మహానుభావులు వాళ్ళ పని వాళ్ళు చేసుకుని జీతం తీసుకునెళ్లిపోకుండా మనకెప్పటికీ పనికొచ్చే పనులు చేసి పెట్టి చరిత్రలో నిలిచిపోయారు..

వాళ్ళలో కోస్తా ప్రాతఃస్మరణీయులు కాటన్ దొర, తెలుగుసాహిత్య బ్రౌన్ సిపి బ్రౌన్ అగ్రగణ్యులైతే వాళ్ళ తర్వాత గుర్తుంచుకోదగ్గ మరో ముఖ్యవ్యక్తి కల్నల్ మెకంజీ అనే బ్రిటిష్ మిలట్రీ ఇంజనీర్..

17వశతాబ్దంలో కల్నల్ మెకంజీగారు తక్కిన బ్రిటీషర్లలాగే ఇక్కడికొచ్చాడు.. బ్రిటీషర్లకి, టిప్పుసుల్తాన్కి మధ్య జరిగిన మూడో మైసూర్ యుద్ధంలో టిప్పుసుల్తాన్ ఓడిపోయాకా అప్పటివరకూ అతగాడి ఏలుబడిలో ఉన్న ప్రాంతాల్ని, బ్రిటిష్ ప్రభుత్వ ప్రభావం ప్రత్యక్షంగా లేని పరగణాల్ని సర్వే చెయ్యమని 1800వ సంవత్సరంలో మెకంజీకి బాధ్యతలు అప్పగించింది ఈస్టిండియా ప్రభుత్వం..

అయితే ఆంగ్లేయుడు కావడంతో ఆంధ్రభాష రాదు కాబట్టి కావలి బొర్రయ్య, లక్ష్మయ్య అనే గొప్ప దక్షత కలిగిన ఇద్దరు నియోగ బ్రాహ్మణ కవలసోదరుల్ని గుమస్తాలుగా పెట్టుకుని పని కానిచ్చాట్ట.. (ఈ సోదరులిద్దరూ యే ఊరెళ్తే ఆ ఊరి

గ్రామకరణాల సాయంతో చారిత్రక అవసరాలకి తగట్టు ఎలా అనువైన వచనం చేశారన్నది ఇంకో గొప్ప ఆసక్తికర చరిత్ర).

అట్లా తెలుగునాట ఎన్నో జిల్లాలు తిరిగి సర్వేలు గట్రా నిర్వహించి పుట్టుపూర్వోత్తరాల్ని కలాలతో తవ్వితీసి ఆ అమూల్యమైన సమాచారానికి కైఫియత్తులని (స్థానికచరిత్ర అని అర్థమట) అరబిక్ పేరుపెట్టారు.. కట్టింది కూలీవాళ్ళైనా కట్టించింది ఫలానా షాజహాన్ కాబట్టి తాజ్మహల్ అతడిదే అయినట్టు ఈ కైఫియత్తుల సమాచార కష్టమంతా కావలి కవలలు, కరణాలదే అయినన్నప్పటికీ ఈ తతంగం వెనుకున్న  మూలకారణం కల్నల్ దొరది కాబట్టి అవి మెకంజీ కైఫియ్యత్తులయ్యాయ్.. వీటిలో అప్పటి సీడెడ్/దత్తమండలాలైన రాయలసీమ జిల్లాల్నుంచి కోస్తాజిల్లాల వరకూ ప్రతీ ప్రాంతానికి కైఫియత్తులున్నాయ్.. వీటినే మన ప్రభుత్వాలు ఇప్పటికీ రిఫరెన్సులుగా వాడుతున్నాయ్..

అదంతా గతం..

ప్రస్తుతానికొస్తే రచయిత బొల్లోజు బాబాగారు మెకంజీ కైఫియ్యత్తుల మీద తూర్పుగోదావరిజిల్లాకి సంబంధించి పుస్తకం వేశారని మొన్న శ్రీధరన్న చెప్పగానే సమయానికి ఇండియాలో ఉండబట్టి వెంటనే ఆర్డర్ పెట్టి సంపాదించి ఇందాకే పూర్తిచేసేసా..

చిన్నప్పట్నుంచీ ఎరిగిన ఊళ్లే అయినాగానీ చదువుతూ ఉండగానే ఎన్నో కొత్త విషయాలు తెల్సి ఆశ్చర్యానికి గురిచేశాయ్..

శ్రీధరన్న చెప్పినట్టు ఇది తూగోజి కైఫియత్తు అయినాగానీ ఈ పుస్తకాన్ని చదవడానికి తూగోజీవాళ్లే కానవసరం లేదు.. విజయనగరం, పిఠాపురం, రాజమహేంద్రవరం, పెద్దాపురం, సామర్లకోట, కోరుకొండ సంస్థానాలు మొదలుకుని వేంగీచాళుక్యులు, రెడ్డిరాజులు, కొండవీడు రాజులపాలనా కాలం నాటి చారిత్రక విశేషాలతో బాటు మెకంజీ సేకరించిన శాసనాలు, చారిత్రక వివరణలు ఉన్నాయి కాబట్టి చరిత్ర మీద ఆసక్తి ఉన్నవాళ్ళెవ్వరైనా నిరభ్యంతరంగా చదివెయ్యొచ్చు..

ఇన్నాళ్లూ మా ఊరిని అప్పుడెప్పుడో ఫలానా శ్యామలదేవి అనే రాణి పరిపాలించింది కాబట్టే మా శ్యామలకోట కాస్తా బ్రిటీష్ బండనోళ్ళలో పడి సామర్లకోట అయ్యి కూర్చుందని మా అందరి ప్రగాఢ నమ్మకం.. కానీ చామర్లకోట అనబడే చాళుక్యభీమవర పట్టణం కాలక్రమేణా శ్యామలకోటగా ఎలా మారిందనే కారణం వెనుక పదిపేజీల చరిత్ర ఉందని ఈ పుస్తకం చదివేదాక నాకు తెలీనే తెలీదు..

ఇట్లాంటి మనదైన, అరుదైన చరిత్రని అతి చవగ్గా అందించిన ఈ 192 పేజీల పుస్తకం ధర కేవలం 200 రూపాయలే కావడం మరో ఆశ్చర్యకర విషయం..

Haribabu Maddukuri

26 జనవరి 2021

# కైఫియ్యత్తుల్లో తొండంగి మండలం

సిద్ధాంతపు బెన్ జాన్ సన్

జిల్లాలోనే సువిశాలతీరప్రాంతం కలిగిన తొండంగి మండలం ప్రత్యేకత కలిగి ఉంది. తీరప్రాంతం చోడిపల్లిపేట మొదలు /యాదవులు,మత్స్యకారులు నివశిస్తూ ఉన్నారు. 1785 లో మెకంజీ సేకరించిన కైఫియ్యత్తుల్లో ఈ తీరప్రాంతం గురించి వివరంగా ఉంది. కాకినాడకు చెందిన బొల్లోజు బాబా రాసిన తూర్పుగోదావరి కైఫియ్యత్తుల్లో ఒక కైఫియత్తు అంతా దీనిగురించే ఉంది.

1814 లో రాజమహేంద్రవరం జిల్లాగా ఉండే సమయంలో పిఠాపురం తాలుకాలో కోన అడవి గురించిన ప్రస్తావన సంబరం కలిగిస్తుంది. ఇప్పటి రెవెన్యూ రికార్డుల్లో కూడా కోనఫారెస్టు అనే పిలుస్తున్నారు కూడా. ఈ కోనఫారెస్టు తూర్పున సముద్రం,పడమర పొన్నాడ, ఉత్తరంలో తొండంగి, వేమయి ( వేమవరం) గ్రామాలు ఉండేవి. ఈ కోన అడవిలో తిరిగే ఎడ్లు మామూలు ఎడ్లుకంటే బలిష్టంగా ఉండే కొమ్ములు తిన్నగా వంకరలేకుండా ఉండేవి. చప్పుడైతే చెంగు చెంగున పరుగులు తీస్తూ ఉండేవి. ఈ ఎడ్లు పగలు అడవిలో మేసి (గడ్డిపేట) రాత్రులు సముద్రపు కెరటాలు తగిలేలా పడుకుని సేదతీరుతూ ఉండేవి. వీటిని వేటాడం ఓ వినోదంగా ఉండేది. పిఠాపురం, పెద్దాపురం, కాకినాడు, కపిలేశ్వరపురం జమిందారులు, ఫ్రెంచి,బ్రిటీషు కలెక్టర్లు తుపాకీలతో వేటాడేవారు.

ఈ అడవిలో పుశిణిగ, దొర్నిగ,గొల్లు లాంటి గుబురు చెట్లు, కుంకుడు చెట్లు( పాత పెరుమళ్ళపురం ప్రాంతంలో చూడవచ్చు) పాలచెట్లు ఉండేవి.
చిన్ని చెట్లు అని పొదలు ఉండేవి. పాలచెట్లు చాలా పొడవుగా వుండేవి. పాలచెట్ల తొర్రలు మనిషి కూర్చునేంత ఉండేవి.ఆ రోజుల్లో ఈ పాలచెట్లు నరికి రైతులు తూములుగా చేసి వ్యవసాయం చేసుకునేవారు. ఈ అడవి అంతా పిఠాపురం జమిందారు ఏలుబడిలో వుండేది. తేనెపట్లు అధికంగా ఉండేవి.

చిన్నపూలచెట్లు పూలు బలే గమ్మత్తైన పూలు మంచి సువాసన భరితమైన పూలు. తేనెటీగలు ఈ పూలనుండి వరి చేల పువ్వారు నుండి తేనె సేకరించి పాలచెట్లతొర్రల్లో తేనెతుట్టలను పెట్టేవి. అడవి అంతా తేనె తుట్టలే . ఈ తేనె సువాసన భరితమై మహా రుచిగా ఉండేది.ఈ చిన్నపూల చెట్లతేనె నవంబరు మాసంలో దొరికేది. పిఠాపురం జమిందారులు తేనె సేకరించేవారిని మకాం పెట్టించి తేనె పట్టుకెళ్ళేవారు. అయితే ఈ తేనె ఇప్పటి తేనెలా ఉండేది కాదు దీపావళి సామానుల్లో

కలిపే సూరేకారంలా ఉండేది. పలుకులు పలుకులుగా ఉండేదట. జమిందారులు మహా ఇష్టంగా తినేవారట

తొండంగి, వేమవరం, పొన్నాడ పరిసరాల్లో వరి బాగా పండేది. ఆ రోజుల్లో తొండంగి నువ్వుల పంటకు ప్రసిద్ధి చెందింది. దేశం నలు మూలలనుండి నువ్వుల కొనుగోలుకు వ్యాపారులు వచ్చేవారు. కోనఫారెస్టులో ఇండ్లకు ఉపయోగించే కలపదొరికేది కాదు. చింతచెట్లు ( చింతకాయలపేట పేరు అందుకే వచ్చి ఉండవచ్చు ), వేపచెట్లు, తుమ్మచెట్లు, అడవి ఎద్దులు, గుబురుగా ఉన్న ముళ్ళపొదలు,తుప్ప అడవి విస్తారంగా ఉండేవి. ఈ వివరాలన్నీ బల్లోజి బాబా రాసిన మెకంజీ తూర్పుగోదావరి కైఫియ్యత్తుల్లో దొరుకుతున్నాయి.ఇలాంటి మంచి పుస్తకాలను అందరూ చదవాలి ఆదరించాలి.

తీర గ్రామాలు ఎప్పుడు వచ్చాయి?

మెకంజీ 1814——1815 ఈ కైఫియ్యత్తులు సేకరించాడు. అప్పటికి ఇవి ఓ పదేళ్ళు వెనక రాసి ఉండవచ్చు. అంటే 1800 సంవత్సరానికి కోనప్రాంతం అడవిగానే ఉంది. సువిశాలమైన భూభాగం ,తీరప్రాతం ఉండటంతో దేశంలోని మత్స్యకారుల దృష్టి ఈ ప్రాంతం పై పడింది. ఆ క్రమంలో మెల్లగా వలసలు బర్మా, ఒరిస్సా, పూరి, మచిలీపట్నం, యానం,పాండిచ్చేరి,తమిళనాడు, ఇలా తీరప్రాంతాలనుండి వలసలు పెరిగాయి. మెల్లగా 1850 తరువాత మనం చూస్తున్న గ్రామాలుగా ఏర్పడ్డాయనుకోవచ్చు. ఎడ్లు లెక్కకు మిక్కిలి సహజంగా దొరుకుతున్నాయి కాబట్టి యాదవులు వచ్చి చేరి ఉండవచ్చు. అందుకే ఇక్కడ ఆవులమంద,గడ్డిపేట లాంటి గ్రామాలు ఏర్పడ్డాయనుకోవచ్చు.

కైఫియ్యత్తులో కొత్తపల్లి మండలం

తన నివసిస్తున్న చోటు ఏ నాటిదో తెలుసుకోవాలనే కుతూహలం ప్రతీ ఒక్కరికీ వెంటాడుతూ ఉంటుంది.తాతముత్తాతల గురించి వింటేనే మనసు పులకరిస్తుంది.ఓ ఉద్వేగం ముసుకుంటుంది. దాని ఆత్మీయత బావన స్పర్శ దేనికీ సాటిరాదు మరి.

కొత్తపల్లి మండలం వేల సంవత్సరాల నాటిదే అంటే ఓ క్షణం దిగ్భ్రమ కలగకమానదు. కాని కొంత మంది అవును అంటారు కాని ఏమీ చెప్పలేరు. అయితే మన పూర్వీకులు ఎంత గొప్పవారంటే తాటాకుల పత్రాలలోను, రాగిరేకుల్లో, శాసనాలలోను స్ధానిక చరిత్రలు రాసుకునేవారు. వాటిని దండకవిలెలు అనేవారు. వీటికి విలువ వుండేది కాదు. ఆనాటి సంస్కృతాంధ్ర కవితాఘోషలో వీటి శబ్దం

అస్సలు వినిపించేది కాదు. అయినా కరణాలు, జమిందారులు వారి వంశ చరిత్రకోసం రాయించుకునేవారు. అయితే అవి కొంత కాలానికి కనుమరుగయ్యేవి. అవ్వవా మరి గ్రంధాలయాలు ఉన్నాయా ఏమిటి ఆరోజుల్లో

అయితే ఓ మహానుబావుడుకి ఆ విలువ తెలిసింది అవి అపురూపమనిపించింది. అంతే తన జీతభత్యాలు త్యాగంచేసి వీటిని సేకరించాడు. మామూలుగా కాదు ప్రపంచంలో ఇప్పటి వరకూ మానవమాత్రుడు ఎవరూ చేయనంత సేకరణ. ఇప్పటికీ కొన్ని వేల సేకరణలు అలాగే వున్నాయి. పరిశోధకులు నిత్యం పనిచేస్తున్నా తరగడం లేదు. ఆయన ఎవరో కాదు మెకంజీ .స్కాట్లాండు దేశస్దుడు. 1783లో సర్వేయరుగా భారతదేశం వచ్చాడు. ఆయనికి ఈ దండకవిలెలు ఆశ్చర్యమనిపించింది. వీటి సేకరణకు ముందు బ్రిటీష్ వారు నిదులిచ్చినా ఆ తరువాత ఆపేశారు. సమకాలీకులు పనికిరాని వస్తు సేకరణ అన్నారు. అయితేనో బుర్రయ్య అనే బహుబాషా కోవిదుడిని ప్రక్కన పెట్టుకుని ఊరూర పంపించి సేకరించాడు. ఈ దండకవిలలనే మహ్మదీయులు ఆ తరువాత కఫీయ్యత్తులుగా పిలిచేవారు. ఇది ఉర్దూ పదం నుండి వచ్చింది. కఫియ్యత్ అంటే సంగతులు, విశేషాలు అని అర్దం వీటికి ఆ పేరే వాడుకలో ఉండి పోయింది.

మెకంజీ 1784——1790 ప్రాంతంలో రాయలసీమలో ఉన్నాడు. అక్కడ నుండే కఫియ్యత్తులు సేకరించాడు.వాటిలో తూర్పుగోదావరివి 10 ఉన్నాయి.

క్రీశ. 600 సంవత్సరంలో కాకినాడకు కొంకిపర్రు అని, 1700 సంవత్సరంలో కాకినాడు అని ఇప్పుడు కాకినాడ అని పిలిచే కాకినాడలో ఉండే బొల్లోజి బాబా వెలుగులోకి తెచ్చాడు.

తూర్పుగోదావరి కఫియ్యత్తులు పిఠాపురం,పెద్దాపురం,కాకినాడ పరిసర ప్రాంత గ్రామాల చరిత్రలను జమిందారుల చరిత్రలు తెలుపుతుంది. ఇందులో కొత్తపల్లి గ్రామం గురించి పెద్దగా తెలియకపోయినా మండలానికి సంబందించి ఓ స్పష్టత మరి కొంత సమాచారం దొరకడం నిజంగా కొత్తపల్లి వాసులం అందరం మెకంజీ మహాశయునికి ఋణపడి వున్నాం.

1182 నాటికే సంపర పేరు కనబడుతుంది. పిఠాపురం కుంతీ మాదవస్వామి ఆలయంలోని శాసనంలో 1187 లో నవఖండ్రవాడ, కొండెవరం గ్రామాలను ఏర్పరచి కుంతీ మాధవస్వామికి దానంగా ఇచ్చినట్టుఉంది. బహుశా ఇవి ప్రొలునాడుకు దగ్గరగా ఉండటం వలన కాబోలు.

కొమరిగిరి

క్రీశ. 1353 లో వేమారెడ్డి తరువాత పెద వెంకప్ప జమిందారీ ఏలుబడిలో కొవ్వాడ ,కొత్తపల్లి, పొన్నాడ ఉన్నాయి. పెద వెంకప్ప తరువాత విస్సామ అనే మహిళ పరిపాలించింది.1399 లో కొమరగిరికి చెందిన గోగ్గయ రాజు పిఠాపురం కుంతీమాదవస్వామికి బృందావనం చేయించి ఇచ్చాడు.

కొండెవరంలో కొంత భూమిని దానం చేసి తామ్రపత్రాలు రాసి వంశపారంపర్య హక్కులిచ్చాడు. ఆంధ్రాకు బ్రాహ్మణులు తమిళనాడు నుండి ఎక్కువగా వచ్చారు. వంద సంవత్సరాల తరువాత అగ్రహారం అగ్నికి ఆహుతి అయ్యింది.మద్దాల అప్పలరాజు అనే ఆయన మరలా ఇళ్ళుకట్టించాడు.కొమరగిరికి ఉత్తరాన చెరువు తవ్వించాడు. దక్షిణం వైపు తమ్మవరం కూడా ఆనాటి నుండి ఉంది. తమ్మసాని ఉండేది మేడలో అందుకే తమ్మవరం అని పేరు వచ్చింది.కొమరగిరి మాదన్న అనే వెలమవారు విష్ణుఆలయాన్ని కట్టించాడు. కొమరగిరిలో మల్యాల వెంకట్రావు ఒక శివాలయం కట్టించాడు.అరవైపుట్ల భూమి కేటాయించి ఉత్సవాలు చేసేవాడు.

నిస్సంకుల నాయన

కపిలేశ్వరపురం రాజు దేవుమహారాజు అనుగ్రహంతో నిస్సంకులనాయన అనే బ్రాహ్మణుడు పొన్నాడ,ఇసుకపల్లి కలిపి 21 గ్రామాలు కరణీకం రాయించుకున్నాడు. అతని దగ్గర గుమాస్తాలుగా పనిచే ముగ్గురు గుమాస్తాలు వడ్డావు మారకొండయ్య ,నండూరి తిమ్మరాజు, తోలేటి వీర్రాజు, మోసంచేసి రాజమండ్రికి చెందిన కాటంపల్లి వీరయ్య తో చేతులుకలిపి 21 గ్రామాలను నిస్సంకుల నాయన నుంచి లాక్కుని పంచుకుంటారు. పంపకంలో 1573 లో అయ్యపటనేని మార్కండ్రాజు పొన్నాడకు కరణీకం రాయించుకున్నాడు.

1671-79 లోప్రోలునాడు పరిపాలిస్తున్నపు  జంమిందారు తెలుగు రాయినంగారు  అతని ఆఖరి కొడుకు రంగసాయి గొల్కొండ నవాబు దగ్గర సేనాపతిగా ఉండేవాడు. మంచి చదరంగం ఆటగాడు. ఒకరోజు ఆటలో నవాబు అబ్దుల్ హుస్సేన్ ఓడిపోతే రంగసాయి కత్తితో పొడుకుని స్వామి భక్తిని ప్రదర్శిస్తాడు. హుస్సేన్ రంగసాయి ప్రేమకు ముగ్దుడై అతని అన్నలు రావుచందర్రావు,రావు జగ్గారావు ప్రొలునాడు అప్పగిస్తూ పిఠాపురం కోటను ఇస్తాడు.

వీరి హయాంలోనే ఏలేరు నదీ నీళ్ళు కిమ్మూరులో పరగణాలో ఉన్న కొత్తపల్లి, ఇసుకపల్లికి ప్రొలునాడు( పిఠాపురం,గొల్లప్రోలు,ప్రత్తిపాడు) మండలాలకు పంచారు. ఆనాటి నుండి మనం ఏలేరు నీళ్ళు సాగుకు ఉపయోగిస్తున్నాం.

పాఠశాలల లైబ్రరీలలో తప్పక ఉంచవలసిన పుస్తకం.
బొల్లోజు బాబా రచించిన, తూర్పుగోదావరి జిల్లా కైఫియ్యత్తులు నుండి

వ్యాసకర్త
సిద్ధాంతపు బెన్ జాన్ సన్
29 డిసంబరు, 2020

# కైఫియ్యతుల పుస్తకంపై కొన్ని అభిప్రాయాలు

Ramesh Potluri

మీ పుస్తకం మెకంజీ కైఫీయ్యతులు తెలుగుబుక్స్.ఇన్ ద్వారా తెప్పించుకొని చదివాను సార్. సరళమైన భాషలో అందించారు. ఎనెక్జెర్ లో మంచి వివరణలు అందించారు. కావలి సోదరుల గురించి విపుల పరిచయం చేసారు. ఇంతకు పూర్వం కృష్ణా జిల్లా కైఫీయ్యతులు (పిడిఎఫ్) చదివాను కాని అవగాహనకు కష్టపడాల్సి వచ్చింది. మీరు తూర్పు గోదావరి జిల్లా కైఫీయ్యతులు సులభగ్రాహ్యంగా రాసారు. చరిత్ర పై మీ కృషికి అభినందనలు. చదవడానికి అనుకూలంగా కైఫీయ్యతులు అందించినందుకు మీకు ధన్యవాదాలు.

Sairam Veera

స్వగ్రామాల పైన అభిమానం ఉన్న ప్రతీ వారికీ నచ్చుతుంది. వంద పుస్తకాల్లో దొరకని సమాచారం ఈ ఒక్క పుస్తకంలో దొరికేలా చేసిన బాబా గారికి, దీనిని పదిమందికి చేరేలా చేస్తున్న మీకు అభినందనలు.

Buddhachandradev Addanki

15వ పేజీలో మొదలై 26వ పేజీ వరకు ఉన్న కల్నల్ కాలిన్ మెకంజీ చాప్టరు చాలా చక్కగా ఉంది. చాప్టరు అనవచ్చునో లేదో! పోనీ ఈ శీర్షికలో 24వ పేజీలో కాలిన్ మెకంజీ ప్రాసంగికత లో ఉంటకించిన 1, 2, 3 పాయింట్లు మరియు 26వ పేజీలోని మెకంజీ జ్ఞాపికాఫలకం మీది వాక్యాలు బాగుండి, మేధావులకు మాత్రమే కాకుండా సామాన్య పాటకునికి సైతం తెలుసుకోదగ్గవిగా, అంటే అవిచదివితే వచ్చే అనిర్వచనీయమైన ఆనందాన్ని అందరూ పొందుతారు అనేటట్టుగా ఉన్నాయి. వైవిధ్య భరితమైన మంచి చరిత్ర పుస్తకాన్ని అందించిన బాబా గారికి నా సవినయ ధన్యవాదములు.

# ఫ్రెంచి పాలనలో యానాం - పుస్తక సమీక్ష

పానుగుమట్ల విష్ణుమూర్తి

ప్రతీదేశానికి అందులో ప్రాంతానికి ఒక చరిత్ర ఉంటుంది. పాత చరిత్ర వర్తమాన చరిత్రకు అద్దం పడుతుంది. గత చరిత్ర నడుస్తున్న చరిత్రకు గొప్ప స్ఫూర్తి నిస్తుంది. అందుకే రాజ్యాంగ నిర్మాత బాబా సాహెబ్ డా. బి.ఆర్. అంబేద్కర్ ఇలా అంటారు. 'చరిత్ర తెలియనివాడు చరిత్రను సృష్టించలేడు' అని. అందుకే ఎంతో సాహిత్య చరిత్ర గల కుటుంబంనుంచి వచ్చిన బొల్లోజు బాబా తన పుట్టిల్లు యానాం ఘన చరిత్రను అందరికీ తెలుపాలని గొప్ప తాపత్రయంతో వ్యయప్రయాసలకు గుర్తై ఈ పుస్తకాన్ని సృష్టించారు. ఆయన అభినందనీయుడు.

తొలుత ఈ పుస్తక వ్రాతప్రతిని ఆగష్టు 2010 నుండి మార్చి 2011 వరకు ప్రతీవారం ధారావాహికముగా జనమిత్రలో ప్రచురింపబడింది. అప్పుడే వందలాది పాఠకులు దీనిని పుస్తకరూపంలో తీసుకొని రావాలని ఎంతో ఉత్సాహాన్ని కలిగించారు. ఆ స్ఫూర్తే ఈ పుస్తకం.

1723 లో ప్రప్రథముగా యానాంలో 'కంపెనీ దె ఇండీస్' అనే ఫ్రెంచి కంపెనీ వ్యాపారం కొరకు యానాం భూభాగం మీద పాదం మోపారు. 13 జూన్, 1954 న ఫ్రెంచివారు నుండి యానాం విమోచనం చెందేవరకు యానాం ఫ్రెంచిపాలనలోనే ఉంది. సుమారు 250 సంవత్సరాలపైన యానంప్రాంత చరిత్రను బొల్లోజు బాబా ఈ పుస్తకంలో పేర్కొన్నారు.

ఈ పుస్తకంలో ఆనాడు యానాంలో జరిగిన సంఘటనలు- ఫ్రెంచి పాలకుల విధానాలు వారి నాగరికత, భాష, యానాం ప్రజల మాతృభాష తెలుగుపై వాటి ప్రభావము మొదలగు అంశాలపై గొప్ప పరిశోధక సమాచారాన్ని ఈ పుస్తకంలో పొందుపర్చారు.

ఇక రెండవ అంశము రాజధాని నగరం పుదుచ్చేరిలో యానాం పట్ల లేదా యానాం పురోభివృద్ధికి అప్పటి పాలకులు తీసుకున్న విధానాలు అభివృద్ధి కార్యక్రమాలను ఈ పుస్తకములో పొందుపర్చారు.

మూడో అంశము యానాం చుట్టూ ఉన్న బ్రిటిష్ ప్రాంతాల ప్రాబల్యం సమాజంలో పరిస్థితులు, కులాల గొడవలు, ఆది ఆంధ్రుల కార్యకలాపాలు ఈ పుస్తకంలో చూడవచ్చును.

నాలుగవ అంశము ఫ్రెంచివారి వ్యాపారం యానాంకు చైనా బంగారం దిగుమతి, దానిని నాణాలుగా తయారుచేయ్యగలిగిన గొప్ప స్వర్ణకారులు యానాంలో ఉండటం, అద్దకం చేనేత పనులకు యానాం ప్రసిద్ధ ప్రాంతముగా ఉండడం ఈ పుస్తకములో ఉన్నాయి.






ఇతర భారత రాజకీయ చరిత్ర పుస్తకాలలో దొరకని చరిత్ర ముఖ్యంగా భారతదేశం నుండి పోర్చుగీసు, ఫ్రెంచ్ వైదొలగడంపై జరిగిన పోరాట ఉద్యమాలను ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్ లేదా ఇతర భారత హిస్టరీ సంస్థలలో పుదుచ్చేరీ చరిత్ర ఎక్కడోగాని విపులంగా దొరకవు. బ్రిటిష్ వారు వారి శతృదేశాలైన పోర్చుగీసు, ఫ్రెంచి పాలనా వ్యవహారాల గురించి రికార్డు చెయ్యలేదు. ఫ్రెంచ్ రికార్డులలో మాత్రమే ఈ ఫ్రెంచి చరిత్ర లభ్యమగుతున్నది. అందువలన ఈ పుస్తకాన్ని ఇంగ్లీషులోకి మార్చితే ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్ లో కూడా ఇండియాలో జరిగిన ఫ్రెంచ్ చరిత్రను గుర్తించి రికార్డు చేయించవలసిన అవసరం ఉంది. పుదుచ్చేరి చరిత్రను విస్తృతస్థాయిలో భారత విద్యార్థులు చరిత్రకారులు చదవవలసిన అవసరం వారికి కల్పించాలి.

అంతర్జాతీయ గుర్తింపు పొమ్దిన యానాం చరిత్రను బొల్లోజు బాబా వారి నాయినగారు స్వర్గీయ బొల్లోజు బసవలింగం గారి ఆశయం మేరకు ఈ పుస్తకాన్ని తీశుకొచ్చానన్నారు. తనను కన్న ఊరు గొప్పతనాన్ని చెప్పాలని పరితపించిన తండ్రి ఆశతీర్చడానికి కొడుకు బాబా పడిన శ్రమ వ్యవప్రయాశలు గొప్ప ప్రశంశనీయాలు అందుకే

జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపీ గరీయసి అన్నారు పెద్దలు. యానాంలో ప్రతీ కుటుంబంలో ఈ పుస్తకం ఉండదగ్గదని చెప్పొచ్చు. రచయిత బొల్లోజు బాబాను మరోసారి అభినందిస్తున్నాను

పానుగుమట్ల విష్ణుమూర్తి
జనమిత్ర సంపాదకులు

(ఈ వ్యాసం 15-4-2012 జనమిత్ర పత్రికలో ప్రచురణ అయినది)

